# పార్టీ నిర్మాణం

రచన:

లీ షావ్ చీ

అనువాదం:

సి. మహేశ్

త్రిలింగ పబ్లిషింగ్ కంపెనీ,
విజయవాడ - 2

# ప్రవేశిక

కామ్రేడ్స్! నేషనల్ పార్టీ ఏడవ సమావేశంలో యిచ్చిన రిపోర్టులో కామ్రేడ్ మాసీయూంగ్ ప్రస్తుత జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను గురించి చాలా చక్కగా వివరించేడు. గత ఎనిమిది సంవత్సరాలనుండి చైనాజాతి జరిపిన జపాను వ్యతిరేక యుద్ధాన్నిగురించీ, ఆ యుద్ధంలో మన పార్టీ అనుసరించిన సక్రమపంథానుగురించీ చాలా చక్కగా సమీక్షించేడు. జపాను దురాక్రమణదారులను ఓడించటానికై చైనా ప్రజాశక్తులన్నింటినీ సమీకరించి, సమైక్య మొనరించుటకుగాను, ఓడించినతర్వాత స్వతంత్రమైన, స్వేచ్ఛాపూరితమైన, ప్రజాస్వామికమైన అభ్యుదయకరమైన నవ చైనాను నిర్మించుటకుగాను, యావద్దేశములోని చైనాప్రజలు అన్ని ప్రజాతంత్ర పార్టీలు, గ్రూపులు, అనుసరించవలసిన సమిష్టి పోరాట కార్యక్రమాన్ని రూపొందించేడు.

కామ్రేడ్ మాసీయూంగ్ రిపోర్టు, చైనా ప్రజలకు విజయసూచకమైన, యోధాత్మకమైన పిలుపు. నూతన ప్రజాతంత్ర రిపబ్లికు నిర్మాణానికది ఒక మాగ్నాకార్టా.

చైనా ప్రజలతోపాటు, కామ్రేడ్ మాసీయూంగ్ నాయకత్వాన మనపార్టీ, గత యిరువైనాలుగు సంవత్సరాల వీరోచితము పోరాటంలో, అందులో ప్రత్యేకంగా గత ఎనిమిది సంవత్సరాల కాలంలోని జపాను వ్యతిరేక యుద్ధంలో దానికి ఎదురైన అనేక కష్టాలను ఎదుర్కొంటూ, అత్యంత బాధాపూరితమైన మార్గాన ప్రయాణం చేసింది. చిట్టచివరకు మన

పార్టీ ఘనవిజయాలను సాధించింది. చైనా ప్రజలకు, చైనా జాతికి, మహోజ్వలమైన భవిష్యత్తును సాధించి పెట్టింది. మన పార్టీ తన నాయకత్వం క్రిందవున్న విముక్తప్రాంతాలు, అష్టమమార్గసైన్యం నూతననాల్గవసైన్యం తదితర సాయుధ ప్రజాశక్తులతో, జపాను వ్యతిరేక యుద్ధకేంద్రంగా జాతీయ విముక్తి వుద్యమకేంద్రంగా యీనాడు తయారయ్యింది.

మనపార్టీ పుట్టిననాటినుండి అది పరిపూర్ణంగా చైనా శ్రామికవర్గపు నూతనరాజకీయపార్టీగాపనిజేసింది. తన యావత్ శక్తినీ చైనాప్రజలకు సేవచేయుటయందు పరిపూర్ణ హృదయంతో అంకితం జేసింది. చైనాపరిస్థితులకు అనువర్తించుతూ మార్క్సిజం – లెనినిజంయొక్క గట్టి సైద్ధాంతికపునాదిపై మనపార్టీ నిర్మించబడింది. తత్ఫలితంగా మనపార్టీ అద్భుత విజయాలను సాధించింది. తన కార్యకలాపాన్ని నడుపుకొనుటలో మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతాలను, చైనా విప్లవం యొక్క ఆచరణతో సమైక్యమొందించునట్టి కామ్రేడ్ మావోసీ యాంగ్ సిద్ధాంతాన్ని వినియోగించుకొంటూ మనపార్టీ, చైనా జాతి, ప్రజలప్రయోజనాలకు పరిపూర్ణంగా ప్రాతినిధ్యం వహించే విప్లవకార్యక్రమాన్ని, విప్లవవిధానాలను రూపొందించింది. అది చైనాజాతికి, చైనాప్రజలకు శత్రువులైనవారందరికీ వ్యతిరేకంగానూ, చైనాజాతి ప్రజల ప్రయోజనాలకు ద్రోహంచేసే మతాలవారందరికీ వ్యతిరేకంగా రాజీరహితమైన పోరాటాన్ని నడుపుటయేగాక, పార్టీలోనున్న అన్నిరకాల అవకాశవాదాలను తుడిచిపెట్టేసింది. కామ్రేడ్ మావోసీయాంగ్ యొక్క ఘనసిద్ధాంత నాయకత్వాన మన పార్టీ చైనా

కార్మికవర్గానికి, తదితర శ్రామిత ప్రజలకు ప్రాతినిధ్యంవహించే, అత్యంతవిశ్వాసవంతులైన, ధైర్యవంతులైన, చైతన్యవంతులైన, శిక్షితులైన వారందరినీ సమీకరించింది. చైనా జాతికి, ప్రజలకు శత్రువులైన వారందరికీ వ్యతిరేకముగా గట్టిపట్టుదలతోనూ, ధైర్యవంతముగానూ పోరాడుతూ, శత్రువుల నెలా కొట్టాలో, వారి దెబ్బలనుండి ఎలా కాసుకోవాలో అన్న విషయాన్ని తెలుసుకుంటూ, మనపార్టీ చైనా కార్మికవర్గంయొక్క సుసంఘటిత అగ్రగామిదళంగా రూపొందింది. ప్రజలకు సేవజేయుటయందు మన పార్టీ అవిరళంగా తన ప్రాథమికనిర్మాణ సూత్రాలను అవలంబించుటచే, ప్రజలలో బాగా పాతుకొనిపోగలిగింది; అశేషప్రజానీకంతో అత్యంతసన్నిహిత సంబంధంకలిగిన సుశిక్షితపార్టీగా తయారయ్యింది. మన పార్టీ యంటే సుక్షిత కేంద్రీకృత ప్రజాస్వామికం కలిగినపార్టీ. తమంతటతామే యిచ్ఛాపూర్వకంగా వుక్కులాంటి క్రమశిక్షణను అవలంబించేసభ్యులతో ఏర్పడినపార్టీ మనది; మన పార్టీ తీవ్రవిమర్శనలను, ఆత్మవిమర్శనలను నడుపుతూ వుంటుంది. అది పార్టీలోపలగ్రూపుల నేర్పాటుచేయుటనూ, ముఠా కార్యకలాపాలను సహించదు. అది పార్టీలోనికి నూతనసభ్యులనుతీసుకొనేటప్పుడు జాగ్రతవహిస్తుంది; పార్టీసంఘంలోనూ, పార్టీపనిలోనూ ప్రతిసభ్యుడూ, ప్రత్యక్షంగా పాల్గొనాలి. ఇలాంటి నిర్మాణసూత్రాలన్నీ ఒక లక్ష్యానికి సేవచేస్తాయ్! అదేమంటే పరిపూర్ణంగా విముక్తి జెందుటకై ప్రజలను నడుపటానికి ఈ సూత్రాలన్నీ, ప్రథమ నేషనల్ పార్టీ కాంగ్రెసుచే ఆమోదించబడిన పార్టీనిబంధనావళి

లో చేర్చబడ్డాయి. ఇవన్నీ పరిపూర్ణంగా సవ్యమైనవని గత యిరువైనాలుగుసం॥ రాలలో సంభవించినఘనపోరాటాలచే రుజు చేయబడ్డాయి. మనపార్టీ యీ సూత్రాలపై సంఘటిత మొనరింపబడుటచే, అది తన రాజకీయకర్తవ్యాలను, దాని పోరాటాలలో సమైక్యతను విజయవంతంగా సాధించగలదనీ, అన్నిరకాల కష్టాలనూ అధిగమించగలదనీ, ప్రజలను ఘన విజయంవైపునకు నడుపగలదనీ, ధృవపడింది.

చైనాదేశపు అసంఖ్యాక విప్లవాత్మకప్రజానీకం మన పార్టీని వుత్సాహవంతంగా ఆహ్వానిస్తున్నదంటే, మనపార్టీని విశ్వసిస్తున్నదంటే మనపార్టీకి, చైనాప్రజల ప్రయోజనాలను పరిపూర్ణంగా ప్రాతినిధ్యంవహించే విప్లవాత్మక కార్యక్రమం, విధానా లుండుటవల్లనేగాదు; ప్రజలతో అత్యంతసన్నిహిత సంబంధంగలిగియున్న సంఘం, వుక్కులాంటి క్రమశిక్షణ, అనేక కఠినాతికఠినపోరాటాలనుండి తాను విజయవంతంగా బయటపడగలనని అది ప్రదర్శించిన పటిష్ఠమైన నిర్మాణ బల సామర్థ్యాలు మనపార్టీ కలిగియుండి; వీటివలనకూడా చైనా దేశపు అసంఖ్యాక విప్లవాత్మక ప్రజానీకం, మనపార్టీని వుత్సాహవంతంగా ఆహ్వానిస్తూవుంది. మనపార్టీపట్ల విశ్వాసం చూపుతూవుంది. శతృవు అత్యంతశక్తిమంతుడు, జిత్తులమారి, ఘోరరాక్షసుడవుటయేగాక, యమయాతనలకు గురియవుతున్న నలభైయేడున్నరకోట్ల చైనాప్రజలను విముక్తిజేయించుటకై జరుపవలసినపోరాటం కఠినాతికఠినమైనది. అలాంటి శత్రు వును వోడించుటకై, విముక్తిగొనివచ్చుటకై, యావత్

ప్రజలనూ నడుపుటకు మనపార్టీలాంటి దొక్కటే సాహసించ గలదు. నడుపగలదు.

ఈనాడు మనం మన పార్టీనిబంధనావళిని మరల పరిజూస్తున్నామంటే, మనపార్టీ స్వభావంలో మార్పులేమీ తీసుకొనిరావటంలేదు. అంతేగాక మనపార్టీ నిర్మాణంయొక్క ప్రాథమికసూత్రాలలో నేమీ మనం మార్చటంలేదు. అంతే గాక, యింతకుపూర్వం వుదహరింపబడిన మనపార్టీస్వభావాన్ని సూత్రాలనూ మనపార్టీ క్రొత్తగా సంపాదించుకొన్న అనుభవాలమీదనూ, గత మూడువిప్లవదశలలోనూ, కామ్రేడ్ మాసీయాంగ్ చే అదనంగా పరిపుష్టం గావించబడిన పార్టీ నిర్మాణసిద్ధాంతాలమీదనూ ఆధారపడి మనం, మనపార్టీని మరింతగా అభివృద్ధిజేసి బలపరచాలి. రానున్న గురుతర సంఘటనలను ఎదుర్కొనుటకూ, జపానుదురాక్రమణదారులనూ, వారి బంట్లనూ వోడించుటకూ స్వాతంత్రమైన, స్వేచ్ఛాపూరితమైన, ప్రజాస్వామికమైన, సమైక్యమైన,సంపత్తికరమైన నూతనప్రజాతంత్ర రిపబ్లికును స్థాపించుటకూ మన పార్టీపోరాటశక్తిని అత్యద్భుతంగా పెంచుటకూ, అసంఖ్యాక చైనాప్రజానీకంతో మనపార్టీసంబంధాన్ని బలపరచుటకూ, మనపార్టీయొక్క యీ స్వభావాన్ని సూత్రాలను మరింతగా అభివద్ధిపరచటం, బలపరచటం పరిపూర్ణంగా అవసరం.

ఏమైనప్పటికి మనపార్టీ నిబంధనావళి – నియమాలు, విధులు – పార్టీయొక్క మూలసూత్రాలను వివరించుటయే గాక, యీ సూత్రాల ననుసరించి పార్టీనిర్మాణానికి అవలంబించవలసిన ఆచరణ – పద్ధతులను, పార్టీ నిర్మాణరూపాలకు,

పార్టీ ఆంతరంగిక జీవితానికి సంబంధించిన నియమాలనుకూడా వివరిస్తూవుంది. పార్టీ ఆంతరంగిక పరిస్థితులచేతనూ, బాహ్య పరిస్థితులచేతనూ, దాని రాజకీయ కర్తవ్యాలచేతను పార్టీ నిర్మాణరూపాలు, పనిపద్ధతులు నిర్ణయించబడతాయి. అందువలన యివి కొంతవరకు మృదువుగావుండాలి. పరిస్థితులు మారుటవల్లనూ, పనిపరిస్థితులు విభిన్నంగా వుండుటవల్లనూ, పార్టీ నూతనరాజకీయ కర్తవ్యాలను ప్రారంభిస్తుంది. అప్పుడు నిర్మాణరూపాలను, పనిపద్ధతులనుకూడా వైదాని ననుసరించి మార్పుజేయాలి; అలా చేయకపోతే పాత నిర్మాణరూపాలు, పాతపనిపద్ధతులు, మనపార్టీ పనియొక్క అభివృద్ధిని ఆటంకపరుస్తాయి, మన రాజకీయ కర్తవ్యాల నిర్వహణను ఆటంకపరుస్తాయి. మనం ఎన్నడూ, సైద్ధాంతికంగాగానీ, రాజకీయంగాగాని, యే మృత సూత్రాలకూ కట్టుబడలేదు. మన పార్టీ నిర్మాణరూపాలనుగానీ, యే నిర్మాణ రూపాలనుగానీ, మార్పుజేయుటకువీలులేనట్టి కఠిననియమాలుగాఎన్నడూ భావించలేదు. అందువల్లనే మనపార్టీ సృజనాత్మకమైన మార్క్సిస్టు రాజకీయపార్టీల చైనా విప్లవంయొక్క అభివృద్ధికి సంబంధించిన యదార్థ పరిస్థితుల కనుగుణ్యంగానూ, మన నూతన రాజకీయ కర్తవ్యాలపైననూ, మనం నూతనంగా సంపాదించుకొన్న అనుభవంపైననూ, అధారపడుతూ మన మప్పుడప్పుడు, మన నిర్మాణరూపాలను పని పద్ధతులను మార్పు జేసుకొనగలిగేం. అందువలన మన పార్టీయొక్క ప్రాథమిక నిర్మాణసూత్రాలక్రింద, నూతన వాతావరణాన్ని,

పార్టీలోని నూతన పరిస్థితులను పరిగణనలోనికి తీసుకొంటూ పార్టీ నిబంధనావళిని సరిచేయటం పూర్తిగా అవసరం.

తన ప్రాథమిక నిర్మాణ సూత్రాలను ఉల్లంఘించ రానివిగా పార్టీ గట్టిగా విశ్వసిస్తుంది. ఏమైనప్పటికీ పార్టీ తన కార్యకలాపాలను విస్తృత పరచుకొనుటకు, తన రాజకీయ కర్తవ్యాలు నిర్వహింపబడుటకు తన కార్యాచరణ ఐక్యతను సాధించుటకు పరిస్థితుల కనుగుణ్యంగా తన నిర్మాణరూపా లను, పనిపద్ధతులను రూపొందించుకోవాలి.

ఏడవ నేషనల్ పార్టీ కాంగ్రెసు పార్టీ నిబంధనావళిలో అత్యంత ప్రధానమైన సవరణలను, అనుబంధాలను చేస్తుంది. అలాంటి సవరణలు, అనుబంధాలు చేయవలసిన అవసర మేమిటి?

ఈ క్రిందివి దానికి కారణాలు.

1. 1928, ఆరవ నేషనల్ పార్టీ కాంగ్రెసుచే మనపార్టీ నిబంధనావళి సవరింపబడి యిప్పటికి 17 సంవత్సరా లయ్యింది. ఈ 17 సంవత్సరాలలోనూ, పార్టీలోపలి, వెలుపలి పరిస్థితులు బాగా మారిపోయాయి. పూర్తిగా నూతనరాజకీయ కర్తవ్యాలను నిర్వహించుటకుగాను, పార్టీసభ్యులందరినీ సమీ కరించవలసిన అవశ్యకత, పార్టీని యీనాడు ఎదుర్కొంటూ వుంది.

2. గత 17 సంవత్సరాలలోనూ, చైనాలో విప్లవా త్మక పోరాటాన్ని నడుపుటలో మనపార్టీ సంపాదించుకొన్న అనుభవాలు, చాలాఅద్భుతమైనవి. అత్యంత ప్రధానమైనవి.

ఈ అనుభవాలను సమీక్షించటం వీటిని మన పార్టీ నిబంధ నావళిని బలపరచుటకై వినియోగించటం, మనపార్టీ నిర్మాణాన్ని బలపరచుటకై వుపయోగించటం చాలా అవసరం.

3. ప్రత్యేకపరిస్థితులు యేర్పడుటవలన, ఆరవనేషనల్ పార్టీకాంగ్రెస్‌లో ఆమోదించబడిన పార్టీ నిబంధనావళిలోని చాలా నిబంధనలు వర్తనీయతను పోగొట్టుకొన్నాయి. తత్ఫలితంగా పార్టీ నిబంధనావళినిగురించి పార్టీసభ్యులు కావలసిన శ్రద్ధనుజూపుట మానివేసెరు. చురుకుగా అమలుజరుపుట లేదు. అందువలన యీనాటి యదార్థపరిస్థితులకు పరిపూర్ణంగా అనుగుణ్యాంగా వుండే నూతనపార్టీ నిబంధనావళిని రూపొందించవలసిన భారం ఏడవనేషనల్ పార్టీకాంగ్రెస్‌పై వుంది.

పార్టీచరిత్రలోని తదితరదశలతో పోల్చిజూస్తే యీనాడు మనపార్టీకి కొన్ని నూతనవిశిష్ట స్వభావాలున్నాయనుట సుస్పష్టం.

ఈనాటి మనపార్టీ యీక్రింది స్వభావాలను కలిగియుంది :-

1. జాతి మొత్తంమీద అవకాశంగలిగిన, సువిశాలమైన ప్రజాస్వభావంగలిగిన పార్టీ మనపార్టీ. దేశంలో నున్న ప్రజలందరూ పార్టీపై ఆశలపెట్టుకొంటున్నారు. అలాంటిపార్టీ మనది. మనపార్టీ సభ్యత్వం యీనాడు 12 లక్షల 10 వేలు, దాని సంఘాలు దేశమంతటా వ్యాపించివున్నాయి. దాని మెంబర్లు దేశమంతటావున్నారు. యిలాంటి మనపార్టీని దేశంలో ప్రజలందరూ తమ రక్షకుడుగా భావిస్తున్నారు.

2. విప్లవాత్మక యుద్ధకళను పరిపూర్ణంగా అభ్యసించినదవుటచే దీర్ఘ విప్లవాత్మక యుద్ధాలలో కాకలుదీరిన పార్టీ మనపార్టీ. ప్రస్తుత జపాను వ్యతిరేకయుద్ధంలో మనపార్టీ నాయకత్వాన సంఘటిత పరచబడిన అష్టమసైన్యమూ నూతన నాల్గవసైన్యమూ, యితర సాయుధ ప్రజాశక్తులూ, ప్రధాన సైన్యాలుగావున్నాయ్. జపాను దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా దీర్ఘకాలిక యుద్ధాన్ని నడుపుటకు యీ సాయుధ ప్రజాశక్తులపై చైనాజాతి ప్రజలూ ఆధారపడుతున్నారు. యుద్ధం ముగిసినతర్వాత చైనా ఒక ప్రజాతంత్రమైన సమైక్యమైన నవచైనాగా తయారవుటకుగాను చైనా జాతి, చైనాప్రజలు మన పార్టీపై ఆధారపడుతారు.

3. మనపార్టీ శత్రుశ్రేణులకు వెనుకభాగంలో గట్టి విప్లవస్థావరాలను యేర్పరచుటకుగాను 9 కోట్ల 50 లక్షల ప్రజలను నడిపింది. యీ స్థావరాలలో ప్రజాస్వామిక సంస్కరణలు నెలకొల్పబడ్డాయ్. అంతేగాక నూతన ప్రజాతంత్రం యొక్క రాజకీయ, ఆర్థిక, సైనిక, సాంస్కృతిక నిర్మాణం సాగించబడింది. తత్ఫలితంగా ఉత్పత్తిలో పెరుగుదల యేర్పడింది. ప్రజల జీవితవిధానం అభివృద్ధి అయ్యింది. సమాజంలో స్థిమితం యేర్పడింది. ప్రజల సాంస్కృతికస్థాయి, చైతన్యస్థాయిలు పెరిగేయ్. ఆవిధంగా మనపార్టీ యీ స్థావరాలలో నివసించే ప్రజలందరిని, జపాను దురాక్రమణదారుల దాడులను త్రిప్పికొట్టుటకు, దేశమంతటా ప్రజల విప్లవాత్మకపోరాటాలకు ప్రోత్సాహమిచ్చుటకు, సమీకరించి, సమైక్యపరచగలిగింది. నవచైనాకు యీ స్థావరాలొక నమూనా; దేశమంతటిలోనూ

ప్రజలు విప్లవానికి విజయాన్ని చేకూర్చగలదనుటకు యీ స్థావరా లొకహామీ,

4. "మూడురకాల వుద్యమంయొక్క సవరింపు" ఫలితంగా మనపార్టీ వివిధరకాల తప్పుడుఅభిప్రాయాలను విజయవంతంగా ఎదుర్కొంది; సైద్ధాంతికంగా, రాజకీయంగా, నిర్మాణాత్మకంగా అపూర్వమైన సమైక్యతను సాధించగలిగింది. పార్టీ చరిత్రలో అవకాశవాదపంథాలు పరిపూర్ణంగా తుడిచి వేయబడ్డాయ్. పార్టీలోని శ్రామికవర్గేతరభావాలను "మూడు రకాలవుద్యమంయొక్క సవరింపు"లో అధికంగా అధిగమించాం. ఇది యిలావుండగా కామ్రేడ్ మావోసీయాంగ్ చే నిర్వచించబడిన శ్రామికవర్గీయ మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం, పంథాలు యావత్తు పార్టీలో, అపూర్వమైన ఘనవిజయాన్ని సాధించేయి; పార్టీలో దాగియున్న జాతిని బలహీనపరచ జూచుచున్న విచ్ఛిన్నకులు, గూఢచారులనేకంమంది పార్టీనుండి వెళ్ళగొట్టబడ్డారు, ఆవిధంగా మనపార్టీ సైద్ధాంతికంగానూ, రాజకీయంగానూ, నిర్మాణాత్మకంగానూ యింతవరకెన్నడూ ఎరుగనివిధంగా ఐక్యతను సాధించింది, సంఘటితపడింది. చైనావిముక్తికి యిదెంతో దోహదకారి.

5. చివరి విషయమేమంటే మనపార్టీ తనకు ఒకగొప్ప నాయకుణ్ణి కలిగియుంది; అతడు దానిస్వంతెం. ఈ నాయకుడు కామ్రేడ్ మావోసీయాంగ్. కామ్రేడ్ మావోసీయాంగ్ మనపార్టీ నిర్మాత, నాయకుడు. యీనాటి చైనావిప్లవనిర్మాత దానికి నాయకుడు.

మన దేశపు వీర - శ్రామికవర్గానికి విశిష్టమైనప్రతినిధి

కామ్రేడ్ మాసీయాంగ్. మన గొప్పజాతి సాంప్రదాయా లలో వుత్తమమైన దానికంతకూ కామ్రేడ్ మాసీయాంగ్ ప్రతినిధి. అద్భుతమైన తెలివితేటలు గలిగిన సృజనాత్మకశక్తి గలిగిన మార్క్సిస్టు కామ్రేడ్ మాసీయాంగ్, మానవజాతి యొక్క వుత్తమోత్తమ సిద్ధాంతమైన మార్క్సిజంయొక్క సార్వజనికసత్యంతో చైనావిప్లవంయొక్క యదార్థ ఆచరణను సమ్మిళితమొనరించునట్టివాడు, కామ్రేడ్ మాసీయాంగ్. మన జాతీయ భావనావిధానాన్ని యింతకు పూర్వమెన్నడునూ, ఎరుగనంతటి ఘనస్థాయికి గొనిపోయి, బాధలగుందుచున్న చైనాజాతి ప్రజలకు ఏకైకసవ్యమార్గాన్ని, పరిపూర్ణవిముక్తికి గొనిపోవునట్టి ఏకైకసవ్యమార్గాన్ని, ఏకైకస్పష్టమార్గాన్ని కామ్రేడ్ మాసీయాంగ్ చూపెట్టేడు. ఇదే కామ్రేడ్ మాసీ యాంగ్ మార్గం.

మనపార్టీ, చైనాప్రజలూ, యీ మార్గాన్ని అనుస రించుతూ 1927 సంవత్సరానికి ముందుకాలంలో, యింత వరకు ఎన్నడూ కనివిని యెరుంగనంతటి గొప్ప విప్లవోద్య మాన్ని ప్రారంభించేరు. యీ ఘన విప్లవోద్యమనిర్మాత కామ్రేడ్ మాసీయాంగ్. వ్యవసాయక విప్లవకాలంలో, ఘనమైన సోవియట్ ప్రాంతాలూ, ఎర్రసైన్యమూ సృష్టించ బడ్డాయ్. వీటికి నిర్మాత, నాయకుడు, కామ్రేడ్ మాసీయాంగ్. జపాను వ్యతిరేక యుద్ధకాలంలో ఘనమైన విముక్తప్రాంతాలు సాయుధ ప్రజాసైన్యాలూ, అష్టమమార్గ సైన్యమూ, నూతన నాల్గవ సైన్యమూ, సృష్టించబడ్డాయ్. మరల వీటికికూడా కామ్రేడ్ మాసీయాంగే నిర్మాత, నాయకుడు.

కామ్రేడ్ మావో సేటుంగ్ మనపార్టీ నాయకుడు. అంతే గాదు తన యావత్తుశక్తినీ మనపార్టీ సేవకై పరిపూర్ణంగా అర్పించుతున్న సాధారణ సభ్యుడుకూడాను. పార్టీ క్రమశిక్షణను అన్నివిధాలా ఆచరించుటలో అతడు చక్కని పట్టుదల జూపుతాడు. అతడు ప్రజలకు నాయకుడు అయినప్పటికీ ప్రతి విషయాన్నీ ప్రజాభీష్టంపై ఆధారపడిచేస్తాడు. అతడు ప్రజల ముందు విశ్వాసవంతమైన సేవకుడుగా నమ్రతగలిగిన శిష్యుడుగా నిలబడుతాడు.

అసంఖ్యాకపీడితప్రజానీకపు విప్లవాత్మకపోరాటాలనుండి వుద్భవించిన వ్యక్తిగాబట్టి, రమారమి ముప్పది సంవత్సరాలకు మించిన చైనా విప్లవాత్మకపోరాటాలలో అగ్నిపరీక్షలకు గురియైన వ్యక్తిగాబట్టి పార్టీ కంతకునూ, అసంఖ్యాక పీడిత ప్రజానీకానికంతకూ, కామ్రేడ్ మావోసేటుంగ్ సుపరిచితుడు. మన పార్టీకి, చైనాజాతి, ప్రజలకూ అతడు నాయకుడన్నదానికి సత్యమైన అర్థమేమంటే, వీరందరూ అతనిలో విశ్వాసముంచారనీ తమనాయకుని ఎన్నుకొనుటలో విశిష్టమైన శ్రద్ధను జూపేరనీ దానికి అర్థం.

స్వంతముగా ఒక గొప్పనాయకుణ్ణి కలిగి యుండుటయే గాక, మనపార్టీకి, కామ్రేడ్ మావోసేటుంగ్ యొక్క వుత్తము సిద్ధాంతంతో సాయుధులైన ఆరితేరిన అసంఖ్యాక కేడర్లు:- కామ్రేడ్ మావోసేటుంగ్ చుట్టూ కేంద్రీకరించబడిన కేడర్లు వున్నారు. ఈ కేడర్లుకూడా దీర్ఘకాలిక పోరాటంలో అద్భుతమైన తెలివితేటలుగలిగిన వ్యక్తులుగా, చైనాజాతిలో వుత్తము వ్యక్తులుగా రుజువుచేసుకొన్నారు. అంతేగాక, చైనా విప్లవం

జాతీయనిర్మాణాలకు సంబంధించిన అన్నిరంగాలలోనూ, ఉత్త మోత్తమమైన తెలివితేటలను ప్రదర్శించేరు. మన పార్టీకి మన జాతికి అలాంటివుత్తమనాయకుడూ, అలాంటి వుత్తమ కేడర్లూ వున్నాయి కాబట్టి మనం అజేయులం. చైనాజాతికీ, చైనాప్రజలకు శత్రువులైనవారినందరినీ, తుడిచివేయగలం.

కామ్రేడ్స్! మనపార్టీ యీనాటికే జాతిమొత్తంమీద అవకాశం గలిగిన మార్క్సిస్టు - లెనినిస్టుపార్టీ. విశాల ప్రజాస్వభావాన్ని కలిగియున్నటువంటి సైద్ధాంతికంగానూ, రాజకీయంగానూ, నిర్మాణాత్మకంగానూ సుసంఘటితమైన పార్టీ మనది. స్వంతనాయకుణ్ణి గలిగియున్న మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ మనది. ఇప్పటికే మనపార్టీ చైనా రాజకీయజీవితంలో నిర్ణయకశక్తిగా తయారయ్యింది.

మనపార్టీయొక్క ప్రస్తుతపరిస్థితుల ప్రధానవైఖరుల లాంటివి.

ఇప్పటికి మనపార్టీ సాధించిన అద్భుతవిజయాలు అలాంటివి. ఇవన్నీ చైనాప్రజలందరకూ ఘనవిజయాలు. చైనాప్రజలలో మార్క్సిజం - లెనినిజానికి యివన్నీ ఘన విజయాలు. మనపార్టీ నాయకుడైన కామ్రేడ్ మావోసీయాంగ్ రొక్క సిద్ధాంతం, నాయకత్వాలకు యివన్నీ ఘనవిజయాలు.

అయితే మనపార్టీలో లోట్లు, బలహీనతలు లేవని దీనికి అర్థంగాదు. ముందు కష్టాలు లేవని దీనికి అర్థంగాదు. మనలో లోట్లు, బలహీనతలూ యింకా వున్నాయ్. మన మింకా మనలక్ష్యానికి దూరంగానే వున్నాం. ముందుముందు అనేక కష్టాలను దాటవలసివుంది.

మనపార్టీలో అత్యధికభాగం గ్రామీణజిల్లాలలో వుంది. పార్టీసభ్యులలో చాలామంది రైతుకుటుంబాలు లేక పెట్టీ - బూర్జువావర్గాలనుండి వచ్చినవారు. కఠిన విప్లవాత్మకపోరాటాలలో వుక్కులాగున తయారైనప్పటికినీ సాధారణంగా జూస్తే మనపార్టీసభ్యుల సైద్ధాంతిక, సాంస్కృతికస్థాయిలు, వున్నతంగాలేవు. పార్టీలోపలనే కొంతమంది కామ్రేడ్స్ పనిలో వ్యక్తిగతవిధానావలంబనను యింకనూ అధిగమించలేదు. మరికొంతమందిలో పార్టీనుండి ప్రజలను దూరంచేసే అధికారకతత్వం (Commandism). నిరంకుశతత్వం (Buracracy) యుద్ధభూస్వామికతత్వం (Warlordism). లాంటి ధోరణులూ యావత్తు పార్టీ సమైక్యతను, ధృఢత్వాన్ని భగ్నంగావించునట్టి అంధ "శిఖరాగ్రతత్వం (Mountain-top-ism) లాంటి ధోరణులు యింకనూ వున్నాయ్.

మన పార్టీలోనున్న యీ లోట్లనూ, బలహీనతలనూ, అధిగమించాలంటే మరింతఘనంగా యత్నాలుచేయుటద్వారానే మరింతగా శ్రద్ధాపూర్వకమైన అధ్యయనాన్ని సాగించుటద్వారానే అధిగమించ గలుగుతాం.

చైనాజాతి ప్రజలతోపాటు మనపార్టీ దీర్ఘకాలికమైన వీరోచిత పోరాటాలద్వారా నడచి అందులో ప్రత్యేకంగా గత ఎనిమిది సంవత్సరాలనుండి వీరోచితమైన జపాను వ్యతిరేక యుద్ధంద్వారా నడిచి యీనాడు విజయాన్ని సమీపిస్తూవుంది. మన ప్రస్తుత కర్తవ్యమేమంటే, పోరాటం విజయం కొరకు ఆయత్తమవటం. జపాను దురాక్రమణదారులను పరిపూర్ణంగా తరిమివేసి, పోగొట్టుకొన్న నగరాలనూ, గ్రామా

లను తిరిగిపొందుటకుగాను మిత్రులతో భుజాలు కలుపుతూ చైనా ప్రజాశక్తు లన్నింటినీ, సమైక్యపరచటం సమీకరించ టం యావత్ దేశములోని ప్రజాతంత్ర వ్యతిరేక శక్తులన్నిం టినీ అధిగమించటం, స్వతంత్రమైన స్వేచ్ఛాపూరితమైన ప్రజాస్వామికమైన సమైక్యతా పూరితమైన సంపత్తికరమైన నవచైనాను నిర్మించటం అనేది మన ప్రస్తుత కర్తవ్యం. ఈ లక్ష్యాలను సాధించుటకుగాను, మనం, మన పార్టీ పనిని శతాధి కంగా బలపరచాలి. దాని నిర్మాణ పాత్రనూ, అన్ని సెక్షన్ల ప్రజలలో దానినాయకత్వాన్ని శతాధికంగా పెంపొందించాలి. వారందరినీ, మనలనూ, అపూర్వమైన గురుతర పోరాటాల కొరకు మన చరిత్రలో, అతిఘన విజయాన్ని సాధించుటకూ, సైద్ధాంతికంగానూ, రాజకీయంగానూ, నిర్మాణాత్మకంగానూ ఆయిత్తం జేసుకోవాలి. మన పార్టీ యొక్క సత్వర రాజకీయ నిర్మాణాత్మక కర్తావ్యాలివే.

మన పార్టీ నెదుర్కొంటున్న యీ పరిస్థితులు, కర్త వ్యాలు, మన పార్టీ నిబంధనావళిని సవరించుటకు ప్రారంభ విషయం యేర్పడ్డాయ్.

# పార్టీ నిబంధనావళి - సాధారణ కార్యక్రమం

మన మొక సాధారణకార్యక్రమాన్ని రూపొందించాం. దానిని నిబంధనావళికి ప్రారంభంలో కలిపేం. అది మనపార్టీ యొక్క మూలకార్యక్రమం. అది మన పార్టీనిబంధనావళిలో పార్టీనిబంధనావళియొక్క నియమాలు, నిబంధనలలో అభిన్న భాగం. తన కార్యకలాపాలకు ప్రామాణికంగా యీ సాధారణ కార్యక్రమాన్ని ప్రతిపార్టీసభ్యుడూ ఆమోదించాలి. ఈ సాధారణ కార్యక్రమం యావత్తు పార్టీయొక్క సమైక్యతనూ ధృఢత్వాన్ని మరింతగా బలపరుస్తుంది.

సాధారణ కార్యక్రమం పార్టీయొక్క గత యిరువై నాలుగు సంవత్సరాల పోరాట అనుభవాలకు ఒక రూపం. అంతేగాక, ప్రపంచకార్మికోద్యమం యొక్క వుత్తమ అనుభవాలను, సాధారణ కార్యక్రమం తనలో జీర్ణించుకొంది. మన పార్టీ నాయకుడైన కామ్రేడ్ మావోసీటుంగ్ సిద్ధాంతానికి యీ సాధారణ కార్యక్రమం ఒకమూర్తి. స్పష్టమైనభాషలో అది మన పార్టీస్వభావాన్ని, సిద్ధాంతాన్ని విపులీకరిస్తూవుంది. అది చైనావిప్లవం యొక్క స్వరూపాన్ని, ధ్యేయాలను, కర్తవ్యాలను, విశిష్టలక్షణాలనూ, వివరిస్తూవుంది. అది మనపార్టీ యొక్క మూలవిధానాన్ని, చైనా విప్లవంలో మనపార్టీ కలిగియుండవలసిన అవసర పరిస్థితులనూ, వర్ణించుతూవుంది. పార్టీలో అవకాశవాదానికి ఎక్కడా తావులేదని, అది సూచిస్తూ వుంద. అంతేగాక పార్టీలో ఆత్మవిమర్శనవిధానాన్ని పార్టీ యొక్క ప్రజాపంథాను, నిర్మాణ సూత్రాలను గురించి అది

చెప్పుతూవుంది. ఇవన్నీ యిదివరకే పార్టీ నిబంధనావళి సాధారణ కార్యక్రమంలో వుదహరించబడ్డాయి. ఈ క్రిందిసమస్యలపై కొన్ని వివరాలనుమాత్రము యివ్వదలచేను.

## I. మనపార్టీ స్వభావం

మనపార్టీ నిబంధనావళియొక్క సాధారణ కార్యక్రమం యీ క్రింది విషయాలను ఎత్తిచూపుతూవుంది. మనపార్టీ చైనా కార్మికవర్గంయొక్క సుసంఘటిత అగ్రగామిదళం, దాని వర్గసంఘంయొక్క అత్యున్నతస్వరూపం. మనపార్టీ, చైనా జాతి, ప్రజల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తూవుంది. మనపార్టీ ప్రస్తుతదశలో చైనాలో నూతన ప్రజాతంత్ర విధానాన్ని నెలకొల్పుటకై మనపార్టీ పనిజేస్తుంది. చైనాలో కమ్యూనిస్టు విధానాన్ని స్థాపించటం దాని అంతిమలక్ష్యం. మన పార్టీయొక్క యీ స్వభావాన్నిగురించి యింకేమైనా సందేహాలున్నాయా? లేవనుకుంటాను.

మనపార్టీ పుట్టకపూర్వం, చైనాజాతి, ప్రజలు తమలోని వుత్తముల నాయకత్వాన ఎనభై సంవత్సరాలకాలం పాటున, సామ్రాజ్యవాదానికీ, జమీందారీవిధానానికీ వ్యతిరేకంగా 1921 సంవత్సరంవరకూ అంటే చైనాకమ్యూనిస్టు పార్టీ పుట్టునంతవరకూ అవిచ్ఛిన్నంగానూ, వీరోచితంగానూ విప్లవపోరాటాలను జేసేరు. ఆనాటి జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల కనుగుణ్యంగా మనపార్టీ వుద్భవించింది. అంతర్జాతీయంగా జూస్తే, ఆనాటి ప్రధానవిషయాలేమంటే ప్రథమ ప్రపంచసంగ్రామం, రష్యాలో అక్టోబరు సోషలిస్టుమహావిప్లవం

సంభవించాయి. జాతీయంగాజూస్తే సామ్రాజ్యవాదుల దురాక్రమణ మహాదారుణంగా పెరిగిపోతూవుంది. జమీందారీ విధానానికి జెందిన యుద్ధస్వాముల పీడన మహాదారుణంగా పెరిగిపోతూవుంది. ప్రజల విప్లవాత్మక పోరాటాలు, 1919 సంవత్సరంలో సంభవించిన "మేనాల్గవ తేదీ వుద్యమాన్ని" వెంబడించి వుద్భవించిన శ్రామికవర్గోద్యమమనేవి ప్రధాన విషయాలు. ఈ పరిస్థితులన్నీ, కామ్రేడ్ మావ్‌సేయాంగ్ నాయకత్వాన చైనా దేశపు విప్లవవాదులందరూ మొట్టమొదటిసారిగా తమదృష్టిని తీవ్రవిప్లవ ప్రజాతంత్రంనుండి శ్రామికవర్గీయ కమ్యూనిజంవైపునకు మరలించుటకు, తత్ఫలితంగా చైనాకమ్యూనిస్టుపార్టీ వుద్భవించుటకు దోహదమిచ్చేయి.

మనపార్టీ పుట్టిననాటినుండీ, సుస్పష్టమైన వర్గచైతన్యాన్ని కలిగియుండి చైనాబూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని నడుపుటలో మనపార్టీ శ్రామికవర్గ దృక్పథాన్ని అవలంబించింది. చైనాకార్మికోద్యమం, చైనావిప్లవాల యదార్థ ఆచరణలతో మార్క్సిజం - లెనినిజంయొక్క సార్వజనిక సత్యాన్ని సమ్మిళిత మొనరించింది. తత్ఫలితంగా పురోగామితమైన శ్రామికవర్గ రాజకీయపార్టీకి తగినట్లుగా కార్యాచరణలో ఆదర్శప్రాయమైన విధానాన్ని పొందింది. ఇవన్నీ చైనావిప్లవానికొక తాజారూపాన్ని యిచ్చేయి. ఈనాటికి, యీయిరువైనాలుగు సంవత్సరాలలోనూ అత్యంతక్లిష్టమైన, బాధాకరమైన, అత్యంతసంక్లిష్టమైన విప్లవాత్మక పోరాటాలలో అగ్నిపరీక్షలకు గురియైన తర్వాత మనపార్టీ చైనావిప్లవానికి ఒక నూతనమైన, విజయసూచకమైన పరిస్థితిని కల్పించుటయేగాక,

అత్యుత్తమ అనుభవాలను పొందింది. ఈ అనుభవాలు కామేడ్ మాసీయాంగ్ యొక్క సృజనాత్మకమైన పని, పట్టుదల ద్వారా, చైనావిప్లవంయొక్క స్పష్టమైన ఆచరణతో మార్క్సిజం - లెనినిజం యొక్క సార్వజనిక సత్యాన్ని సమ్మేళనాన్ని అత్యుత్తమమైన సవ్యస్థాయికి గొనిపోయాయి. దీనికి అర్థమేమంటే మనపార్టి ఎల్లప్పుడూ పరిపూర్ణంగా ఒక నూతన రకానికి జెందిన శ్రామికవర్గీయ మార్క్సిస్టు లెనినిస్టు పార్టిగావుంది. యీనాడుకూడా అంతకన్న మిన్నగావుంది.

మన పార్టి యొక్క ప్రధాన సెక్షన్లు గ్రామీణ ప్రాంతాలలో నున్నప్పటికినీ, పార్టి మెంబర్లలో అత్యధిక సంఖ్యాకులు రైతాంగంనుండి పెట్టీ బూర్జువావర్గ మేధావులనుండే వచ్చినప్పటికినీ, పార్టిలో కార్మికుల సంఖ్య స్వల్పమైనప్పటికినీ. పార్టి సభ్యుల మొత్తంలో శ్రామికవర్గానికి అర్ధశ్రామికవర్గానికి (బీదరైతు వర్గానికి) జెందినవారి సంఖ్య మెజారిటీగావుంది. పార్టియొక్క యీ పరిస్థితులు, తదితరపరిస్థితులు, పార్టిల్లో పల ఎక్కువగా చిన్న ఎత్తు వుత్పత్తిదారులు సిద్ధాంతాలలాంటి ప్రధాన సమస్యల పరంపరలును సహజంగా రేపెట్టినాయి. మన పార్టిలోనున్న పెట్టీ బూర్జువాశక్తులద్వారా బూర్జువావర్గీయమైన జమీందారీ వర్గీయమైన సిద్ధాంతాలుకూడా మన పార్టిలోనికి చొచ్చుకొనివచ్చేయి. మన పార్టిలో కానవచ్చే వ్యక్తిగత తత్వముల (విషయిగత తత్వా) పాక్షికతత్వముల వాచాలత్వం, రాజకీయమైన నిర్మాణాత్మకమైన అవకాశవాదముల సామాజిక మూలాల మింపులోనేవుంది. ఏమైనప్పటికినీ

యిలాంటి విషయాలు, మనపార్టి శ్రామికవర్గంయొక్క రాజకీయపార్టి అన్నదానిని మార్చజాలవు.

మన పార్టి యొక్క శ్రామిక వర్గస్వభావం యీ క్రింది పరిస్థితులచే నిర్ణయింపబడింది.

1. ప్రపంచ శ్రామిక మహావిప్లవశకంలో మన పార్టి వుద్భవించింది. 1927 సంవత్సరానికిముందు సంభవించిన చైనా మహావిప్లవంపైనసూ, యీ విప్లవానికి ముందు పుట్టిన చైనా మహాకార్మికోద్యమంపైనసూ, ఆధారపడి మన పార్టి ప్రవర్థిత మయ్యింది. మనపార్టి అంతర్జాతీయ మార్క్సిస్టు-లెనినిస్టు వుద్యమపు సత్సాంప్రదాయా లన్నింటినీ తనలో యిముడ్చుకొని, చైనా కార్మికోద్యమంతో అవిచ్ఛిన్న సంబంధాన్ని కలిగియుంది.

2. చైనా విషయంలో కామ్రేడ్ మావోసీటూంగ్ యొక్క మార్క్సిస్టు-లెనినిస్టు ప్రబోధాలను దీక్షాయుతంగా అమలుజరుపుతూ అతనిచే రూపొందించబడిన రాజకీయ, నిర్మాణాత్మక పంథాలను అనుసరించి, మనపార్టి ప్రవర్థిత మయ్యింది. ఈ పంథాలను వ్యతిరేకించిన వారందరూ చరిత్రచే శిక్షింపబడ్డారు. కామ్రేడ్ మావోసీటూంగ్ నాయకత్వమున నడుపబడిన కేంద్ర కమిటీ యొక్క మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వానికి అంతులేని గౌరవంగలదు. ఈ నాయకత్వానికి పోరాటాలలో ఆరితేరినటువంటీన్నీ మార్క్సిజం-లెనినిజంచే సాయుధమైనటు వంటివిన్నీ సూటిగా కార్మికోద్యమంనుండి వుద్భవించినట్టివిన్నీ, కేంద్రకమిటీ మరియూ, కామ్రేడ్ మావోసీ

యాంగులచే సూచించబడిన ఆశయాలను సాధించ గలిగిన అను యాయులు అసంఖ్యాకంగా వున్నారు.

3. మనపార్టీయొక్క శ్రామికవర్గీయ కార్యక్రమం, విధానాలు, తదితరపార్టీలవాటితో భేదించుతాయి. ఈ కార్య క్రమం, విధానములవల్లనే మనపార్టీ, సామ్రాజ్యవాద-వ్యతిరేక మైన, జమీందారీవిధానవ్యతిరేకమైన చైనాప్రజల నూతన ప్రజాతంత్రవిప్లవాన్ని స్వతంత్రంగా సంఘటితపరచి, నడుప గలిగింది. ప్రస్తుత బూర్జువా - ప్రజాతంత్ర విప్లవంలో చైనా శ్రామికవర్గంయొక్క కర్తవ్యాలను గరిష్టస్థాయిలో పరిపూర్తి జెందించింది. సోషలిజం, కమ్యూనిజాలను అంతిమలక్ష్యాలుగా వుంచుకొని ప్రజానీకంపై శ్రామికవర్గంయొక్క విప్లవాత్మక నాయకత్వాన్ని సాగించింది.

4. ప్రతిపార్టీసభ్యుడూ, పార్టీయొక్క దీక్షాయుతమైన శ్రామికవర్గీయ క్రమశిక్షణను అమలుజరపాలి. ప్రతిపార్టీ సభ్యుడూ, పార్టీకార్యక్రమానికి, నిబంధనావళికి కట్టుబడి యుండాలి. ఒకపార్టీ సంఘంలో చురుకుగా పనిచేయాలి, సైద్ధాంతికంగానూ, రాజకీయంగానూ, నిర్మాణాత్మకంగా నూ. అన్నిసమయాలలోనూ పార్టీ తన శ్రామిక వర్గ-ఐక్యతను కాపాడుకొంటుంది. బలపరిచుకొంటుంది. తన అనుయాయు లలోనున్న అన్నిరకాల వ్యతిరేకశక్తులనూ, ఎట్టిపరిస్థితుల లోనూ సరిదిద్దుబడుటకు వీలుగాని, అవకాశవాదులనూ పార్టీ తనలోనుండి బయటకు గెంటివేసింది.

5. ఇరువై సంవత్సరాలకు పైబడిన అంతర్యుద్ధమూ, జాతీయయుద్ధమూ, మనపార్టీని వుక్కులాగున తయారు

చేసేయి. లక్షలాది పార్టీ సభ్యులు, సమాజంలో తా మవలం బించుచున్న వృత్తులను యిప్పటికి చాలా కాలంక్రింద వదలి వేసేరు. వదలివేసి విప్లవాత్మక సైనిక సమిష్టి జీవితాన్ని ప్రారంభించేరు. వారీవిధంగా జీవన్మరణ పోరాటంలో నిమగ్న మయ్యేరు. తత్ఫలితంగా వారు కఠినమైన ఒక సైద్ధాంతిక నిర్మాణాత్మక ప్రబోధాన్ని తయారీనిపొందేరు. తత్ఫలితంగా వారి వర్గచైతన్యం సమిష్టిభావం పెంపొందాయి. నిర్మాణం క్రమశిక్షణపట్ల వారిజ్ఞానం బలపడింది. శత్రువునకు వ్యతిరేకంగా గట్టిగా నిలబడుటకుగాను, యావత్తు పార్టీ సమైక్యంగాను, ధృడంగానూ వుండాల్సిన అవసరాన్నిగురించీ, ప్రతి పార్టీ సభ్యుడూ బేషరతుగా కేంద్రనాయకత్వమునకు లోబడ వలసిన అవసరాన్ని గురించీ, విప్లవాత్మక పోరాట పరంపరల క్రమంలో పార్టీలోనున్న వూగిసలాట శక్తులనన్నింటినీ అవిరామంగా యేరి పారేయువలసిన అవసరాన్నిగురించీ వారు అర్థం జేసుకొన్నారు.

6. మార్క్సిస్టు లెనినిస్టు అధ్యయనంద్వారా పెట్టీ బూర్జువావర్గానికి జెందిన పార్టీమెంబర్లు పరిపూర్ణమైన సైద్ధాంతిక సంస్కరణను పొందేరు ఇది వారిలోనున్న పెట్టీ బూర్జువావర్గ స్వభావాన్ని మార్చివేసింది. శ్రామికవర్గీయ పురోగామిత యోధుల లక్షణాలను వారికిది ప్రసాదించింది.

ఈ విధంగా స్థాపించబడిన, వుక్కులాగున తయారు చేయబడిన, శిక్షగరపబడిన ఒకపార్టీ, ఉదాహరణకు యే పెట్టుబడిదారీ దేశంలోని శ్రామికవర్గ పార్టీతోనైనా పోల్చిచూస్తే దానికేవిధంగానూ తీసిపోదు.

పార్టీసభ్యుల సామాజికమూల మొక్కటే ప్రతిదానిని నిర్ణయించునట్టిది గాదు. మన పార్టీయొక్క రాజకీయ పోరాటాలు, రాజకీయజీవితం, దాని సైద్ధాంతిక శిక్షణ, దాని సైద్ధాంతిక రాజకీయనాయకత్వం అనేవే నిర్ణాయకవిషయాలు. మనపార్టీ సాధారణకార్యక్రమం, దాని నిర్మాణసూత్రాలు, పార్టీలో శ్రామికవర్గసిద్ధాంతాల, శ్రామికవర్గపంథాల ఆధిక్యతను ధృవపరచుతున్నాయి. పార్టీలో పెటీబూర్జువావర్గీయ సిద్ధాంతం యెంత బాహుళ్యంగా కనుపడినప్పటికినీ ఫరవాలేదు. దానికి పార్టీలో స్థానంలేదుగా! అంతేగాక, పార్టీశిక్షణ ద్వారానూ, "మూడురకాల వుద్యమంయొక్క సవరింపు" ద్వారానూ యీ పెటీబూర్జువావర్గీయ సిద్ధాంతాన్ని ఎదుర్కొని అవిరామంగా దానిని సరిజేస్తున్నాం. అంతేగాక, యీ పెటీబూర్జువావర్గీయ సిద్ధాంతం, ప్రజాప్రయోజనాలకు అనుగుణ్యమైనది గాదని రుజువైపోవుటచే, వట్టి దివాలాకోరని కూడా ధృవపడిపోయింది.

కొన్ని యూరోపియను దేశాలలోని లేబరుపార్టీల సభ్యత్వంయొక్క సామాజిక మిశ్రమం, వాటి స్వభావాన్ని నిర్ణయించలేనట్లుగానే, మనపార్టీ సభ్యత్వం యొక్క సామాజిక మూలం, మనపార్టీ స్వభావాన్ని నిర్ణయించజాలదు. పైన చెప్పబడిన లేబరు పార్టీలలోని అత్యధిక సంఖ్యాక సభ్యులు కార్మికవర్గం నుండి వచ్చినవారై నప్పటికినీ, యీ లేబరుపార్టీ కార్మిక వర్గానికి ప్రాతినిధ్యం వహించే రాజకీయపార్టీలుగావు, ఆ దేశాలలోని కార్మిక వర్గాల కర్తవ్యాలను అవెన్నటికినీ సాగించలేవు.

చైనాలో పెట్టీ బూర్జువా వర్గమునకు జెందిన విప్లవాదులు అసంఖ్యాకంగా, మనపార్టిలో జేరారు. ఇది చాలా మంచివిషయం. మన పార్టి వీరిని విసర్జించరాదు. కార్మికుల లోని పురోగామికశక్తులను మనపార్టిలోనికి తీసుకొనివచ్చుటకు అత్యధిక శ్రద్ధను జూపాలన్నమాటనిజమే. అయితే శ్రమజీవులకు సంబంధించిన అన్ని సెక్షన్లలోనూ పురోగామిక శక్తులను అత్యధికసంఖ్యగా మనపార్టిలోనికి తీసుకొని వచ్చుట కూడా చాలాఅవసరం. అలాచేసినప్పుడే, మనపార్టి ప్రజలలో విశాల భావానికి సంబంధించిన శక్తిమంతమైన పార్టిగాతయారవుటకు సాధ్యమవుతుంది. శ్రామికవర్గం, తన అనుయాయుల స్థానాలను పెట్టీ-బూర్జువా వర్గీయులను చేర్చుకొనుటద్వారా నిరంతరం భర్తీచేసుకొంటూ వుండాలనేది తప్పనిసరియైన ఒక చారిత్రక నియమం.

పరివర్తనకు గురియవునట్టి వర్గాలగుటచే, పెట్టీ-బూర్జువావర్గానికి జెందినవారూ, రైతులు భిన్నాభిన్న క్రమం ద్వారా వారు నడువాల్సివస్తుంది. (అంటే పెట్టీ-బూర్జువా వర్గానికి జెందినవారూ, రైతువర్గానకి జెందినవారూ అదేవర్గంగా అలాగే వుండిపోరు. వారి ఆర్థికపరిస్థితులు నానాటికీ తీసికట్టుగా తయారవుటచే, వారు తమవర్గస్థాయిని కోల్పోయి, కార్మికులుగా - శ్రమశక్తియే ఆస్థిగా గలిగిన శ్రామికులుగా తయారవుతారు.) వీరిలో చాలా అల్పసంఖ్యాకులు బూర్జువా వర్గస్థాయికి ఎగబ్రాకునప్పటికినీ అత్యధికసంఖ్యాకులుమాత్రం దివాళాతీసి శ్రామికవర్గ అనుయాయులసంఖ్యను వుబ్బరిస్తారు. పెట్టి బూర్జువావర్గీయులు,కర్షకవర్గీయులూపరివర్తనకుగురియవు

నట్టి వర్గాలకు జెందినవారుగానున్న కాలంలో వారు వుదార వాద బూర్జువావర్గాన్నిగానీ, శ్రామికవర్గాన్నిగానీ రాజకీయంగా అనుసరించవచ్చును. సైద్ధాంతికంగా వారు బూర్జువావర్గ ప్రభావానికిగానీ శ్రామికవర్గప్రభావానికిగానిలోనుగావచ్చును.

అందువలన కొన్ని చారిత్రక పరిస్థితులలో పెట్టీ బూర్జువా వర్గంలోని విప్లవాత్మకశక్తులు శ్రామికవర్గ పార్టిలో అసంఖ్యాకంగా జేరవచ్చు. శ్రామికవర్గ శిక్షణను ఆమోదించ వచ్చును. అంతేగాక మరియొక విషయమేమంటే శ్రామికవర్గ పార్టియైన మనపార్టి వీరికి శిక్షణ గరపుటకు, వీరిని సంస్క రించుటకు, తగిన సామర్థ్యాన్ని గలిగియుంది.

మనపార్టిలో మనంపెట్టిన షరతులపై జేరినతర్వాత పైన జెప్పబడిన వర్గాలవారిలో చాలామంది మార్క్సిజం, లెనినిజం యొక్క పార్టి విద్యావిధానాన్ని దీక్షాపూరితంగా అధ్యయనం చేసేరు. ఆమో .ంచేరు. కామ్రేడ్ మావోసీటుంగ్ సిద్ధాంతాన్ని అధ్యయనంజేసేరు, ఆమోదించేరు. పార్టిక్రమశిక్షణను అమలు జరిపేరు. ప్రజల ఆచరణాత్మక విప్లవ పోరాటాలలో పాల్గొ న్నారు; అని మన అనుభవం చెప్పుతూవుంది. వారావిధంగా చేయుటద్వారా, తమ మూలస్వభావాన్ని మార్చుకొన్నారు. మార్క్సిస్టు లెనినిస్టులుగా శ్రామికవర్గ యోధులుగా తయా రయ్యేరు. పార్టి ఆశయాలకై చైనాలో కమ్యూనిజం ఆశయా లకై వీరిలో చాలామంది తమ ప్రాణాలను సైతం త్యాగం జేసేరు.

కాని, వీరిలో కొంతమంది చాలా అల్పసంఖ్యపార్టిలో జేరిన తర్వాత మార్క్సిజం - లెనినిజంను, మావోసీటుంగ్

సిద్ధాంతాన్ని దీక్షాయుతంగా, సవ్యంగా, అధ్యయనం జేయలేక పోయారు. అయితే, వీరిసంఖ్య చాలా అల్పం. వీరు తమ పాత దృక్పధాలనూ, పనిచేయుటలో పాతపద్ధతులను మార్చుకోలేక పోయారు. కొన్నిసమయాలలో వీరు మనపార్టిని పునర్నిర్మించే యత్నంతో తమ పెట్టీబూర్జువావర్గభావాలు, అభిరుచులకు అనుగుణ్యంగా మనపార్టి ఆంతరంగికజీవితాన్ని పునర్నిర్మించాలన్న యత్నంతో శ్రామికవర్గదృక్పధాలను, పనిపద్ధతులనూ వ్యతిరేకించేరుకూడా. ఆ విధంగా వారు సహజంగా యదార్థ మార్క్సిస్టు - లెనినిస్టులుగా, శ్రామికవర్గయోధులుగా - తయారుకాలేకపోవటమేగాక వారు పార్టిలో అన్నిరకాల పొరపాట్లనూ, తగాదాలనూ జనింపజేసేరు. ఈ విషయంకూడా చారిత్రక అనుభవంచే మరల రుజువు చేయబడింది.

అందువలన మనపార్టిలో జేరేవారందరూ మార్క్సిజం - లెనినిజాన్ని మాసీయాంగ్ సిద్ధాంతాన్ని తప్పనిసరిగా దీక్షాయుతంగా అధ్యయనంజేయాలి. పెట్టీబూర్జువవర్గ విప్లవాత్మక శక్తులు పార్టిలో జేరకపూర్వం, జేరినతర్వాతకూడా తమ సిద్ధాంతాన్ని పునర్నిర్మించుకొనుటకు చాలా కష్టపడి విధిగా అధ్యయనం చేయాలనుట వాస్తవం. అంతేగాక వారు తమ విషయిగత (Subjective) వ్యక్తిగత (individualistie) పాక్షిక (sectarian) ధోరణులను అధిగమించుటకు శ్రామికవర్గ దృక్పధాన్ని చేపట్టుటకు తమ పాతదృక్పధాన్ని విడనాడాలి. అలాంటి సంస్కరణను పొందనిదే వారు యోగ్యతగల పార్టీ మెంబర్లుగా అవజాలరు. పెట్టీ బూర్జువా విప్లవాత్మక శక్తులు పరిపూర్ణంగా జాగృతి పొందనప్పుడు (పరిపూర్ణ చైతన్యాన్ని

పొందనప్పుడు) యిది తరచుగా దీర్ఘమైన బాధాపూరితమైన క్లిష్టమైన క్రమం మన పార్టీని నిర్మించుటలో ప్రత్యేకంగా ప్రధాన సమస్య విశిష్టవైఖరి, యిందులోనేవుంది.

మనపార్టీలో శ్రామికవర్గ సిద్ధాంతాలకూ శ్రామిక వర్గేతర సిద్ధాంతాలకు మధ్యగల విభేదాలే ప్రధాన అంతర్గత వైరుధ్యాలు. యీ వైరుధ్యాలలో ప్రధానమైనది శ్రామిక వర్గ సిద్ధాంతానికీ, పెటీ బూర్జువా వర్గీయమైన, కర్షకవర్గీయ మైన సిద్ధాంతాలకూ మధ్యగల వైరుధ్యం. క్రమేణా యిలాంటి వైరుధ్యాలను తుడిచివేయుటద్వారానూ, మన పార్టీలో ప్రతి బింబిస్తున్న పెటీ బూర్జువావర్గీయమైన సిద్ధాంతాలనూ, తదితర వర్గాలసిద్ధాంతాలనూ, అవిరామంగా యేరిపారేయుటద్వారాను మన పార్టీలో మార్క్సిజం లెనినిజంయొక్క అధ్యయనాన్ని సాగించి బలపరచుటద్వారా మాత్రమే అంటే శ్రామికవర్గం యొక్క శాస్త్రీయసిద్ధాంతమైన మార్క్సిజం-లెనినిజంయొక్క అధ్యయనాన్ని సాగించి, బలపరచుటద్వారా మాత్రమే. మన పార్టీ నిర్మాణంపార్టీ పని, పురోగమించగలదు. అభివృద్ధి కాగలదు. తద్వ్యతిరేకంగా, పెటీ-బూర్జువా వర్గ సిద్ధాంతాన్ని పార్టీలో స్వేచ్ఛగా వ్యాపించ నిచ్చినట్లయితే, పార్టీనాయకత్వాలపైన అది అధికారం చెలాయించుటకు అవకాశమిచ్చినట్లయితే, శ్రామిక వర్గభావాలను అభివృద్ధిని అణగద్రొక్కుటకు దానికి అవకాశం యిచ్చినట్లయితే, మనపార్టీ నిర్మాణమూ, పార్టీపని తప్పకుండా వెనుక ముఖంపట్టుతాయ్. క్షీణిస్తాయ్. అందు వలన, మన పార్టీ నిర్మాణంలో ప్రధాన సమస్యయేమంటే సైద్ధాంతిక పునర్నిర్మాణమనేది. దాని కర్థమేమంటే మనపార్టీ

మెంబర్లకు, అందులో ప్రత్యేకంగా, పెట్టీబూర్జువా శిష్ట వాత్మ కళ క్తులకు; మార్క్సిజం-లెనినిజం సహాయంతో-శ్రామికవర్గ శాస్త్రీయ సిద్ధాంత సహాయంతో-శిక్షణ యివ్వటం, సంస్కా రాన్ని యివ్వనటం, అనేది మరియొక విధంగా చెప్పాలంటే మనపార్టీలోనున్న అన్నిరకాలకు జెందిన శ్రామిక వర్గేతర సిద్ధాంతాలను ఎదుర్కోవటం, అధిగమించటం, అనేదే అసలు సమస్య.

చైనా పెట్టీ బూర్జువావర్గం, సంఖ్యారూపేణా గొప్పది. మన పార్టీ మెంబర్లలో, యెక్కువసంఖ్య పెట్టీ-బూర్జువావర్గమూలం. చైనా శ్రామికవర్గము, మనపార్టి శైశవదశలో నున్న ప్పుడు చాలా అల్ప అనుభవాన్ని కలిగి యున్నాయ్. మనపార్టీ అది పుట్టకపూర్వం మార్క్సిజం – లెనినిజంలో తగినంతగా సిద్ధాంతరీత్యా తయారే లేదు. పోనీ మనపార్టీ స్థాపింపబడినతర్వాత దానికి తగినంత సైద్ధాంతిక అధ్యయనం వున్నదాయంటే అదేలేదు. ఎందువల్లనంటే పార్టీ స్థాపింపబడ గానే, అది మహాప్రవాహంలాంటి ఆచరణాత్మక విప్లవపోరా టాలలో వెంటనే పూర్తిగా దూకివేయవలసివచ్చింది. ఈ కారణాలవలన మనపార్టీ చాలా కాలంవరకు మార్క్సిస్టు – లెనినిస్టు సైద్ధాంతిక అధ్యయనకొరతతో బాధపడింది. ఆ విధంగా, అందువలన పార్టీమెంబర్లలో చాలామందికి సైద్ధాం తికజ్ఞానం లేకపోవుటవలన యీ సైద్ధాంతిక అజ్ఞానాన్ని అవ కాశంగా తీసుకొని, పార్టీలోనున్న పెట్టీబూర్జువాభావాలను నియోగించుకొని, యదార్థానికి అవకాశవాదమైనదాన్ని మార్క్సిజం – లెనినిజం ముసుగుక్రింద ప్రచారంచేయుటకు

మనపార్టీలోని సంస్కారంలేని పెట్టీబూర్జువాశక్తులకు, ఆనాడు సాధ్యమయ్యింది. కొన్నికాలాలలో పార్టీనాయకత్వ సంఘాలలో, పెట్టీబూర్జువావర్గసిద్ధాంతం తాత్కాలిక ఆధిక్యతను సంపాదించుకొనగలుగుటకు కారణమిదే.

పార్టీనాయకత్వంలో పెట్టీబూర్జువావర్గ సిద్ధాంతం ఆధిక్యతలో నున్నప్పుడు మితవాద లేక అతివాద అవకాశవాద పంథాలను రాజకీయంగానేకాక పార్టీనిర్మాణం, పార్టీ - సంఘటన రంగంలోకూడా అనుసరించబడ్డాయ్.

పార్టీనిర్మాణం, పార్టీసంఘటనలలో అనుసరించబడిన మితవాద - అవకాశవాదపంథా కొంతిమంది కామ్రేడ్స్ అనుసరించిన వుదారవాద - పంథాద్వారా వ్యక్తమయ్యింది. ఈ కామ్రేడ్సు, మనపార్టీని, పెట్టీ-బూర్జువావర్గ - వుదారవాద పార్టీగా తయారుజేయాలని యత్నించేరు. సైద్ధాంతిక, నిర్మాణాత్మక విషయాలలో కాఠిన్యాన్ని యీ కామ్రేడ్సు వ్యతిరేకించారు. విడచిపుచ్చేరు. పార్టీలోనికి సభ్యులకు సామూహికంగా, విచక్షణనుజూపకుండా చేర్చుకొనుటద్వారా, పార్టీలో తప్పుడుభావాలను సరిదిద్దకుండా అన్నిరకాల తప్పుడు భావాలు అభివృద్ధియవుటకు అవకాశమిచ్చుటద్వారా, పార్టీకి శత్రువులైనవారిపైననూ, పార్టీవిచ్ఛిన్నకులపైననూనిఘూపెట్టకపోవుటద్వారా "ప్రదర్శనతత్వాన్ని" అవలంబించుటద్వారా పార్టీలో బిగువులేని తనాన్ని మునాధోరణులను యథేచ్ఛతను బలపరచుటద్వారా వీరు పార్టీయొక్క కేంద్రీకృతప్రజాస్వామ్యాన్ని పటిష్టక్రమశిక్షణనూ బలహీనపరచేరు. మనపార్టీ యేకర్తవ్యాన్ని నిర్వహించాలన్నా, యిది ఆటంకపరచేదనుట

సుస్పష్టం; అంతేగాక మనపార్టీ పతనానికి యిది దారితీసేదనుట సుస్పష్టం.

పార్టీ నిర్మాణంలోనూ, పార్టీ సంఘటనలోనూ అవలంబింపబడిన "వామపక్ష" అవకాశవాదపంథా కొంతనుంది కామ్రేడ్సు చైనాస్వభావాలను పరిగణనలోనికి తీసుకోకుండా పార్టీనిర్మాణానికి సంబంధించిన విదేశ అనుభవాలను యాంత్రికంగా దిగుమతి జేసి వాటిని పిడివాదాలుగా తయారుజేసి అనుసరించిన దానిద్వారా వ్యక్తమయ్యింది. వారు, పార్టీ ఆంతరంగిక కేంద్రీకృత ప్రజాస్వామ్యం పైననూ, పార్టీ ఆంతరంగిక పోరాటాల పైననూపాక్షిక దృక్పథాన్ని మాత్రమే అవలంబించేరు. వారు "రాజీపనికిరాదు" అని వాదించేవారు. యాంత్రికక్రమశిక్షణపై నొక్కివక్కాణించే వారు. వారు పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని, శాంతిని విడచిపుచ్చేరు. సమస్యలపై తీవ్రంగా చర్చలు జరపటం, విమర్శనలను విడిచిపుచ్చేరు. పార్టీసభ్యుల చైతన్యం, చొరవల విషయాన్ని విడచిపుచ్చేరు. పార్టీలోపల మతగురువులులాగున ఆజ్ఞలు జారీచేయుట యుంటే అభిలాషపడేవారు, ఆవిధంగానే తమపాలన సాగించేరు. వారు "మర్మత్వవిధానాన్ని" (Obscuranti m) అవలంబించేవారు. పార్టీ మెంబర్లలో అంధ ఆజ్ఞానువర్తిత్వాన్ని ప్రోత్సహించేవారు, దాక్షిణ్యరహితమైనపార్టీ ఆంతరంగిక పోరాటాలను కొనసాగించేవారు. దాక్షిణ్యరహితంగా శిక్షలు వేసేవారు. పార్టీసభ్యులను మొత్తంగా తిసివేయటం, వెళ్ళగొట్టటం, శిక్షించటం జేసేవారు. తత్ఫలితంగా పార్టిలో యాంత్రికమైన క్రమశిక్షణ, భూస్వా

మిక విధానక్రమాలేర్పడ్డాయ్. పార్టి అంతరంగిక జీవితంలో స్తబ్ధతయేర్పడింది. వారా విధంగా చేయుటవలన పార్టి అంతరంగిక ఐక్యతయొక్క రూపాన్ని తాత్కాలికంగా మాత్రం సృష్టించగలిగేవారు. కాని, అలాంటి ఐక్యత కృత్రిమం, అగాధం, యాంత్రికమైనట్టిది. యీ కృత్రిమతత్వాన్ని ఒక్కమారు బట్టబయలు చేయుగానే పార్టీలో అంతరంగిక అరాజక పరిస్థితి ప్రారంభమయ్యేది. అమిత ప్రజాస్వామికం ప్రారంభమయ్యేది. అలాంటి పంథా మనపార్టీని తప్పకుండా నాశనంజేసి, దానిని ఒక సంకుచిత జీవరహిత పాక్షికతత్వ పీడితముఠాగా తయారు చేసేదనుట నిస్సందేహం.

పై రెండు పెడమార్గాలూ, నిర్మాణసమస్యపై పెట్టీ బూర్జువావర్గ వుదారవాదానికి, పాక్షికతత్వానికి, సాహసిక తత్వానికి ప్రతిబింబాలు.

పై నుదహరింపబడిన రెండు పెడమార్గాలేగాక మరి కొన్ని వున్నాయ్, కొంతమంది కామ్రేడ్సు తమ సైద్ధాంతిక రాజకీయ బలహీనతవల్లనూ అజ్ఞానంవల్లనూ పార్టీ సైద్ధాంతికంగా రాజకీయంగా నిర్మింపబడాలన్న దానిపై నొక్కిజెప్పుటకు బదులుగా పార్టి నిర్మాణంయొక్క నిర్మాణాత్మక వైఖరి మీదనే నొక్కి వక్కాణించేవారు. తత్ఫలితంగా పార్టి నిర్మాణం ఒక లాంఛనంగా తయారయ్యింది. అంధఆజ్ఞానువర్తిత్వం తప్ప మరేమీ ఎరుగనటువంటి "నిష్కళంకులు" అని పిలువబడే వారిపట్ల అభిమానం జూపేవారు, ప్రోత్సహించేవారు, తమంతట తాము ఆలోచించ గలిగినవారినీ సమర్థులైన వారినీ గ్రుడ్డిగా లోబడ నిరాకరించినవారినీ జూస్తే భయపడే

వారు. వారిని దూషించేవారు. ఇతరుల నిత్యజీవితాలలోని అల్ప విషయాలకుఅనవసర ప్రాధాన్యతను యిచ్చేవారు. అత్యంత ప్రధానమైనవిషయాలపై తాము శ్రద్ధ జూపేవారుగారు. అదే మంటే, సైద్ధాంతిక, రాజకీయదృక్పధాల రీత్యా పార్టిసభ్యులలో చైతన్యాన్ని కలుగజేయుటకు, పెంపొందించుటకూ, ఆవిధంగా పార్టి నిర్మాణాన్ని, క్రమశిక్షణనూ, బలపరచుటకూ యత్నించేవారుకారు. ఈ లక్ష్యాన్ని సాధించుటకు గాను, ప్రప్రధమంగా, వున్నత స్థాయికి, మధ్యమస్థాయికి జెందిన కేడర్ల చైతన్యాన్ని మేల్కొల్పి, వుచ్ఛ స్థితికి గొనిపోవాల్సిన అవసరం యెంతయినా గలదని వారు గ్రహించలేక పోయారు. వారు తమ దృష్టిని, పార్టిలోనున్న కార్మిక కర్షక శక్తులపైననే కేంద్రీకరించేవారు. సమర్థులైన మేథావులను జూచి భయపడేవారు.

ఆర్గనైజేషనల్ "నాయకత్వం" అనిపిలువబడేదాని విషయంలోనూ, సభలు, సమావేశాలు, జరుపుటలోనూ, యిక్కడనుండి, అక్కడకు అక్కడనుండి యిక్కడకు పరుగెత్తుటలోను, తమ బుర్రలనిండా అన్నిరకాల అల్ప విషయాలను నింపుకొనుటలోనూ, వారు నిమగ్నులయ్యేవారు. కాని వారు తమ మెదళ్ళను వుపయోగపరచేవారుకారు. సంఘనాయకత్వాన్ని, సైద్ధాంతిక, రాజకీయ నాయకత్వ స్థాయికి లేవనెత్తగలిగేవారు కారు. తత్ఫలితంగా, పార్టియొక్క నిర్మాణ కార్యక్రమం, దాని సైద్ధాంతిక, రాజకీయ నేతృత్వానికి విడాకులిచ్చినట్లుగా (భిన్నమైపోయేది) వుండేది. పార్టి నిర్మాణములో అంధత్వంయిదే. శ్రామికవర్గీయమైన ఒక మార్కిస్టు

లెనినిస్టు పార్టీని నిర్మించుటకు అనుసరించవలసిన మార్గంయిది గాదనేది సుస్పష్టమైన విషయం. పార్టీలోనున్న అవకాశ వాదం, అలాంటిపరిస్థితిని తనకు లాభదాయకంగా వినియో గించుకోవచ్చును.

మనపార్టీ అలాంటి తప్పుడ ధోరణులకు వ్యతిరేకంగా, అవిరామంగా రాజీరహితపోరాటాలను నడిపింది. వాటిని అధిగమించింది. మనపార్టీ, పార్టీనిర్మాణానికై కా।మేడ్ మాసీయాంగ్ యిచ్చిన పంథాను ఏకగ్రీవంగా అమోదించింది. అనుసరించింది. పైనుదహరింపబడిన తప్పుడుపంథాలతో అతిసున్నితంగా పోల్చిజూస్తే కా।మేడ్ మాసీయాంగ్ యిచ్చిన సవ్య-పంథా మొట్టమొదటగా సైద్ధాంతిక రాజకీయ నిర్మాణంపైనగూ, సంఘు-నిర్మాణంపైనకూడా నొక్కి-జెప్పింది. మనపార్టీనాయకత్వంలో సైద్ధాంతిక అధ్యయనం, సైద్ధాంతిక నాయకత్వం అనేవి ప్రథమస్థానాన్ని తీసుకోవాలని ఆయన మాకు తరచుగా చెప్పేవాడు.

కా।మేడ్ మాసీయాంగ్ మనపార్టీకి వివరణలతో కూడిన పరిపూర్ణమైన రాజకీయ, సైనిక నిర్మాణ పంథాలను రూపొందించి యిచ్చేడు. 1929 సంవత్సరంలో జరిగిన కూపైన్ కాన్ఫరెన్సుతీర్మానంలో కా।మేడ్ మాసీయాంగ్ మనపార్టీలోని శ్రామికవర్గేతరసిద్ధాంతంలో తలయెత్తిన వివిధవైపధ్యాలను తీవ్రంగా ఎత్తిజూపేడు. యీ పెడమార్గా లన్నింటినీ శాశ్వతంగా దూరంజేయువలసినదిగా మన కా।మే డ్సుకు పిలుపుయిచ్చేడు. అంతేగాక పార్టీలో ప్రతిబింబించు చున్న పెట్టీ-బూర్జువావర్గ సిద్ధాంతాల నన్నింటినీ, సరిజేయు

టకు అంటే పెట్టీ-బూర్జువావర్గ సిద్ధాంతానికి స్వభావాలైన విషయిగత తత్వాన్ని, పాక్షికతత్వాన్ని విసర్జించుటకు పెట్టీ బూర్జువావర్గ సిద్ధాంతానికి స్వభావాలైన చెప్పినదానినే మరల మరలచెప్పటం, భావన నిర్మాణవిధానాలను విసర్జించుటకుగాను పార్టీ సభ్యులలో సృజనాత్మకమైన అధ్యయన విధానాన్ని తన "మూడు రకాల వుద్యమంయొక్క సవరణ" అన్న దానిద్వారా కామ్రేడ్ మాసీయాంగ్ ప్రవేశపెట్టేడు. మార్క్సిజం-లెనినిజంయొక్క సార్వజనిక సత్యాన్ని చైనా విప్లవం యొక్క యదార్థమైన ఆచరణతో సంబంధాన్ని అత్యంత సన్నిహితంగా కల్పించాలని యీ క్రమమే మనపార్టీ అభివృద్ధికి సరియైన విధానమనీ మాసీయూంగ్ భావించేడు, ఆయన మనపార్టీ నిర్మాణక్రమాన్ని పార్టీయొక్క రాజకీయపంథాతోనూ, బూర్జువావర్గం మరియు సాయుధపోరాటాలకు మన పార్టీకి సంబంధాన్ని అత్యంత సన్నిహితంగా ముడిపెట్టేడు.

కామ్రేడ్ మాసీయాంగ్‌యొక్క యీ క్రిందిరచనలు కూలైన్ కాన్ఫరెన్సు తీర్మానం "నూతనదశ" అన్నదానిలోని రెండవభాగం "కమ్యూనిస్టు అను పత్రికను ప్రచురించాలి" అని కోరవయిచ్చిన సంపాదకీయం, "మన అధ్యయనాన్ని సంస్కరించుకోవాలి" అన్నరచన. "మూడు రకాల వుద్యమంయొక్క సవరణ" (అధ్యయనం, పార్టీ నిర్మాణం, వ్యాసరచన, అన్నవాటిని సవరించుకోవాలి) అన్నరచన; పార్టీ పదజాలాన్ని సందర్భరహితంగా వినియోగింపునకు వ్యతిరేకంగా వ్రాసిన వ్యాసం "మూడురకాల వుద్యమంయొక్క సవరణ" కొనసాగింపుపై కేంద్రకమిటీ

నిర్ణయాలు అన్నది (3 ఏప్రియల్ 1943) నాయకత్వ పద్ధతుల పై కేంద్రకమిటీ నిర్ణయాలు (1 జూన్ 1943) అన్న యీ రచనలూ, అతని తదితరరచనలూ పార్టీ నిర్మాణపంథాకు సారాంశాలు. అంతేగాక మనపార్టీయొక్క ప్రత్యేకవైఖరులకు అనుగుణ్యంగా అతనిచే రూపొందించబడిన సవ్యపంథా యిది. ఈ పంథాను సక్రమంగా మనం అనుసరించుట వలన, యిది మనకు పార్టీనిర్మాణంలో ఎదురయ్యే అన్నిరకాల అవకాశవాదపంథాలను, తప్పుడు పంథాలను అధిగమించుటకు సామర్థ్యాన్ని ప్రసాదించింది. తత్ఫలితంగా మనపార్టీ అత్యద్భుతంగా పురోగమించి, ఘనవిజయాన్ని చేపట్టింది.

పార్టీ నిర్మాణవిషయంలో యింతకుపూర్వం పైనుదహరింపబడిన అపసవ్యమార్గాలను మనపార్టీ అనుసరించినట్లయితే, మనపార్టీలో కార్మికవర్గశక్తులు అత్యధికంగా వున్నప్పటికీ మనపార్టీ కార్మికవర్గపార్టీగా తయారవగలిగేది కాదనుట సుస్పష్టమైనవిషయం. మనపార్టీసభ్యులలో యీనాడు కార్మికుల సంఖ్య మెజారిటీగా లేకపోయినప్పటికినీ మనం కామ్రేడ్ మావ్సేటుంగ్ యొక్క పార్టీ నిర్మాణపంథాను అవలబించాము. కాబట్టి తదనుసారంగా మనం కార్మికవర్గంయొక్క మార్క్సిస్టు పార్టీ నొకదానిని నిర్మించాం. భవిష్యత్తులో నిర్మించగలం.

చాలాకాలంవరకు మన పార్టీయొక్క ప్రధాన సెక్షన్లు గ్రామీణజిల్లాలలో నివసించేయి. దీనికి కారణమేమంటే, అసంఖ్యాకమైన రైతాంగప్రజలను కలిగిన అర్ధ - వలస, అర్ధ - భూస్వామిక దేశం చైనాదేశం; వర్తమానవిప్లవంలో అసంఖ్యాకమైనా రైతాంగప్రజ, ప్రధానశక్తిగా పనిజేసింది; నగ

రాలలోనున్న చైనా కార్మికవర్గం అణచివేయబడుటచే చాల కాలంవరకు విప్లవాత్మక కార్యకలాపాలను స్వేచ్ఛగా సాగించలేకపోయింది; అందువలన అది తన అగ్రగామిదళాన్ని తన మిత్రులైన అసంఖ్యాక రైతాంగప్రజలను సంఘటితపరచుటకు అవకాశం దొరకగానే వారి సహాయంతో నగరాలను విముక్తిజెందించుటకు గ్రామీణప్రాంతాలకు పంపింది. మన పార్టీ గ్రామీణ ప్రాంతాలలో దీర్ఘకాలంపాటు పడినదానికి అర్థమిదే. చైనాలో అస్తిత్వంలోనున్న విచిత్ర పరిస్థితులలో చైనా కార్మికవర్గానికి ప్రాతినిధ్యం వహించునట్టి మన పార్టీ నడువగలిగినమార్గ మిదొక్కటే. ఆ విధముగా మాత్రమే ప్రస్తుతదశలో మన పార్టీ తన కర్తవ్యాలను నిర్వహించగలదు. మన పార్టీ యీ రకముగా వ్యవహరించకపోయినట్లయితే చైనా కార్మికవర్గానికి ప్రాతినిధ్యము వహించగలిగియుండేదిగాదు. ఎందువల్లనంటే చైనాలోని ప్రస్తుత విప్లవం తప్పనిసరిగా రైతువిప్లవం. మౌలికంగాజూస్తే, చైనారైతాంగప్రజలను విముక్తిజెందించుట యనేదే చైనా కార్మికవర్గంయొక్క సత్వరకర్తవ్యం. శ్రామికవర్గపార్టీ నాయకత్వంక్రింద నడుపబడుతున్న చైనాలోని రైతాంగ మహాయుద్ధం, చైనాచరిత్రలోని తదితర రైతుయుద్ధాలన్నింటితోనూ భేదిస్తుంది. పరిపూర్ణవిజయాన్ని పొందుటకు సమర్థవంతమైనది. కార్మికవర్గఅగ్రగామిదళంగా మనపార్టీ గ్రామీణప్రాంతాలలో రైతాంగవిప్లవాన్ని సంఘటితపరచుటకు, నడుపుటకు తన గురుతరయత్నాలను కేంద్రీక

రించటం సహజమైన విషయం. తార్కికదృష్ట్యా సవ్యమైన విషయం.

చైనాజాతి, ప్రజలప్రయోజనాలకు మనపార్టీ ప్రాతినిధ్యంవహిస్తూవుందని మనపార్టీనిబంధనావళియొక్క సాధారణ కార్యక్రమం సూచిస్తూవుంది. ఇది మనపార్టీ, కామ్రేడ్ మాసీ యాంగ్ సిద్ధాంతాల సారాంశమిదేయనుట స్పష్టం. చైనా శ్రామికవర్గ ప్రయోజనాలకు, చైనాప్రజల ప్రయోజనాలకు అన్నిదశలలోను సాదృశ్యముంది. ఈనాడు మనపార్టీచే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగానూ, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగాను నడుపబడుచున్న నూతన ప్రజాతంత్ర విప్లవం శ్రామికవర్గ ప్రయోజనాలకేగాక, రైతాంగం, పెట్టి-బూర్జువా వర్గమూ, బూర్జువావర్గాల ప్రయోజనాలకై కూడా జరుపబడుచూవుంది. తనవర్గంయొక్క పాక్షిక సత్వర ప్రయోజనాలకేగాక, యావత్ ప్రజల ప్రయోజనాలకై నిలబడిననాడే తన వర్గాన్ని మాత్రమే సంఘటితపరచుట సమైక్యపరచుట యేగాక పోరాటాన్ని కొనసాగించుటకై యావత్ జాతినీ, ప్రజలనూ, సంఘటితపరచి సమైక్య మొనరించిననాడే చైనా కమ్యూనిష్టుపార్టి విజయవంతం కాగలుగుతుంది. ప్రజలందరినీ విముక్తి జెందించనిదే శ్రామికవర్గం తన విముక్తిని పొందజాలదు.

మరియొక విషయమేమంటే చైనా కార్మికవర్గమూ, తదితర శ్రామికప్రజలూంకలసి చైనాజాతికి ప్రధాన శరీర భాగంగా ఏర్పడ్డారు. వారి ప్రయోజనాలే, చైనాజాతి ప్రజల ప్రయోజనాలకు పునాదిగా యేర్పడుతాయి. స్వతంత్ర

మైన స్వేచ్ఛాపూరితమైన ప్రజాస్వామికమైన సమైక్యమైన సంపత్తికరమైన నవచైనాను సృష్టించుటకై పోరాడుటలో చైనా కమ్యూనిస్టుపార్టి యావత్ చైనాజాతి ప్రజల ప్రయోజనాలకే ప్రాతినిధ్యం వహించుటయేగాక చైనా కార్మికవర్గ ప్రయోజనాలకుకూడా ప్రాతినిధ్యం వహిస్తూవుంది. భవిష్యత్తులో చైనా కమ్యూనిస్టుపార్టి సోషలిజాన్ని మరియు కమ్యూనిజాన్ని పొందుటకై పోరాడునప్పుడుకూడా అది చైనాజాతి ప్రజలందరి ప్రయోజనాలకే ప్రాతినిధ్యం వహించుటయేగాక చైనా కార్మికవర్గ ప్రయోజనాలకుకూడా వహిస్తూ వుంటుందనుట యదార్థం. ఎందువల్లనంటే సోషలిస్టు కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి అర్థమేమంటే యావత్ మానవజాతినీ అంతిమంగా విముక్తి జెందించుటయని అర్థం.

## 2. పార్టీని నడిపే సిద్ధాంతం

పార్టీ నిబంధనావళి సాధారణకార్యక్రమంలో చైనా కమ్యూనిస్టుపార్టీ తన కార్యక్రమాన్నంతటినీ కామ్రేడ్ మాసీ యాంగ్ సిద్ధాంతంచే - అంటే, మార్క్సిజం - లెనినిజం యొక్క సిద్ధాంతాలను చైనావిప్లవంయొక్క యదార్థ ఆచరణతో సమైక్యమొనరించునట్టి కామ్రేడ్ మాసీయాంగ్ సిద్ధాంతంచే నడుపుకొంటుందనీ పిడివాదానికిగానీ, అనుభవవాదానికిగానీ సంబంధించిన పెడమార్గాలన్నింటినీ వ్యతిరేకిస్తుందనీ సూచించబడింది. చైనాకు సంబంధించిన చారిత్రక

వారసత్వాలనుగానీ, విదేశీయచారిత్రక వారసత్వాలనుగానీ అవి యేవైనప్పటికినీ తారతమ్యరహితంగా విసర్జించుటగానీ లేక ఆమోదించుటగానీ చేయం. మనం మార్క్సిస్టు గతి తార్కిక భౌతికవాదం, చారిత్రక భౌతికవాదాలపై ఆధార పడుతూ పై వాటిలో మూల్యవంతమైన వాటినన్నింటినీ అను వర్తనీయమైన వాటినన్నింటినీ విమర్శనాత్మకంగా ఆమో దిస్తాం. మూల్యరహితమైన వాటినన్నింటినీ వర్తనీయములు కానటువంటి వాటినన్నింటినీ, విడిచిపుచ్చుతాం. ఇదంతా స్పష్టంగా వుంది.

ఇక మిగిలినదల్లా యేమంటే మావోసీయాంగ్ సిద్ధాం తాన్ని మాత్రం వివరించాల్సివుంది.

మన పార్టీ పనినంతటినీ మావోసీయూంగ్ సిద్ధాంతం నడువు తుందని పార్టీ నిబంధనావళియొక్క సాధారణ కార్యక్రమం వొప్పుకొంటూవుంది. మనపార్టీ నిబంధనావళియే మార్క్సిజం లెనినిజంయొక్క మూలసూత్రాలనూ, మావోసీయాంగ్ సిద్ధాం తాన్నీ ప్రతి పార్టీసభ్యుడూ అర్థంజేసుకొనుటకు విధిగా కృషి చేయాలని సూచిస్తూవుంది. మరల రచించబడిన మన పార్టీ నిబంధనావళిలో యిది అత్యంత ప్రధానమైన చారిత్రిక లక్ష ణము. ఈ కాంగ్రెసూ, పార్టీయావత్తూ యీ వొప్పందాన్ని పరిపూర్ణహృదయంతో బలపరచుతాయని విశ్వసిస్తున్నాను.

శతాబ్దానికి పైబడి చైనాజాతీ, ప్రజలూ దుస్సహమైన యాతనలకు గురిఅయ్యారు. తమ విముక్తికై వారు జరిపిన కఠినపోరాటాలు, అమిత వ్యయపూరిత పోరాటాలు అత్యంత ఘనమైన అనుభవాలను కూడబెట్టినాయి. వారి ఆచరణాత్మక

పోరాటాలూ, వాటినుండిలభించిన అనుభవాలూ, తమ స్వంత మైన ఘనసిద్ధాంతాలను సృష్టించుకొనుటలో పరాకాష్టను పొందేయ్; తత్ఫలితంగా చైనాప్రజలు పోరాడుటలోనే సమర్ధులని వ్యక్తమవుటయేగాక వారికి ఒక ఆధునికశాస్త్రీయ విప్లవాత్మక సిద్ధాంతంకూడాకలదని ప్రదర్శితమయ్యింది.

చైనాబూర్జువావర్గం, రాజకీయంగానూ, ఆర్థికంగానూ బలహీనంగా వుండుటవల్లనూ, దానికి ప్రజలతో సంబంధం లేకపోవుటవల్లనూ దానిది పరిమితదృష్టి అవుటవల్లనూ దాని ఆలోచన పరిమితమైనదవుటచేతనూ దాని ప్రతినిధులు ఒకరకవు విప్లవాత్మక కార్యక్రమాన్ని, ప్రజాస్వామికభావాలనూ వెలిబుచ్చగలిగేరు. వాటిలోని మంచి పాంశాలన్నింటినీ మనం వారసత్వంగా యీనాటికే పొందేం. అందువలన వారు చైనాచరిత్రను, చైనావిప్లవానికి సంబంధించిన యావత్తు క్రమానికి పరిపూర్ణమైన క్రమబద్ధమైన ఒక శాస్త్రీయసిద్ధాంతాన్ని రూపొందించగలరా యన్నదానిని అటుంచినా క్రమబద్ధమైన ఒక విప్లవాత్మక సిద్ధాంతాన్ని కూడా నిర్మించజాలరనుట నిస్సంశయం. అలాంటి సిద్ధాంతం చైనా శ్రామికవర్గ ప్రతినిధులచేతనే సృష్టించబడగలదు. వీరిలో అత్యంత విశిష్టలక్షణాలు గలిగియున్నవాడు, గొప్పవాడూ కామ్రేడ్ మావోసేటుంగ్.

చైనా కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడినది లగాయతు చైనాప్రజావిప్లవానికి చైనాలో జాతీయ పునర్నిర్మాణానికి సంబంధించిన పరిపూర్ణమైనసవ్యమైనఏకైకసిద్ధాంతం సృష్టించబడి, అభివృద్ధిజెందించబడినదన్న విషయాన్ని యీ కాంగ్రెసు తీవ్రంగా ఆహ్వానించాలి. ఈ సిద్ధాంతం గతంలో మనపార్టీనీ,

మన ప్రజలనూ ఘనవిజయాలవైపునకు నడిపింది. ముందుకూడా మనపార్టీ, మన ప్రజలూ అంతిమంగా పరిపూర్ణవిజయాన్ని సాధించుటకు, విముక్తి పొందుటకు యీ సిద్ధాంతం నడుపుతుంది. తమ దీర్ఘపోరాటాలలో మనపార్టీ, మన ప్రజలూ సాధించిన ఫలితం, కీర్తులు తరతరాలుగా మనజాతికిది ఆశీస్సులను గొనివస్తుంది. ఈ సిద్ధాంతమేదంటే కామ్రేడ్ మావో సీయాంగ్ సిద్ధాంతం తప్ప మరేమీగాదు. చైనా చరిత్రకు, చైనా సమాజానికి, చైనావిప్లవానికి సంబంధించిన కామ్రేడ్ మావోసీయాంగ్ సిద్ధాంతం, విధానాలివే.

మావోసీయాంగ్ సిద్ధాంతమంటే, చైనా విప్లవంయొక్క యదార్థఆచరణతో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను సమైక్యపరచునట్టి సిద్ధాంతం. చైనాకు అనువర్తింపబడిన కమ్యూనిజం, మార్క్సిజం అది.

మావోసీయాంగ్ సిద్ధాంతమంటే ఒక వలస, అర్ధవలస, అర్ధ భూస్వామిక దేశంలోని వర్తమానకాలపు జాతీయ ప్రజాతంత్ర విప్లవంలో మార్క్సిజంయొక్క అభివృద్ధి పొడిగింపు యని అర్థం. ఒక నిర్ణీతజాతికి అనువర్తింపబడిన మార్క్సిజానికి సువ్యక్తవ్యక్తీకరణమది. చైనాజాతి ప్రజల దీర్ఘకాలిక విప్లవ పోరాటాలలోనూ మూడు మహావిప్లవయుద్ధాలలోను (ఉత్తర దేశ దండయాత్ర వ్యవసాయకవిప్లవం ప్రస్తుత జపాను వ్యతిరేక యుద్ధం) పెరిగి ప్రవర్ధితమైన సిద్ధాంతమది. అదెంత పరిపూర్ణంగా మార్క్సిస్టు తత్వీయమైనదో అంత చైనా తత్వం గలది.

మార్క్సిస్టు ప్రపంచ దృక్పథాన్ని సామాజిక దృక్ప

ధాన్ని గతితార్కిక భౌతికవాద, చారిత్రిక భౌతికవాద దృక్ప థాన్ని అనువర్తించుటద్వారా రూపొందించబడిన సిద్ధాంత మది. మరొకవిధంగా చెప్పాలంటే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాల గట్టిపునాదిపై ఆధారితమవుతూ చైనాజాతీయ లక్షణాలను పరిగణనలోనికి తీసుకొంటూ చైనాప్రజల విప్లవా త్మక పోరాటాన్ని నడుపుటలో చైనా కమ్యూనిస్టు పార్టి యొక్క ఘన అనుభవాలపైనను, ఆధునిక విప్లవాల ఘన అనుభవాలపైనను ఆధారపడుతూ అలాంటి అనుభవాలను అతిజాగ్రత్తగాను, శాస్త్రీయంగాను వివరించుకొంటూ రూపొం దించబడిన సిద్ధాంతమది. చైనాజాతి ప్రజల విముక్తిని సిద్ధింప జేసుకొనుటకు అదే సిద్ధాంతమూ, విధానమూ, అయివున్నది. మార్క్సిజం - లెనినిజంయొక్క శాస్త్రీయ పద్ధతిని అనువ ర్తింపజేసుకొనుట ద్వారా చైనా చరిత్రనూ, సామాజిక పరిస్థితులనూ దాని విప్లవాత్మక అనుభవాలన్నింటినీ సంకల నము జేయుటద్వారా, చైనా శ్రామికవర్గమూ తత్ఫలితంగా యావత్ చైనాప్రజల ప్రయోజనాలపై ఆధారితమై రూపొం దించబడిన సిద్ధాంతమది; తమ విముక్తికై జరుపునట్టి పోరా టంలో చైనా శ్రామికవర్గాన్ని చైనా శ్రమజీవులందరినీ నడు పుటకు ఏకైక సవ్యసిద్ధాంతమూ, విధానమూ అదే.

చైనాకు అనువర్తింపబడిన కమ్యూనిజంయొక్క సిద్ధాం తమూ, ఆచరణ - అంటే మావోసేటుంగ్ సిద్ధాంతం- దేశీయ, విదేశీయ శత్రువులకు వ్యతిరేకంగా జరుపబడిన విప్లవ పోరా టాలక్రమంలో మాత్రమే పెరిగి, అభివృద్ధిజెందినదని గాదు; అది పార్టీలోనున్న బెన్‌తూహిస్యూయిజం, లీలీసాన్ పంథా,

అటుతర్వాత జనించిన పంథాలైన "వామపక్ష" పెడమార్గాలు, లొంగుబాటుతత్వం, పిడివాదం, అనుభవ వాదాలను-వివిధ అపసవ్య, అవకాశవాదభావాలకు వ్యతిరేకంగా సూత్రముపై జరుపబడిన పోరాటాలక్రమంలోకూడా పెరిగి, అభివృద్ధి అయ్యింది. మనపార్టీని నడుపుటకు ఏకైక సవ్యసిద్ధాంతమూ, ఏకైక సవ్య, సాధారణపంథా యిదొక్కటే.

మాసేటుంగ్ సిద్ధాంతంయొక్క జననం, అభివృద్ధి పరిపక్వతకు యిరువైనాలుగు సంవత్సరాల చరిత్ర వుంది. కోట్లాదిప్రజల అసంఖ్యాక తీవ్రపోరాటాలక్రమంలో యీ సిద్ధాంతం మరల మరల పరీక్షించబడింది. చైనాను రక్షించుటకు భౌతికసత్యంగా, ఏకైకసవ్యసిద్ధాంతంగా, ఏకైకసవ్య విధానంగా రుజువుజేయబడింది. కామ్రేడ్ మాసేటుంగ్ నాయకత్వాన, మాసేటుంగ్ సిద్ధాంతనాయకత్వాన విప్లవం జరిగినప్పుడల్లా అది విజయవంతమయ్యిందనీ, అభివృద్ధి అయ్యిందనీ గతకాలపు చారిత్రకసంఘటనలనేకం చెప్పుతూవున్నాయ్. కామ్రేడ్ మాసేటుంగ్ నాయకత్వాన్ని వదలి మరొకరి నాయకత్వంక్రిందకు రాగానే అది భంగపాటు పొందటమో లేక తిరోగమించవలసిన దుస్థితికి గురియవుటయో సంభవించింది.

సామ్రాజ్యవాదశకంలో శ్రామికవిప్లవంతో మార్క్సిస్టు సిద్ధాంతాలను సమ్మిళితమొనరించటం మరియు రష్యనువిప్లవం యొక్క ఆచరణ యనేవి రష్యను బోల్షివిజం జననానికి కారణభూతమయ్యేయి—యిదే లెనినిజం - స్టాలినిజం; ఈ లెనినిజం స్టాలినిజం తమ పరిపూర్ణవిముక్తిని పొందుటకు రష్యను ప్రజ

లను నడుపుటయేగాక యావత్ ప్రపంచములోని ప్రజలందరు తమ విముక్తిని పొందుటకై నడిపింది, నడుపుతూ వుంది. మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్ల శిష్యుడుగా కామ్రేడ్ మాసీయాంగ్ చేసినదేమంటే అతడు సవ్యంగా మార్క్సిజం సిద్ధాంతాలను చైనావిప్లవంయొక్క యదార్థ ఆచరణతో సమైక్యమొనరించి, ఆ విధంగా తమ పరిపూర్ణ విముక్తిని సాధించుటకై చైనా ప్రజలను గతంలో నడిపిన, యీనాడు నడుపుచున్న చైనా కమ్యూనిజానికి - అంటే మాసీయాంగ్ సిద్ధాంతానికి - జనకుడయ్యాడు. ఈ సిద్ధాంతం అన్నిదేశాల ప్రజల విముక్తి పోరాటానికి, సాధారణంగానూ, ప్రత్యేకంగా తూర్పుదేశాలప్రజలకు అత్యంతవుపయోగకరమైన ఘనమైన సహాయాన్ని యిస్తూవుంది.

అతని ప్రపంచదృక్పథంనుండి అతనిపని - విధానం వరకు మాసీయాంగ్సిద్ధాంతం అభివృద్ధి, పరిశుద్ధీకరణక్రమంలో చైనాకు వర్తించబడిన మార్క్సిజం. అది పరిపూర్ణ విప్లవ సిద్ధాంతాన్ని, చైనాప్రజల జాతీయ పునర్నిర్మాణాన్ని యేర్పాటుచేస్తూవుంది. ఈసిద్ధాంతం కామ్రేడ్ మాసీయాంగ్ రచనలలోనూ, పార్టీసాహిత్యంలోనూ కనుపడుతూవుంది. అది ప్రస్తుత ప్రపంచపరిస్థితినిగురించి కామ్రేడ్ మాసీయాంగ్ యిచ్చిన వివరణనూ, చైనా ప్రత్యేకపరిస్థితులనూ మూర్తీకరించుతూ వుంది. నూతనప్రజాస్వామ్యం, రైతాంగవిముక్తి, విప్లవాత్మక సమైక్యసంఘటన, విప్లవాత్మకయుద్ధాలు, విప్లవ స్థావరాలు, నూతనప్రజాతంత్రరిపబ్లికు స్థాపన, పార్టీనిర్మాణం, సంస్కృతిపట్ల మాసీయాంగ్ సిద్ధాంతాలు, విధానాలంటే

యిదే. ఈ సిద్ధాంతాలు, విధానాలన్నీ, యెంత చైనా జాతీయ మైనవో అంత పరిపూర్ణంగా మార్క్సిస్టుసిద్ధాంత లక్షణాన్విత మైనవి. అంతేగాక చైనాప్రజల విజ్ఞానానికి వుత్తమరూపాలు. వారి సైద్ధాంతిక సాఫల్యతకు వుత్తమోత్తమ రూపాలు.

చైనా సామాజిక చారిత్రకాభివృద్ధిలోని విశిష్ట విచిత్రాలవల్లనూ, అది శాస్త్రీయ రంగంలో వెనుబడియుండుట వల్లనూ, చైనాకు మార్క్సిజాన్ని క్రమబద్ధంగా అనువర్తింప జేయుటం మార్క్సిజంయొక్క యూరోపియన్ రూపాన్ని చైనారూపంలోనికి పరివర్తింపజేయటం చాలా అద్వితీయ మైన సంశ్లిష్టమైన కర్తవ్యం. మరియొక విధంగా చెప్పాలంటే మార్క్సిజం దృక్పథరీత్యా మార్క్సిస్టు పద్ధతితో సమకాలీన చైనా విప్లవంయొక్క వివిధసమస్యలను పరిష్కరించుట చాలా క్లిష్టమైన విషయం. ఈ సమస్యలలో చాలావరకు ప్రపంచ మార్క్సిస్టులచే పరిష్కరింపబడి యుండుటగానీ, లేక లేవనెత్తబడి యుండుటగానీ, జరుగలేదు. ఎందువల్లనంటే ఇక్కడ చైనాలోని పీడిత ప్రజానీకంలోని ప్రధాన సెక్షన్లు రైతాంగ ప్రజలు. అంతేగాని కార్మికులుగారు. ఇక్కడ చైనాలో పోరాటం విదేశీ సామ్రాజ్యవాదుల పీడనకు వ్యతిరేకంగా నడుపబడుతూవుంది. మధ్యయుగాలనాటి అవశేషాలకు వ్యతిరేకంగా నడుపబడుతూవుంది. అంతేగాని, దేశీయపెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా జరుగుటలేదు.

కొంతమంది భావించుతూవున్నట్లుగా మార్క్సిస్టు రచనలను కంఠస్థం జేయుటద్వారా, రుబ్బుటద్వారా లేక వాటినుండి కొన్ని వుదాహరణలను యిచ్చుటద్వారా యీ గురు

తర కర్తవ్యం నిర్వహింపబడదు. వుత్తమస్థాయిలో శాస్త్రీయ విప్లవాత్మక తత్త్వాల సమ్మేళనం అవసరమని యిది కోరుతూ వుంది. విప్లవాత్మక పోరాటాలను నడుపుటలో పరిపూర్ణ చారిత్రక, సామాజికజ్ఞానం, గొప్ప అనుభవం వుండాలనీ, సామాజిక, చారిత్రక పరిస్థితులు వాటి అభివృద్ధులనుగురించి సరియైన, శాస్త్రీయమైన వివరణయిచ్చుట మార్క్సిస్టు - లెనినిస్టు పద్ధతులను వినియోగించుటకు నేర్పరితన ముండాలనీ కోరుతూవుంది. అంతేగాక అది శ్రామికవర్గ ఆశయం, ప్రజల ఆశయంపట్ల అంతులేని, విసుగులేని విశ్వాసాన్ని కలిగియుండాలని కోరుతూవుంది. ప్రజాబలంలో విశ్వాసాన్ని, వారి సృజనాత్మకశక్తి, వారి భవిష్యత్తులలో విశ్వాసాన్ని కలిగియుండాలని కోరుతూవుంది. ప్రజానీకపు అనుభవాలను, అభీష్టాన్ని, భావాలను వడగట్టుటలోనూ, వాటిని ప్రజా కార్యక్రమానికి అనువర్తింపజేయుటలోనూ నేర్పరితన ముండాలని కోరుతూ వుంది. ఆ విధంగా మాత్రమే చైనాలోని చారిత్రకాభివృద్ధి యొక్క ప్రతి ప్రత్యేకదశపైననూ, స్పష్ట రాజకీయ, ఆర్థిక పరిస్థితులపైననూ ఆధారితమై మార్క్సిజం - లెనినిజానికి స్వతంత్రమైన అద్భుత అలంకారాలను చేకూర్చగలం. ఆవిధముగా చేయుటద్వారానే చైనాప్రజలు తేలికగా అర్థంజేసుకొనుటకు అనువైనభాషలో దానిని వివరించుటకూ, దానిని ఒక నూతన చారిత్రక వాతావరణానికి, చైనా ప్రత్యేక పరిస్థితులకు అన్వయించేయుటకు చైనా శ్రామికవర్గము, తదితర శ్రమజీవులందరి హస్తాలలో దానినొక ఆయుధంగా తయారుజేయుటకు సులభసాధ్యమవుతుంది.

మార్క్సిజాన్ని చైనాకు వర్తింపజేయుటన్న క్లిష్ట కర్తవ్యాన్ని అత్యంత అద్భుతంగానూ, విజయవంతంగాను నిర్వహించినది కామ్రేడ్ మావోసేటుంగ్ తప్ప మరెవ్వరూ లేరు. యావత్ ప్రపంచమంతటిలో మార్క్సిస్టు వుద్యమం యొక్క చరిత్రలోని ఘనవిజయాలలో యిదొక్కటి. సర్వ సత్యాలలో మిన్నయైన మార్క్సిజాన్ని 475 మిలియన్ల ప్రజలు కలిగిన చైనాజాతికి అపూర్వరీతిలో విస్తరింపజేయుటమన్న మాట. మనం ప్రత్యేకంగా కృతజ్ఞత జూపవలసిన విశిష్ట విష యం యిది.

మన కామ్రేడ్ మావోసేటుంగ్, చైనా చరిత్రలో అత్యుత్తమ విప్లవకారుడు, రాజకీయ తంత్రజ్ఞుడేగాక దాని అత్యుత్తమ సిద్ధాంతకర్త, శాస్త్రవేత్తకూడాను. అతడు ప్రపం చాన్ని వూపివేసిన పోరాటాలను చేయుటకు మనపార్టీ యావ త్తును చైనాప్రజలందరినీ నడుపుటకు సాహసించుటయేగాక అతడు సిద్ధాంత విషయాలలో పొందిన సాఫల్యతలు అతని నైతిక ధైర్యమూకూడా మహోదాత్తమైనవి. సైద్ధాంతిక రంగంలో అతడు, చైనా విశిష్ట పరిస్థితులకు సరిపడని లేక పాతపడిన కొన్ని ప్రత్యేక మార్క్సిస్టు సూత్రాలను నిర్ణయా లను విడిచిపుచ్చుతూ వాటిస్థానంలో చైనాయొక్క నూతన చారిత్రక పరిస్థితులకు అనుగుణ్యమైన నూతన సూత్రాలను నూతన నిర్ణయాలను భర్తీచేయుచు ధైర్యవంతంగా తన సృజ నాత్మక శక్తిని ప్రదర్శించేడు. అతడు మార్క్సిజాన్ని చైనాకు వర్తింప జేయుటన్న క్లిష్టపూరిత భారవంత కర్తవ్యాన్ని విజయవంతంగా కొనసాగించగలుగుటకు కారణమిదే.

తగినంత సైద్ధాంతిక తయారీ లేకపోవుటచే మనపార్టీ మరియు పార్టీసభ్యులలో చాలామంది తమ పనులలో అనేక కష్టాలకు లోనయ్యేరు. అనవసరపు డొంకతిరుగుడు మార్గాలను పట్టిపోయేరు. కామ్రేడ్ మావోసీటూంగ్ యొక్క కృషికి వుత్సాహపూరిత సృజనాత్మకశక్తికి యీనాడు మనం ధన్యవాదాలర్పించాలి. అతని కృషిఫలితంగానే మనపార్టీకి చైనా ప్రజలకూ కావలసిన సైద్ధాంతికపునాది యేర్పడింది. ఇది వారి ఆత్మవిశ్వాసాన్నీ, వారి పోరాటశక్తినీ ద్విగుణీకృతం జేస్తుంది. విజయంవైపునకు చైనావిప్లవయాత్రను చురుకుగా ముందుకు తోస్తుంది. అందువలన కామ్రేడ్ మావోసీటూంగ్ సిద్ధాంతాన్ని అధ్యయనంచేయుటకై దానిని విస్తరింపజేయుటకై మనపార్టీ యావత్తునూ సమీకరించటం యీ సిద్ధాంతం ఒక సజీవశక్తిగా, నిరాటంకశక్తిగా తయారవుటకు యీ సిద్ధాంతంతో పార్టీసభ్యులను, విప్లవాత్మకప్రజలను సాయుధులుగా జేయటం యనేది మన ప్రధానకర్తవ్యమీనాడు. ఈ కర్తవ్య నిర్వహణకై మన పార్టీపాఠశాలలన్నీ, ట్రైనింగు తరగతులన్నీ కామ్రేడ్ మావోసీటూంగ్ రచనలను ప్రధానబోధనసామగ్రిగా స్వీకరించాలి. కేడర్లు కామ్రేడ్ మావోసీటూంగ్ రచనలను క్రమబద్ధంగా అధ్యయనం జేయాలి. మనపార్టీ పత్రికలన్నీ కామ్రేడ్ మావోసీటూంగ్ సిద్ధాంతాన్ని క్రమబద్ధంగా ప్రచారం చేయాలి. పార్టీ ప్రచారశాఖలు, సామాన్య పార్టీమెంబరు స్థాయికి అనుగుణ్యమైన విధంగా కామ్రేడ్ మావోసీటూంగ్ యొక్క ప్రధాన గ్రంథాలను సులభరీతిలో నుండునట్లుకూర్చి ప్రచురించాలి.

పార్టీలోనున్న భావనను నులిమివేసే పిడివాదాన్ని అధిగమించాం. మనం యిక అనుభవవాదంపై అర్ధంకులను వైదొలిగించుటకు యత్నించాలి. మాసీయాంగ్ సిద్ధాంతాన్ని అధ్యయనం చేయాలన్న వుద్యమాన్ని పార్టీలో లేవనెత్తాలి. ఆనాడు పార్టిలో మార్క్సిస్టు సంస్కృతి గురుతరంగా ప్రవర్తిత మవుతుందని ఆశించవచ్చును. దీని అర్ధమేమంటే చైనాలో ప్రజావిప్లవవిజయానికై సైద్ధాంతికంగా సమాయత్తమవుట యన్నమాట.

ప్రస్తుతం మరల రచించబడిన పార్టినిబంధనావళికీ, దాని సాధారణ కార్యక్రమానికీ మాసీయాంగ్ సిద్ధాంతం పునాది. దానిని అధ్యయనంజేయటం, దానిని పరివ్యాప్త మొనరించటం, తమపనిలో దాని దిక్సూచికత్వాన్ని అనుస రించటం పార్టిమెంబర్ల అందరివిధియై వుంది.

## 3. చైనా విప్లవ స్వభావాలు

ఈనాటి చైనాసమాజం అర్ధ – వలస, అర్ధ – భూస్వామికస్వభావాన్ని కలిగియున్నదని మన పార్టీ నిబంధనావళి యొక్క సాధారణకార్యక్రమం చెపుతూవుంది. కాని, రమా రమి పదికోట్ల జనాభాకలిగిన విముక్త ప్రాంతాలు నూతన ప్రజాతంత్రస్వభావాన్ని కలిగియున్నాయ్. చైనా సమాజం యొక్క ఆర్థిక, రాజకీయ అసమానతనూ, చిక్కుతనాన్ని యీ స్వభావం ప్రదర్శిస్తూవుంది.

చైనా సమాజంయొక్క యీ స్వభావంవల్లనూ, శక్తిమంతమైన చైనా కమ్యూనిస్టుపార్టీ అస్తిత్వంలో వుండుట వల్లనూ, ప్రస్తుత ప్రపంచ పరిస్థితులవల్లనూ; చైనా విప్లవం యొక్క ప్రధాన సంచాలకశక్తి, శ్రామికవర్గ నాయకత్వం క్రిందనున్న రైతాంగమును ప్రధానశక్తిగా కలిగియున్న అసంఖ్యాక ప్రజానీకమవుటవల్లనూ, చైనావిప్లవం, పాత రకానికిజెందిన బూర్జువా - ప్రజాతంత్ర విప్లవమూ గాదు, సరి క్రొత్తరకమైన శ్రామికవర్గీయ సోషలిస్టు విప్లవమూగాదు. అదెలాంటివిప్లవమంటే స్వభావరీత్యా నూతనరకపు బూర్జువా ప్రజాతంత్ర విప్లవం. ఈ విప్లవములో శ్రామికవర్గమూ, రైతాంగమూ, పెటీ - బూర్జువావర్గాలు (యీ మూడూ) ప్రధాన సంచాలకశక్తులు. దేశంలోనూ, విదేశాలలోనూ, అసంఖ్యాక మిత్రులు కలిగియున్న యీ విప్లవములో యితరవర్గాలుకూడా వచ్చి జేరవచ్చు. ఇందువలన ప్రస్తుత దశలో చైనా కమ్యూనిస్టుపార్టీయొక్క కర్తవ్య మేమంటే విదేశీయ సామ్రాజ్యవాదుల పీడననూ, దేశీయ జమీందారీ తత్వపీడనను యీ రెండింటినీ పరిపూర్ణంగా తుడిచిపెట్టి వేయుటకై పోరాడుటకుగాను విప్లవంలో పాల్గొనుటకు సమర్థులైన అందరు వ్యక్తులను, వర్గాలు, తరగతులు, జాతుల నన్నింటినీ సమైక్య మొనరించటం. అంతేగాక అన్నివిప్లవాత్మక వర్గాల మిత్రత్వంపై ఆధారితమైన అన్నిజాతుల స్వచ్ఛంద సమాఖ్యపై ఆధారితమైన ఒక నూతన ప్రజాతంత్ర రిపబ్లికును చైనాలో స్థాపించుటకొరకు పై నుదహరింపబడినట్లుగా వ్యక్తులు, తరగతులు, జాతులన్నింటినీ ఐక్యపరచాలి.

ఈ విప్లవాన్ని పరిపూర్ణంగా పూర్తిజేసిన తర్వాతనే నూతన ప్రజాతంత్రం అధ్వర్యాన చైనాయొక్క సామాజిక ఆర్థికవిధానం, నిర్ణీత హద్దులలో పూర్తిగా అభివృద్ధి జెందినప్పుడే చైనాలో సోషలిస్టు మరియు, కమ్యూనిస్టు సామాజిక విధానాలను నెలకొల్పుటకు అవసరమైన యత్నాలన్నీ చేయబడినతర్వాతనే అటుతర్వాత అంతిమంగా చైనా ప్రజల అవసరాలను అభీష్టాలను పరిగణనలోనికి తీసికొని వాటినుండి సలహాపొందిననాడే చైనా శ్రామికవర్గం చైనాలో సోషలిస్టు కమ్యూనిస్టు సామాజిక విధానాన్ని నిర్మించగలదు. గతంలో యీ సమస్యలు, పార్టీలో ఒకప్పుడు గందరగోళాన్ని రేపెట్టినాయి. అమిత తర్జనభర్జన వీటిపై జరిగింది. యీనాడివి కచ్చితంగా స్పష్టీకరించబడ్డాయ్.

అంతేగాక పార్టీనిబంధనావళియొక్క సాధారణ కార్యక్రమం చైనావిప్లవంయొక్క యితర స్వభావాలను అనేకాన్నికూడా స్పష్టీకరిస్తూవుంది. అవేవంటే చైనావిప్లవం కు. అసమానాభివృద్ధి, దాని దీర్ఘకాలిక స్వభావం రాటంలో సంశ్లిష్టత, సాయుధపోరాటంయొక్క ప్రాధాన్యత, ఒకానొక నిర్ణీతకాలంలో గ్రామీణజిల్లాలలో విప్లవస్థావరాల ప్రాధాన్యత అనేవి యీ పాయింట్లుకూడా యీనాడు స్పష్టీకరించబడ్డాయ్.

గతంలో పార్టీలో చైనావిప్లవస్వభావాల సమస్య అత్యంత వివాదగ్రస్తవిషయంగా వుండేది. ఈ సమస్యలను అపార్థంజేసుకొనుటవలన, పార్టీలో వివిధరకాల అవకాశవాద పొరపాట్లు జరుగుటకు తప్పకుండా దారితీసింది. అలాంటి

విషయాలపై అవకాశవాదానికి వ్యతిరేకంగా జరుపబడిన పోరాటాలలో మావోసీటుంగ్ సిద్ధాంతం తన పరిపూర్ణాభివృద్ధిని పొందింది. అందువలన యీ స్వభావాలను, పార్టీ నిబంధనావళి యొక్క సాధారణకార్యక్రమంలో కచ్చితంగా వివరించాలి. వీటిని ప్రతిపార్టీసభ్యుడూ పూర్తిగా తెలుసుకోవటం అవసరం.

మనపార్టీ చరిత్ర యావత్తూ చైనావిప్లవంయొక్క యీ స్వభావాలను అత్యుత్తమంగా వివరిస్తూవుంది. కీర్తివంతమైన, అద్వితీయమైన, చారిత్రాత్మకమైన యీ మార్గంద్వారా,యీ స్వభావాలను అర్థంజేసుకొనుటలోనూ, వినియోగించుట లోనూ కామ్రేడ్ మావోసీటుంగ్ యొక్క సిద్ధాంతనాయకత్వం క్రింద మే నాల్గవ తేదీ ఉద్యమంతర్వాత (1919) స్థాపించబడిన మార్క్సిస్టుల చిన్నగ్రూపు స్థాయినుండి మనపార్టీ బలోపేత మైన విప్లవస్థావరాలను నడుపుచున్న శక్తిమంతమైన పార్టీగా యీనాడు తయారయ్యింది.

ఒకవైపున చైనాజాతిని పీడించుచున్న విదేశీసామ్రాజ్య వాదుల పీడనను వ్యతిరేకంగానూ మరియొకవైపున అసంఖ్యాక చైనాప్రజానీకాన్ని పీడించుచున్న దేశీయ జమీందారీవర్గ పీడనను వ్యతిరేకంగా జరుపుచున్న విప్లవపోరాటల క్రమం లోనూ చైనాప్రజలు తమ విముక్తికై జరుపుచున్న పోరాటాల లోనూ చైనాలోని కార్మికోద్యమంపై ఆధారపడి చైనా కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధిజెందింది. చైనాజాతి, ప్రజలకు శత్రువులైన వారందరికీ వ్యతిరేకంగా జరుగుచున్న విప్లవ పోరాటాల క్రమంలో అది పెరిగింది. చైనాజాతిని పీడించిన దేశీసామ్రాజ్యవాదులను వ్యతిరేకంగానూ చైనాప్రజలను

పీడించిన దేశీయ జమీందారీవర్గం, దానిబంట్లు, దానిప్రచ్ఛన యేజంట్లకు వ్యతిరేకంగా జరుపబడిన విప్లవపోరాటాలలో అసంఖ్యాక చైనాప్రజానీకాన్ని సమైక్యపరచి నడిపిన చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్ర చైనాకమ్యూనిస్టుపార్టీ చరిత్రయే.

ఉత్తరదేశ దండయాత్ర వ్యవసాయక విప్లవం జపాను వ్యతిరేక యుద్ధం అను మూడు మహావిప్లవ యుద్ధాలతో చైనా కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధి జెందింది. పటిష్ఠమయ్యింది. మరియొకవిధంగా చెప్పాలంటే చైనా కమ్యూనిస్టుపార్టీ దీర్ఘకాలిక సాయుధపోరాటంలో ప్రవర్ధితమయ్యింది. పటిష్ఠమయ్యింది. మనపార్టీ చరిత్రలోని దీర్ఘకాలచరిత్ర యీ మూడు విప్లవయుద్ధాలచరిత్ర.

చైనా కమ్యూనిస్టుపార్టీ అసంఖ్యాక రైతాంగ ప్రజలతోనూ, పట్టణ పెటీ-బూర్జువా వర్గంతోనూ, అత్యంత సన్నిహితంగా ఐక్యమయిన క్రమంలో ప్రవర్ధితమైనది. సమాన శత్రువునకు వ్యతిరేకంగా పోరాడుటకై బూర్జువా వర్గంతో కలియుటలోనూ, బూర్జువా వర్గంయొక్క రాజీపడు స్వభావానికి వ్యతిరేకంగానూ అభివృద్ధి నిరోధక స్వభావానికి వ్యతిరేకంగానూ, బహుముఖ పోరాటాన్ని నడుపుటలో చైనా కమ్యూనిస్టు పార్టీ పెరిగింది. అందువలన మనపార్టీ చరిత్రయంటే అసంఖ్యాక రైతాంగ ప్రజానీకంతోను. పట్టణ పెటీ బూర్జువా వర్గంతోనూ, అత్యంత సన్నిహితంగా సమైక్యమవుటను గురించిచెప్పే చరిత్ర. అంతేగాక బూర్జువావర్గంతో సమైక్యమౌట ఆ వర్గానికి వ్యతిరేకంగా పోరాడుట యను చరిత్ర కూడాను.

విప్లవ స్థావరాలను అందులో ప్రత్యేకంగా గ్రామీణ జిల్లాలలో విప్లవస్థావరాలను స్థాపించుటద్వారా చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రవర్థితమయ్యింది. ఈ స్థావరాలలో నూతన ప్రజాతంత్రంయొక్క రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక నిర్మాణాన్ని కొనసాగించుటద్వారా చైనా కమ్యూనిస్టుపార్టి ప్రవర్థితమయ్యింది. చాలాకాలంవరకు మన పార్టీచరిత్ర, సమకాలీన చైనా విప్లవంకొరకు స్థావరాలనిర్మాణం, అందులో ప్రత్యేకంగా గ్రామీణ జిల్లాలలో విప్లవ స్థావరాలనిర్మాణము యొక్క చరిత్ర – ఈ విప్లవ స్థావరాలలో నూతన ప్రజాతంత్ర సంస్కరణల వివిధరకాలనూ, నిర్మాణకార్యక్రమాన్ని విజయవంతంగా అమలుజరుపటం, ఆ విధంగా మన పార్టీకి దేశము మొత్తంలోని ప్రజలందరికు శిక్షగరపటము అను వాటి చరిత్రయే మన చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్ర.

కడపటి విషయమేమంటే కామ్రేడ్ మాసీయాంగ్ వివరించినట్లుగా మన చైనా కమ్యూనిస్టుపార్టీ చైనా విప్లవం యొక్క స్వభావాలను అపార్థంజేసుకొన్న లేక నిరసించి విడచిన అవకాశవాదం, పిడివాదాలకు వ్యతిరేకంగా అది జరపిన పోరాటాలద్వారా సుసంఘటితమయ్యింది; ప్రవర్థితమయ్యింది; అనుభవవాదం బెన్-తూ-హిస్యూ తత్వం, లీలీసాన్ పంథా, అటుతర్వాత వచ్చిన "అతివాద" పంథా, లొంగుబాటు తత్వాలకు వ్యతిరేకంగా అది జరిపిన పోరాటాలద్వారా సుసంఘటితమయ్యింది; ప్రవర్థితమయ్యింది. ఘనాతిఘనముగా, అత్యంత సన్నిహితముగా మార్క్సిజం – లెనినిజంయొక్క సార్వజనికసత్యాన్ని చైనావిప్లవంయొక్క యదార్థఆచరణతో

సమైక్యమొనరించుటద్వారా చైనాకమ్యూనిస్టుపార్టీ సుసంఘటితమయ్యింది. ప్రవర్ధితమయ్యింది. అన్నిరకాల పార్టీ - ఆంతరంగిక - అవకాశవాదాన్ని వ్యతిరేకించుట, అణచివేయుట, చరిత్రయే. మనపార్టీచరిత్రయంటే, మాసీయాంగ్ సిద్ధాంతంచే సూచించబడిన, వివరించబడినవిధంగా చైనా విప్లవంయొక్క యదార్థఆచరణతో మార్క్సిజం-లెనినిజం యొక్క సార్వజనికసత్యాన్ని అవిరామంగా సమైక్యమొనరించుటను గురించి చెప్పే చరిత్రయే మన చైనాకమ్యూనిస్టు పార్టీచరిత్రయాంటే.

మన చైనాకమ్యూనిస్టుపార్టీ పయినించిన యదార్థ చారిత్రికమార్గాన్ని యిది స్పష్టీకరిస్తూవుంది.

ఈ చారిత్రకమార్గం ప్రస్తుతం చైనావిప్లవంయొక్క స్వభావాన్ని గురించీ, దాని సంచాలకశక్తులనుగురించీ, దాని అసమానాభివృద్ధినిగురించీ, దాని దీర్ఘకాలిక స్వభావాన్ని గురించీ, దానిపోరాటాల చిక్కుదనాన్ని గురించీ, సాయుధ పోరాటాల ప్రాధాన్యతనుగురించీ, గ్రామీణప్రాంతాలలో విప్లవస్థావరాల ప్రాధాన్యతనుగురించీ చాలా చక్కగా వివరిస్తూవుంది. చైనా విప్లవాభివృద్ధి స్వీయవిశిష్ట వైఖరులను కలిగియున్నదని అది సూచిస్తూవుంది. ఈ విప్లవంలో శ్రామిక వర్గంయొక్క మార్క్సిస్టు-లెనినిస్టు నాయకత్వం నిశ్చయాత్మక పాత్రను వహిస్తూవున్నదని అది వివరిస్తూవుంది.

మనపార్టి పయనించిన చారిత్రకమార్గమంటే చైనా విప్లవస్వభావాలను ఆధారంగాగొని మనపార్టి నాయకుడైన కామ్రేడ్ మాసీయాంగ్ యేనాడో వివరించిన చారిత్రకమార్గ

మది. కామ్రేడ్ మావోసేటుంగ్ నిర్ణయించినమార్గం మనపార్టీ చరిత్రకు అత్యంతపరిపూర్ణంగా సవ్యంగా ప్రాతినిధ్యంవహించే మార్గం. చైనాజాతి ప్రజలయొక్క సమకాలీన విప్లవచరిత్రకు పరిపూర్ణంగా, సవ్యంగా ప్రాతినిధ్యంవహించే మార్గమది. కొన్ని చారిత్రిక సమయాలలో యావత్తు పార్టీయొక్క నిర్మాణ కార్యకలాపాన్ని నిర్ణయించటం కామ్రేడ్ మావోసేటుంగ్‌నకు అసాధ్యమైపోయినప్పటికినీ ఈ చారిత్రికసమయాలు, కాలాలు విశిష్టంగా చూపెట్టినదేమంటే మనపార్టీయొక్క యదార్థ చరిత్ర చైనాశ్రామికవర్గం, చైనాప్రజల సత్యవిప్లవాత్మక సమన్వయతలు కామ్రేడ్ మావోసేటుంగ్ యెక్కడ పనిజేస్తే అక్కడే వున్నాయనీ, కామ్రేడ్ మావోసేటుంగ్‌ను తమ కేంద్రంగా చేసుకొని, తమ ప్రతినిధిగాజేసుకొని అవి అమలులో వుండసాగేయనీ, అభివృద్ధి అయ్యేయనీ అంతేగాని మరెక్కడా లేవనీ, మరేవ్యక్తీ వాటికి కేంద్రంగా వుండలేదనీ వ్యక్తీకరిస్తూ వున్నాయ్.

మనపార్టీ కామ్రేడ్ మావోసేటుంగ్‌యొక్క సిద్ధాంతంచే దిక్సూచితమై, చైనావిప్లవంయొక్క దీర్ఘక్రమంలో దాని ప్రత్యేకస్వభావాలమధ్య ప్రవర్తితమయ్యింది. పటిష్ఠమయ్యింది. అదే దిక్సూచికత్వాన మనపార్టీ యీ విప్లవ స్వభావాలను మరింతచక్కగా అర్థంజేసుకొంటూ, మరింతచక్కగా వినియోగించుతూ తన లక్ష్యాన్ని జేరుటకు అభివృద్ధి యవుటకు, పటిష్ఠమవుటకు. భవిష్యత్తులోకూడా పోరాడుతుంది. పరిపూర్ణ జాతీయ విజయాన్ని చైనా నూతన ప్రజాతంత్రం పొందునంత వరకూ యీ స్వభావాలు వుండగలవని నొక్కి జెప్పాట

కొరకే మనపార్టీ నిబంధనావళియొక్క సాధారణ కార్యక్రమం లో యీ స్వభావాలు ప్రత్యేకంగా నొక్కి వక్కాణించ బడ్డాయ్. అందువలన తాను తప్పులు చేయకుండా వుండా లంటే లేక చాలా తక్కువ తప్పులతో బయట పడాలంటే ప్రతిపార్టీ సభ్యుడూ యీ స్వభావాలను తన మనస్సులో తప్పకుండా ఎల్లప్పుడూ వుంచుకోవాలి. ఎప్పుడూ మరువరాదు. అలాచేయకపోతే గతంలోజరిగిన పొరపాట్లే మరల చాలా వరకు సంభవించవచ్చు.

వుదాహరణకు ప్రస్తుతదశలో చైనా విప్లవంయొక్క నూతన ప్రజాతంత్ర స్వభావాన్ని పరిగణలోనకి తీసుకోక పోవటంవల్ల పాలసీలో మితవాద లేక "అతివాద" పెడమా ర్గాలు యేర్పడ్డాయ్. మరింకా యేమంటే చైనా విప్లవం యొక్క అమిత అసమానతలను, తత్ఫలితంగా ఏర్పడిన విప్లవ పోరాటాల చిక్కుతనాలను అర్ధం జేసుకొనపోవుటవలన అమిత కేంద్రీకరణ, అసాధ్యమైన లాంఛనాలు, ఆచారాలు, సూక్ష్మీకరణ పద్ధతులు, సాధారణీకరణం, పనిలో కావలసిన మృదుత్వం లేకపోవటం యిలాంటివన్నీ జనించేయి. చైనా విప్లవంయొక్క దీర్ఘకాలిక స్వభావాన్ని అర్ధంజేసుకొనకపోవు టచే దీర్ఘకాలికమైన కఠిన పోరాటాలను నడుపుటకు వలసిన తాత్విక తయారీ లోపించింది; తత్ఫలితంగా క్లిష్టకాలాలలో ఉద్వేగతత్వం లేక నిరాశా నిస్పృహతత్వాల వివిధరూపాలు జనించేయ్. చైనా విప్లవంలో సాయుధ పోరాటంయొక్క ప్రాధాన్యతను అర్ధంజేసుకొనకపోవుటచే సైనికతంత్రజ్ఞానాన్ని తక్కువ అంచనావేయుటమో లేక ఆ జ్ఞానాన్ని పొందకుండా

వుండుటకో దారితీసింది. గ్రామీణ ప్రాంతాలలో విప్లవ స్థావరాల ప్రాధాన్యతను సరిగా మెచ్చుకోలేకపోవుట యనేది గ్రామీణ పరిస్థితులకు పట్టణపరిస్థితులకు సంబంధించిన దృక్పథాన్ని అనువర్తింపజేయుటం, గ్రామీణ కార్యక్రమాన్ని విడిచిపుచ్చటం లాంటివాటిని జనింపజేసింది. అంతేగాక మరియొక విషయమేమంటే, కొన్ని సమయాలలో పట్టణాలలో జరుపబడనలసిన కార్యక్రమాన్ని గురించీ, దాని ప్రాధాన్యతను గురించీ సరిగా అర్థంజేసుకొనలేకపోవుటవలన ఆ కార్యక్రమం పట్ల తగినంత శ్రద్ధ జూపకపోవటం, గ్రామీణ మితవాద తత్వాన్ని పట్టుకొని వేళ్ళాడటం సంభవించాయి. అన్ని సెక్షన్ల ప్రజలలోనూ దీర్ఘకాలికమైన, సహనాపూరితమైన పనిని కొనసాగించవలసిన ఆవశ్యకతను గుర్తించకపోవటంవలన బాధ్యతారహితమైన సాహసికతత్వం, అధికారిక తత్వాల ఆచరణలను జనింపజేసాయి.

మన కామ్రేడ్సు యీ స్వభావాలను సాధారణంగా అర్థంజేసుకొంటే సరిపోదు. మనంచేసే తప్పులను తగ్గించుకోవాలంటే, లేక తప్పులుచేయకుండావుండాలంటే యీ స్వభావాలను మన కార్యక్రమనిర్వహణ యంత్రాంగంలోనూ, సమాలోచనలోనికి తీసుకోవటం అవసరం. ప్రతి సమస్యను గురించి వ్యవహరించేటప్పుడు వీటిని సమాలోచనలోనికి తీసుకోవటం అవసరం. అందువలన యీ స్వభావాలు మనపార్టీ ప్రాథమిక కార్యక్రమంలో ఒకభాగంగా వుండాలి. లేక కనీసంగా ప్రస్తుత దశలోని ప్రాథమిక కార్యక్రమంలో ఒక భాగంగా వుండాలి.

## 4. పార్టీ ప్రజాపంథా

సాధారణ కార్యక్రమం మరియు పార్టీ నిబంధనావళి యొక్క నియమాలు, పార్టీయొక్క ప్రజాపంథాపై నొక్కి వక్కాణిస్తున్నాయ్. ప్రజాపంథా యనేది మనపార్టీయొక్క ప్రాథమిక రాజకీయ, నిర్మాణపంథాకాబట్టి; మరల రచించ బడిన ప్రస్తుత నిబంధనావళిలో యిది యింకొకవైఖరి. దీని కర్థమేమంటే మనపార్టీ సంఘాలన్నీ, మన పార్టీపనియంతా ప్రజానీకంతో అత్యంతసన్నిహితంగా మెడిపడాలని దానికి అర్థం.

కామ్రేడ్ మాసీయాంగ్ అనేకసార్లు మనపని యంత లోనూ ప్రజాపంథాను అనువర్తింపజేయాలని స్పష్టీకరించేడు. ఈ కాంగ్రెసునకు అతడిచ్చిన రిపోర్టులో మనం మనపనిలో ప్రజాపంథాను అవలంబించాలని ఎంతోగాఢంగా, నొక్కి వక్కాణించేడు.

కమ్యూనిస్టులమైన మనకు తదితర రాజకీయపార్టీలకు విశిష్టమైన భేదమేమంటే మనం తదితర రాజకీయపార్టీలవారి కన్న అసంఖ్యాక ప్రజానీకంతో అత్యంతసన్నిహితసంబంధాన్ని కలిగియుంటాం అని కామ్రేడ్ మాసీయాంగ్ చెప్పేడు. "ప్రజలసేవలో మనం త్రికరణశుద్ధిగా మునిగిపోవాలనీ ఒక్క క్షణంకూడా ప్రజలనుండి వేరుపడియుండకూడదనీ, వ్యక్తిగత ప్రయోజనాలకొరకు లేక ఒక చిన్నగుంపు ప్రయోజనాల కొరకుగాక దానికి బదులుగా ప్రజలప్రయోజనాల దృష్ట్యా

అన్ని విషయాలలోనూ వ్యవహరించాలనీ" మనకు ఆయన చెప్పేడు.

"కమ్యూనిస్టుల మాటలకూ, చేతలకు, వుత్తమప్రమాణం యేమంటే వారి మాటలు, చేతలూ, అసంఖ్యాక ప్రజలకు గరిష్ఠ పరిమాణంలో మేలును చేకూర్చగలవా లేదా యన్నది. అంతేగాక వారి మాటలు, చేతలు, అసంఖ్యాక ప్రజానీకంచే బలపరచబడుతున్నాయా, లేదా యన్నది" యని మన కామ్రేడ్సు అందరూ అర్థం జేసుకోవాలని కామ్రేడ్ మాసీ యాంగ్ మనలను కోరేడు. "మనం ప్రజలపై ఆధారపడినంత కాలం వారి అనంత సృజనాత్మక శక్తిలో మనకు గట్టి నమ్మకం వున్నంతకాలం వారిలో విశ్వాసమున్నంతకాలం, వారిలో మనం కలిసిపోయి యున్నంతకాలం" మనం అజేయులం అని కామ్రేడ్ మాసీయాంగ్ చెప్పేడు. ప్రజల చైతన్య స్థాయికి దూరంగా పోతుంది కాబట్టి, ప్రజలను నడుపుటలో స్వేచ్ఛా సూత్రాన్ని భగ్నం గావిస్తుంది కాబట్టి ఉద్రేక తత్వానికది రూపం కాబట్టి కార్యక్రమం ఆచరణయొక్క అన్నిదశలలోను అధికారక తత్వాన్ని అవలంబించటం శుద్ధతప్పయని కామ్రేడ్ మాసీయాంగ్ స్పష్టీకరించేడు.

"ప్రజానీకంయొక్క చైతన్యస్థాయికి వెనుకబడి యుంటుంది కాబట్టి, ప్రజలను ఒక అడుగు ముందుకు నడిపించునట్టి సూత్రాన్ని భగ్నం గావిస్తుంది కాబట్టి సోమరితనానికి అది మూర్తి గాబట్టి తైలిజంకూడా (తోకబట్టుకొని పోయేతత్వం) శుద్ధతప్పు"యని కామ్రేడ్ మాసీయాంగ్ చెప్పేడు. కామ్రేడ్ మాసీయాంగ్‌యొక్క యీ ప్రబోధాలన్నీ అత్యంతప్రధాన

మైనవి. అందువలన ప్రతిపార్టీసభ్యుడూ వీటిని చాలా జాగ్రత్తగా అధ్యయనంచేయాలి. చక్కగా అవగతంజేసుకోవాలి, తప్పకుండా ఆచరణలో పెట్టాలి.

ఈ ప్రజాపంథాను, శ్రామికపార్టీ మాత్రమే అనుసరించగలదు. మన ప్రజాపంథా, ఒకవర్గపంథా శ్రామికవర్గం, యొక్క ప్రజాపంథా యిది. ప్రజలపట్ల మన దృక్పథం, వారితో మన సంబంధం అనేవాటికి పీడకవర్గాలు ప్రజలపట్ల వహించే దృక్పథానికి ప్రజలతో ఆవర్గాలుపెట్టుకొనే సంబంధాలకు మౌలికభేదం వుంది.

ప్రజలు తమవిముక్తికై చేసే పోరాటంలో ప్రజానీకం యొక్క అగ్రగామిదళం వహించవలసిన ఖచ్చితమైన పాత్రను మనం పూర్తిగా అర్థంజేసుకొంటాం. అసంఖ్యాక ప్రజల పరిపూర్ణ విముక్తి, తమ అగ్రగామిదళంగా వుండగలిగిన ఒక పార్టీ వారికి స్వంతంగా వుండిననాడే సాధ్యమవుతుంది. అలాంటిపార్టీ వారికి లేకపోతే వారు విప్లవాత్మక నాయకత్వం లేనివారుగా అవుతారు. అలాంటి విప్లవాత్మక నాయకత్వం వారికి లేకపోతే ప్రజావిప్లవం తప్పకుండా పరాజితమవుతుంది. మనపార్టీయొక్క పటిష్ఠమైన, సవ్యనాయకత్వంక్రిందనే, రాజకీయదశలో పోరాటాన్ని సాగించుటద్వారా మనపార్టీ చైనాప్రజలు తమపరిపూర్ణవిముక్తిని పొందగలరని స్పష్టీకరించింది.

ఇది సమస్యలో ఒక వైఖరి.

మరియొకవైఖరి ఏమంటే, అసంఖ్యాకప్రజానీకం యొక్క అగ్రగామిదళం, అసంఖ్యాకప్రజానీకంతో సరియైన,

సన్నిహితమైన సంబంధాలను యేర్పరుచుకోవాలి. అన్ని రంగాలలోనూ, అందులో మొట్ట మొదటగా, రాజకీయ రంగంలో, అది ప్రజలప్రయోజనాలకై నిలబడాలి. అది ప్రజలపట్ల సవ్యమైనవైఖరిని అవలంబించాలి. వారిని సవ్యమైన పద్ధతులలో నడుపాలి. అలాచేయటద్వారానే, అగ్రగామిదళం, అసంఖ్యాక ప్రజానీకంతో అత్యంత సన్నిహితంగా సమైక్యం కాగలుగుతుంది. అలా చేయకపోతే అసంఖ్యాక ప్రజానీకం నుండి అగ్రగామిదళం వేరై పోతుంది. అలాసంభవిస్తే, అగ్రగామిదళం, ప్రజల అగ్రగామిదళం అనిపించుకోదు. అది అసంఖ్యాక ప్రజానీకాన్ని విముక్తిజెందించవలసిన కర్తవ్యాన్ని చేయలేకపోవుటయేగాక, శత్రువుచే తుడిచివేయబడే ప్రమాదానికి గురిఅవుతుందికూడా. దీనికి అర్థమేమంటే ప్రజానీకం యొక్క అగ్రగామిదళానికి తన కార్యక్రమనిర్వహణ యంతటిలోనూ పరిపూర్ణమైన, స్పష్టమైన ప్రజాపంథా వుండాలి.

అగ్రిగామిదళం ప్రజలనుండి వేరైపోవుటకు దోహదమిచ్చే ప్రధాన పరిస్థితు లేవి?

మొట్టమొదటి దేమంటే ప్రజానీకంయొక్క అగ్రగామి దళంగా, అగ్రగామిదళం తన కర్తవ్యాన్ని నిర్వహించక లేకపోతే అన్ని కాలాలలోనూ, అన్ని పరిస్థితులలోనూ సాధ్యమైనంత విశాల ప్రజానీకంయొక్క గరిష్ట ప్రయోజనాలకు అది ప్రాతినిధ్యం వహించలేక పోయినచో అది సకాలంలో సరియైన కర్తవ్యాలనూ, పాలసీలను, పనివిధానాలను రూపొందించ లేకపోయినచో అది సత్యానికి అంటిపెట్టుకొని వుండక పోయినచో సకాలంలో అది తన తప్పులను దిద్దుకొన లేక

పోయినట్లయితే, అగ్రిగామిదళం ప్రజలనుండి వేరైపోతుంది. క్లుప్తంగా చెప్పాలంటే టెయిలిజం (తోకను బట్టుకొని పోయే తత్వం) వల్లను యిష్టమొచ్చినట్లు ప్రవర్తించటంవల్లను ప్రజానీకంనుండి వేరుపడటానికి దారితీస్తుంది.

సాహసిక విధానాన్ని అవలంబించాలనిగానీ వాటంతటవే యేర్పడిన ప్రజావుద్యమాల తోకపుచ్చుకొని పోవాలనిగానీ, లేక శ్రామికవర్గపార్టీయొక్క నాయకత్వాన్ని రద్దు చేయాలనిగానీ, యిలాంటి ధోరణులు మన పార్టీలో బహిరంగంగా యింకా ముందుకురాలేదు. కాని 1925–1927 మహావిప్లవంయొక్క ద్వితీయార్థకాలంలోని చెన్-తూ-హిస్యూయిజమూ, జపాను-వ్యతిరేక-యుద్ధంయొక్క ప్రథమకాలంలోని లొంగుబాటు తత్వమూ, యీ రెండూ ఒకరకమైన టెయిలిజాలే. ఇవి ఆ కాలపు ప్రజా విప్లవోద్యమానికి చాలా వెనుకబడియున్నాయ్.

ప్రజలకు ప్రాతినిధ్యంవహించే లాగున లేక ప్రజలను ముందుకు తీసుకొనిపోగలిగినట్టి సరియైన కర్తవ్యాలను పాలసీలను, పనివిధానాలనూ యీ రెండూ చూపెట్టలేకపోయాయి. తత్ఫలితంగా ప్రజలకు దూరమవటం ప్రారంభమయ్యింది. విప్లవం విపరీతనష్టాలకు గురిఅయ్యింది. పరాజితమయ్యింది. దీనికితోడుగా కొంతమంది కామ్రేడ్స్ తమ కార్యక్రమంలోని వివిధరంగాలలో టైలిస్టుస్వభావం కలిగిన పొరపాట్లు జేసేరు.

ఉదాహరణకు వర్గసంఘంయొక్క వుత్తమరూపంగా జూచుటకు బదులుగా కొంతమంది కామ్రేడ్స్ తమ పనిలో

మనపార్టీని ఒక సైన్యంగా, ఒక ప్రభుత్వంగా లేక కార్మిక సంఘ అనుబంధసంస్థగా చూచేరు. మరికొందరు తమ పనిలో జడత్వాన్ని, సాంప్రదాయతత్వాన్ని ప్రదర్శించసాగేరు. విష యాలు యథాతథంగా వుంటే వాటినిజూచి సంతృప్తిజెందేరు. విషయాలు తమ గతులను తాము పట్టిపోనీ, అని వూరుకొనే వారు, అభివృద్ధిజేయాలన్న చురుకే వారిలో వుండేదికాదు. నిర్ణీతకాలంలో, నిర్ణీతప్రదేశంలో ప్రజలను ముందుకుగొని పోవుటకుగాను ప్రజల యదార్థపరిస్థితులను ఆధారంగాగొని దానికి అనుగుణ్యమైన సవ్యకర్తవ్యాలను, విధానాలను, పని విధానాలను ముందుబెట్టలేకపోయారు. వారు ఆవిధంగా ప్రజ లను ఒక అడుగు ముందుకునడిపించే సూత్రాన్ని భగ్నం గావించేరు. ప్రజల వెనుబడిన భావాలకువారు లొంగిపోయే వారు. ఆవిధంగా వారు తమ అగ్రగామిదళపాత్రను విసర్జించి సామాన్యకర్షకుని స్థాయికి లేక కార్మికునిస్థాయికి లేక అంత కన్న వెనుకబడినవారి స్థాయికి దిగజారిపోయారు. కొన్ని సమ యాలలో ప్రజల అపసవ్యభావాలతో రాజీపడేవారు. అయత్నకృతంగా యేర్పడిన ప్రజావుద్యమాల తోకపట్టుకొని పోయేవారు. ప్రజలకు సవ్యమైన దూరదృష్టిని కలిగిన నాయ కత్వాన్ని ప్రసాదించలేకపోయారు. ప్రజానీకానికి తమ్ముకొ నడుపుటకు అలాంటివారు అవసరంలేదు కాబట్టి యిలాంటి ధోరణి మనలను ప్రజానీకంనుండి తప్పక వేరుచేస్తుంది.

ఇక రెండవ విషయ మేమంటే తన నాయకత్వం వైఖరులు, పద్ధతులు అపసవ్యమైనవి అయినప్పుడు తమ స్వీయానుభావాలద్వారా పార్టీనినాదాల సవ్యతను ప్రజానీకం చే

గుర్తింపజేయలేనప్పుడు తదనుసారంగా వారు నడచునట్లుగా జేయలేకపోయినప్పుడు నినాదాలు, పాలసీ అమితంగా పరిస్థితుల కన్న ముందుజూపుగోనున్నప్పుడు, అమితంగా "అతివాదం"గా నున్నప్పుడు లేక అది సలహాయిచ్చే పోరాటాలు, నిర్మాణ రూపాలు, అప్పటి పరిస్థితులలో ఆచరించుటకు అసాధ్యంగా వున్నప్పుడు లేక ప్రజలు ఆమోదించుటకు అవకాశము లేనివిగా నున్నప్పుడు ప్రజానీకంనుండి అగ్రగామిదళం వేరైపోతుంది. క్లుప్తంగా చెప్పాలంటే అధికారకతత్వం (Commandism) సాహసికతత్వం (Adventurism) కవాట బంధ-తత్వం లేక తలుపులు మూసుకొని కూర్చునే తత్వం (పాక్షికతత్వం) - యివన్నీ ప్రజలనుండి వేరుపడుటకు తప్పకుండా దారితీస్తాయి.

కొంతమంది కామ్రేడ్సు అధికారికతత్వం, సాహసిక తత్వం, కవాట - బంధ - తత్వాలకు సంబంధించిన పొరపాట్లనుజేసేరు. వుదాహరణకు కొంతమంది తమపనిలో ప్రజలపట్ల బాధ్యతారహితంగా ప్రవర్తించేరు. ప్రజలు తమంతట తామే తమ్ము విముక్తి జెందించుకొంటున్నారన్న విషయాన్ని వీరు నమ్మలేదు. తన్మూలంగా వారు ప్రజలకు బదులుగా పోరాడుటకు ప్రజలకు అతీతంగా నిలబడి, ప్రజలకు విముక్తిని ప్రసాదించుటకు, ఆజ్ఞలు జారీచేయుటకు తయారయ్యేవారు. అలాంటి కామ్రేడ్సు ఉద్రిక్తతతో బాధపడే వారు. పైపైనమాత్రం చురుకుగావుండుటచే పార్టీ నినాదాలను, కర్తవ్యాలనూ ప్రజలవిగా ఎలా మార్పుజేయాలో వీరికి తెలియదు. ప్రజలను ఎలాసరిగా చైతన్యవంతులుగాచేయాలో

వారు జాగృతి జెందునంతవరకు ఎలా సరిగా వేచియుండాలో వీరికి తెలియదు. సహజ విప్లవాత్మకధోరణిని ప్రజలలో ఎలా కలుగజేయాలో వీరికి తెలియదు. ప్రజలకు నిరంకుశం ఆజ్ఞలు జారీచేస్తూ, వారిని కార్యాచరణలోనికి దూకవలసినది బలవంతముజేస్తూ పార్టీ నినాదాలను, కర్తవ్యాలను ఆమోదించవలసినదిగా వీరు ప్రజలను వత్తిడిచేసేవారు. వారావిధంగా ప్రజలు తమంతటతామే పాల్గొన్నాలన్న సూత్రాన్ని భగ్నం గావించేరు. ప్రత్యేకమైన విషయమేమంటే నినాదాలు పరిస్థితులకు అనుగుణ్యంగావుండక ముందుకు పరిగెత్తిపోయినట్లున్నప్పుడు, "అమిత అతివాదంగా" వున్నప్పుడు ప్రజలలో సందేహాలు, అసంతృప్తి పొడసూపేవి; ఇలాంటి పరిస్థితులలోకూడా ఏమైనా కానిమ్మని వీరు వాటిని ఆచరణలో పెట్టుటకు ప్రజలను బలవంతముజేసేవారు; శిక్షలను విధించేవారుకూడా; అంతేగాక ఆజ్ఞలను జారీచేయుటంద్వారా సాధించాలని యత్నించేవారు. ఇలాంటి ఆచరణలకు నీచాతినీచమైన రూపమేమంటే వీరెక్కడికిపోయినా ప్రజలను కేడర్లను భయపెట్టి పనిని ముందుకు నెట్టాలన్న భావంతో తప్పులను లోట్లను చెడ్డ వుదాహరణలనుప్రోగుచేయ యత్నించేవారు. వాటిపై విపరీత విమర్శనలు జేసేవారు. ఖండించేవారు. శిక్షలు విధించేవారు. మంచి పాయింట్లను, మంచి వుదాహరణలను కనుగొని వాటిని అభివృద్ధిపరచి క్రమబద్ధంజేయ నిరాకరించేవారు. పార్టీ మెంబర్లు ప్రజల అభ్యుదయాన్ని ప్రోత్సహించుటకు పొరపాట్లు లోట్లను అధిగమించుటకుగాను, వీరులను, మోడల్ వర్కర్లను పొగడేవారుకారు. అంతేగాక వారి మంచి అనుభవాలను

యితరులకు అందజేసేవారు కారు. వీరు ప్రతివారిమీదను చుకొని పడేవారు. ఆజ్ఞలనుమాత్రం జారిచేసేవారు. అసంఖ్యా ప్రజానీకంనుండి నేర్చుకొనుటకు బదులుగా ప్రజలయొక్క నూతన భావాలనుండి సృజనలనుండి లాభం పొందుటకు బదులుగా తాముచెప్పిన రీతిగా యితరులు నడిచేలాగున వత్తిడి జేసేవారు. అలాంటిధోరణి వీరిని ప్రజలనుండి తీవ్రంగాదూరం జేసింది. అంతేగాక వీరిపై ప్రజలలో అసహ్యాన్ని రేపింది. అంతే గాక పార్టీ యావత్తుమీదాకూడా అసహ్యాన్ని రేపింది.

పై రెండు ధోరణులతోపాటు కొంతమంది కామ్రేడ్సు లో నిరంకుశతత్వం యుద్ధ-స్వాముల తత్వాల ధోరణులకూడా కానవచ్చేయి. అలాంటి ధోరణులుకూడా ప్రజానీకంనుండి మన కామ్రేడ్స్‌ను వేరుజేస్తాయి.

కొంతమంది కామ్రేడ్స్‌లో ప్రజాసేవ దృక్పథం లోపించటంవల్లనూ ప్రజలపట్ల, పార్టీపట్ల బాధ్యతాయుతంగా ప్రవర్తించాలన్న దృక్పథం లోపించుటవల్లనూ నిరంకుశ ధోరణి ద్యోతకమవుతూవుంది. దీనికి సరియైన వుదాహరణ లేమంటే రోజల్లా బడితెలులాగున తిరుగుతూ వీరు ఆజ్ఞలు జారీచేయుటం తప్ప మరేమీచేయరు. ప్రజలనుండి నేర్చుకో వటంగానీ, అధ్యయనంచేయుటంగానీ, పరిశోధించటంగానీ వీరు చేయరు. ప్రజలనుండి వచ్చే విమర్శలను విసర్జించేవారు. ప్రజ లకు హక్కులు గలవన్న విషయాన్ని వీరు గమనించరు. అంతేగాక, ప్రజలను తమకు సేవజేయవలసినదిగా కోరేవారు. తమ వ్యక్తిగత లాభాలకొరకు ప్రజల ప్రయోజనాలను బలి

పటకు వెనుదీసేవారుకారు. వారు భ్రష్టులుగా తయా య్యేరు. ప్రజలపై పెత్తనం చలాయించేవారు.

యుద్ధస్వాముల తత్వధోరణి కొంతమంది కామ్రేడ్సులో ఎందుకు ఏర్పడిందంటే మనసైన్యం ప్రజల సాయుధసైన్యమనీ ప్రజాశత్రువులను ఓడించుటకుగాను, ప్రజలను విముక్తిజేయు టనుగాను ఏర్పడిన ప్రజలయొక్క అత్యంతప్రధానమైన ఆయుధమనీ వీరికి తెలియదు. యిలా అర్థంజేసుకొనుటకు బదు లుగా వీరు, సైన్యమంటే ప్రజలకు బాహ్యంగా నిలబడిన ప్రజలకు అతీతమైన సైన్యంగా భావించేవారు. ఏదోవ్యక్తిగత పలుకుబడిని పెంపొందించుకొనుటకు లేక కొద్దిమంది ప్రజల పలుకుబడిని పెంపొందించుకొనుటకు యేర్పడిన సైన్యంగా భావించేవారు. తత్ఫలితంగా ప్రజాసైన్యంలో నిరంకుశమైన, నియంతృత్వపద్ధతులను వీరు ప్రవేశపెట్టేరు.

అలాంటి ఆచరణల స్వభావాలు, ఆఫీసర్లకు, సైనికు లకు మధ్యగల సంబంధాలద్వారా. పైవారికి, క్రిందివారికి మధ్యగల సంబంధాలద్వారా స్పష్టమయ్యాయి. సైన్యం యొక్క చైతన్యం, చొరవలపై ఆధారపడియుండుటకు బదులుగా సైనికులకు ఆజ్ఞలుజారీచేయటం, శిక్షలువేయటం జరిగింది. ఇక రెండవదేమంటే పైనచెప్పబడినదాని ఆచరణల స్వభావాలు, సైన్యమూ ప్రజలమధ్య సంబంధాలద్వారా వ్యక్తమయ్యేవి. ప్రజలతో పెట్టుకొన్నసంబంధాలలో తమ అనుయాయులు క్రమశిక్షణను అమలుజరుపుతున్నారా లేదా యని కొంతమంది కామ్రేడ్సు చూచేవారు. ఈ కామ్రేడ్సుకు ప్రజలపట్ల ప్రేమాభిమానాలు లోపించినాయ్. ప్రజలు

బలవంతపు బ్రాహ్మణార్థానికి, దార్జన్యానికి, పరాభవాలకు గురిచేయబడేవారు. తత్ఫలితంగా సైన్యం ప్రజలనుండి వేరై పోయింది. మూడవదేమంటే పైనచెప్పబడిన స్వభావాలు, మరియొకరకంగా వ్యక్తమయ్యాయి. యేదో ఒక యుద్ధస్వామి వ్యవహరించినట్లుగా సైన్యాన్ని ప్రభుత్వానికి అతీతంగానుంచి, ప్రభుత్వాన్ని సైన్యాధికారంచే నడిపించే యత్నంతో, విప్లవాత్మకసైన్యం విప్లవప్రభుత్వం మధ్య సంబంధాన్ని కేవలం సైనికదృష్ట్యా చూడబడింది.

అలాంటి ధోరణులకు ప్రజాసైన్యానికి వుండవలసిన లక్షణాలకు సంబంధమేమీ లేదని వ్యక్తమవుతూవుంది.

ప్రజలనుండి వేరుచేయునట్టి పైనుదహరింపబడిన ధోరణులు, మనపార్టీలో జనించుటకు కారణమేమంటే శ్రామిక ప్రజలు సాంస్కృతికంగా వెనుకబడి యుండుటవల్లను, ప్రాచీన సమాజంయొక్క దోపిడీవర్గాలు యీ శ్రామికవర్గ ప్రజలపై తమ ప్రభావాన్ని కలిగియుండుటవల్లను, యివి సంభవించాయి. మన పార్టీలోని సామాజిక వుత్పత్తితోనుండి చాలాకాలం క్రిందటనే వేరుచేయబడినవారైన పెట్టీ-బూర్జువాశక్తులు, తదితరశక్తులు అలాంటి ప్రభావాలకు లొంగిపోతూ వుంటాయనుకోవచ్చును. తత్ఫలితంగా ప్రజలనుండి వేరుచేయునట్టి ధోరణులనేకం ఏర్పడుతాయ్. ఈ ధోరణులకు గాఢమైన సామాజిక మూలమున్నది. యీ విషయం మనపార్టీ నిబంధనావళి యొక్క కార్యక్రమంలో వుదహరింపబడినది కూడాను. విప్లవం అభివృద్ధిజెందిన కొలదీ పని మరింత కఠినమవుతుంది. మనలో యిలాంటి ధోరణులు పెరుగుటకు కూడా అవకాశాలు హెచ్చు

వుతాయ్. అందువలన మనం అసంఖ్యాక ప్రజానీకంతో సంబంధాలను నిలబెట్టుకొనుటకు వాటిని నిరంతరం బలపరచుకొనుటకూ, పైధోరణులకు వ్యతిరేకంగా నిరంతర పోరాటాన్ని నడుపాలి. రాజకీయ చెత్తచెదారం మురికి రాజకీయ కీటకాలు, మన కామ్రేడ్సుయొక్క మెదళ్ళను మనపార్టీ శరీరాన్ని విషపూరితం గావించకుండా వుండాలంటే మనం ఎల్లప్పుడూ "ఇళ్లను బాగుచేసుకోవాలి. మన ముఖాలను శుభ్రంగా వుంచుకోవాలి" అని కామ్రేడ్ మావోసియాంగ్ చెప్పేడు.

ప్రజానీకం తన స్వంతమైన శక్తిమంతమైన అగ్రగామిదళాన్ని కలిగియుండాలి. ఆ అగ్రగామిదళం అసంఖ్యాక ప్రజానీకంతో అత్యంత సన్నిహితాన్ని సాధ్యమైనంతగా కలిగియుండాలి. ఆ విధంగా మాత్రమే ప్రజానీకంయొక్క విముక్తి సాధ్యమవుతుంది. అందువలన చైనా ప్రజల అగ్రగామిదళమైన పార్టీ ప్రజలనుండి వేరుజేయునట్టి పై నుదహరింప ధోరణులను నిరంతరం తరిమిగొట్టాలి; ప్రజానీకంతో అత్యంత సన్నిహితంగా సమైక్యమవ్వాలి. మన పార్టీ ప్రజాపంథా, కామ్రేడ్ మావోసియాంగ్‌యొక్క ప్రజాపంథా అంటే అలాంటిది, మనపార్టీకి, ప్రజలకుమధ్య సవ్యమైనసంబంధాలను నెలకొల్పుటకై రచించబడిన పంథాఅది. అసంఖ్యాక ప్రజానీకాన్ని నడుపుటకై, సవ్యమైన వైఖరినీ, సవ్యమైన పద్ధతులను అనుసరించుటకు మనపార్టీకిసామర్థ్యాన్ని ప్రసాదించే పంథాఅది. ఒకవైపును, మన పార్టీయొక్క నాయకత్వసంఘాలకు, వ్యక్తిగత నాయకులకూ, మధ్య,

సవ్యమైన సంబంధాన్ని నెలకొల్పుటకు, మరియొకవైపున వారు నడుపునట్టి అసంఖ్యాక ప్రజలకు, వారికీమధ్య, సవ్యమైన సంబంధాన్ని నెలకొల్పుటకు, లక్షించే పంథాఅది.

మావోసీయాంగ్ సిద్ధాంతాన్ని అనుసరించి, మనపార్టీ పాలసీలు, పనిపద్ధతులు, ప్రజానీకం నుండే జనించాలి; మరల, అవి ప్రజానీకాన్ని జేరాలి. మరొకవిధంగా చెప్పాలంటే, మన పార్టియొక్క నిర్మాణపంథా, అంతేగాక, దానిరాజకీయపంథా సరిగా ప్రజనుండే రావాలి; అవి సరిగా ప్రజానీకాన్నే జేరాలి. మన పార్టియొక్క సవ్యరాజకీయపంథా, దాని సవ్యనిర్మాణ పంథానుండి విడదీయుబడజాలదు. ఈ రెండింటిమధ్యనూ, పాక్షికమైన, తాత్కాలికమైన అనంగీకారం యేర్పడినప్పటికినీ అపసవ్యమైన నిర్మాణపంథాప్రక్కన, సవ్యమైన రాజకీయపంథా అస్థిత్వంలోవుండటంగానీ లేక అపసవ్య రాజకీయపంథా ప్రక్కన, సవ్యనిర్మాణపంథా అస్థిత్వంలోవుండటం గానీ అసంభవం, అనూహ్యం. ఈ రెండింటిలో ఒకటి రెండవ దానినుండి విడదీయుబడజాలదు. సవ్యనిర్మాణపంథాకు అర్ధమేమంటే పార్టియొక్క ప్రజాపంథా అని అర్ధం. అంటే పార్టీకి వెలుపలియున్న, లోపలినున్న అశేషప్రజానీకంతో పార్టీయొక్క నాయకత్వకేడర్లను అత్యంతసన్నిహితంగా ముడిపెట్టే పంథా అది. ప్రజలనుండి వచ్చి మరల ప్రజలకే తిరిగివెళ్లెడి పంథా అది. వ్యక్తిగత దిక్సూచికత్వంతో సాధారణ విజ్ఞప్తులను సమ్మిళితమొనరించుటను నాయకత్వపద్ధతులలో ఒకదానిగా భావించునట్టి పంథా అది.

మనపార్టీ కామేడ్స్ మావోసీయాంగుల ప్రజాపంథాను

పరిపూర్ణంగా కొనసాగించుటకుగాను, పార్టీ నిబంధనావళి యొక్క సాధారణ కార్యక్రమం, నిబంధనలూ, ప్రతిపార్టీ సభ్యుడూ గుర్తుంచుకోవలసిన యీ క్రింది ప్రజాపంథా దృక్పథాలపై ప్రత్యేకంగా నొక్కి వక్కాణించాయ్.

మొదటిది ప్రజలకే అంతా అన్నదృక్పథం సంపూర్ణ హృదయంతో ప్రజలకు సేవజేయాలన్న దృక్పథం అది. మొదటనుండీ ప్రజలకు సేవజేయుటకే మనపార్టీ స్థాపించబడింది. పార్టీసభ్యులు జేసినత్యాగాలు,యత్నాలు, పోరాటాలన్నీ అసంఖ్యాకప్రజలక్షేమం విముక్తులకొరకే చేయబడ్డాయ్. అంతేగాని మరెందుకూగాదు. కమ్యూనిస్టుల ఘనాతిఘనమైన కీర్తియిదే. మనం ప్రత్యేకంగా గర్వించవలసిన విషయ మిదే. అందుకని, వ్యక్తులప్రయోజనాలకై లేక చిన్నముఠాల ప్రయోజనాలకై ప్రజానీకంయొక్క ప్రయోజనాలను బలిచేసే దృక్పథ మేదైనప్పటికి అది శుద్ధతప్పు. వారు తమ విధులలో నిమగ్నులై వున్నంతకాలం మంచి నడవడి కలిగియున్నంతకాలం వారికది తెలిసియున్నా లేకపోయినా వారు ప్రధానస్థానంలో వున్నా, నాయకత్వస్థానాలలో వున్నా, లేక సైనికులుగా వున్నా, వంటవాళ్ళుగావున్నా, మరేపని చేస్తున్నా పార్టీ మెంబర్లందరూ, విప్లవాత్మక అనుయాయులందరూ ప్రజాసేవ చేస్తున్నారు. తమతమ పనులద్వారా వారందరూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రజాసేవచేస్తున్నారు. అందువలన వారందరూ సమానులూ, గౌరవనీయులు. వారు ప్రజాసేవచేయుటకుగాను పార్టీమెంబర్లందరిలోనూ, వుద్యోగులలోనూ మనం వుత్తమ చైతన్యస్థాయిని పెంపొందించాలని.

వృత్తమ చైతన్యస్థాయిపై ఆధారితమైనవారు ప్రజలపట్ల బాధ్యతాయుతంగా వ్యవహరించేలాగున వారిని తయారుచేయాలి.

రెండవది ప్రజలకు పరిపూర్ణబాధ్యతను వహించు దృక్పథం. మనం ప్రజలకు సేవజేస్తూ, ప్రజలకు మనం బాధ్యత వహించాలి. మన సేవద్వారా వారు యథార్థలాభాన్ని పొందేలాగున విముక్తినిపొందేలాగున చేయాలి. ప్రజలకు హానిచేయకుండా వుండుటకుగాను నష్టంకలుగజేయకుండా వుండుటకుగాను మనం తప్పులుచేయకుండా వుండాలి. కనీసం మన తప్పుల సంఖ్యను తగ్గించుకొనుటకు యత్నించాలి. ప్రజలకు లాభం చేకూరుటకుగాను మనం రూపొందించే పాలసీలు, కర్తవ్యాలు, పని విధానాలన్నీ సవ్యమైనవిగా వుండాలి. అవి సవ్యమైనవిగాకపోతే, ప్రజల ప్రయోజనాలకు హానిగలుగుతుంది. అలాంటిది సంభవిస్తే దానిని వెంటనే సరిదిద్దుకొనుటకుగాను మనం గట్టిగా ఆత్మవిమర్శనను కొనసాగించాలి. దీనికి అర్థమేమంటే ప్రజాసేవ ఎలాచేయాలో ప్రజాలకు బాగా సేవచేయుట మెలాగో వారికి చెడ్డగా వుండకుండా వుండేదెలాగో అన్న విషయాన్ని తెల్సుకొనియుండాలి. అందుకని ఎట్టి పరిస్థితులలోను ప్రజల పట్ల తేలిక అభిప్రాయాన్ని కలిగియుండరాదు. మనం తీవ్రంగా బాధ్యత వహించివుండాలి.

ప్రజలకు బాధ్యతవహించుటకు మనపార్టి నాయకత్వ సంఘాలకు బాధ్యతవహించుటకు మధ్య వుండవలసిన ఐక్యతను గురించి అర్థం జేసుకొనుటకూడా చాలా అవసరం. దీనికి అర్థమేమంటే ఒకానొక నాయకత్వ సంఘం లేక పార్టీయొక్క

వ్యక్తిగత లీడర్ల సూచనలను పార్టీమెంబర్లు కొనసాగించు టలో ఆయా నాయకత్వ సంఘాలను లేక వ్యక్తిగత నాయకు లకు బాధ్యులై యుండాలి. కాని పార్టీ నాయకత్వానికి బాధ్యత వహించుటకును, ప్రజల బాధ్యత వహించుటకును, మధ్య యెలాంటి తేడానైనా యేర్పరచ జూచటం శుద్ధతప్పు. ఒకడు తాను ప్రజలకు బాధ్యత వహించుటద్వారా అత్యు న్నతమైన, అంతిమమైన బాధ్యతను వహించుతున్నట్లు పార్టీ ప్రయోజనాలు, ప్రజా ప్రయోజనాలతో అభిన్నత్వాన్నికలిగి యున్నాయని అర్థం జేసుకోవాలి. ప్రజలకు లాభం కలిగించేదే పార్టీకికూడ లాభం కలిగిస్తుంది; ప్రతిపార్టీసభ్యుడూ పరిపూర్ణ హృదయంతో దాసికై పాటుపడాలి. అదేవిధంగా, ప్రజలకు హానిచేసేదే, పార్టీకి హానిజేస్తుంది. దీనిని వ్యతిరేకించటానికి ఇది సంభవించకుండా చేయుటకు, ప్రతిపార్టీ సభ్యుడూ తప్పకుండా యత్నించాలి. ప్రజలప్రయోజనాలే, సరిగ్గా పార్టీప్రయోజనాలు ప్రజలప్రయోజనాలకుమించి, పార్టీకి స్వతంత్రప్రయోజనాలంటూ వేరే లేవు. అత్యధికసంఖ్యాక ప్రజలకు అత్యుత్తమలాభాన్ని చేకూర్చాలి. యిదేసత్యం యొక్క వుత్తమోత్తమ ప్రమాణం; తత్ఫలితంగా, అది మనపార్టీ సభ్యులందరియొక్క కార్యకలాపాలన్నింటికీ అది వున్నతప్రమాణం. ప్రజలకు బాధ్యతవహించే ప్రతిపార్టీ సభ్యుడూ, పార్టీకికూడా బాధ్యుడు; ప్రజలకు బాధ్యతారహి తంగావున్నవాడు పార్టీకి అంతకన్న బాధ్యతారహితుడు, పార్టీకి బాధ్యతకలిగియుండుటనే దానికి, ప్రజలకు బాధ్యత కలిగియుండుటనే దానికి, తాదాత్మ్యత గలదని గ్రహించాలి,

ఆ రెండింటినీ సమైక్యమొనరించాలి. అంతేగాని వాటిని విడదీయరాదు; లేక ఒకదానితో మరియొకటి వ్యతిరేకించే లాగున చేయరాదు.

కర్తవ్యాలు, పాలసీలు, పనివిధానాలవిషయంలో నాయకత్వంగానీ, లేక వ్యక్తిగతనాయకులుగానీ యిచ్చిన సూచనలలో లోట్లుగానీ, పొరపాట్లుగానీవుంటే ప్రజలకు బాధ్యులమన్నదానిని గుర్తించి, పైన చెప్పబడినసూచనలలోని లోట్లునూ, పొరపాట్లునూ సవరించుటకు సలహాలివ్వాలి. సవ్యాపసవ్యాలకు గల భేదాన్ని గుర్తించటం, విషయాలను తేలికగా చూడకుండావుండటం చాలా అవసరం. అలా చేయకపోతే పార్టీపట్లనూ, ప్రజలపట్లనూ బాధ్యతలేకుండా ప్రవర్తించినట్లవుతుంది.

పార్టీ క్రమశిక్షణకు లోబడియుండాలి. సమైక్యతను నిలబెట్టాలి. ఎందువల్లనంటే అలాంటి క్రమశిక్షణను నిలబెట్టటం, సమైక్యతను నిలబెట్టటమనేది చైనాప్రజల మూలప్రయోజనాలకు అవసరం. ప్రజలకు బాధ్యత వహిస్తున్నామన్న సాకుతో పార్టీ క్రమశిక్షణనుగానీ, ఐక్యతనుగానీ, బలహీన పరచరాదు. ఏమైనాగానీ ఒకానొక నాయకత్వసంఘంచేగానీ, లేక వ్యక్తిగతనాయకులచేగానీ చేయబడిన తప్పులను, లోట్లను సవరించాలి. ఈ విషయంలో సహాయపడటం ప్రతిపార్టీసభ్యుని హక్కు, విధి. ఎందువల్లనంటే అలాంటి పొరపాట్లు, లోట్లు, ప్రజలకు నష్టదాయకాలు. అందువలన పార్టీకికూడా అవి నష్టదాయకాలే. పార్టీసభ్యులు నిష్కాపట్యంగా ఆత్మవిమర్శను అవలంబించటం, తమ తప్పులపట్లనూ, నాయకత్వంయొక్క

తప్పులపట్లనూ విమర్శనాత్మక వైఖరి వహించటంయనేది ప్రజలకు బాధ్యతవహించు తత్వంలో అంతర్భాగం.

మూడవది ప్రజలు తమంతట తామే తమ్ము విముక్తి జెందించుకొనగలరన్న దానిలో నమ్మకం కలిగిన దృక్పథం. ప్రజానీకం యథార్థంగా గొప్పదనీ, వారి సృజనాత్మకశక్తి అనంతమనీ మనం వారిపై ఆధారపడినప్పుడు మాత్రమే అజేయులమనీ ప్రజలు మాత్రమే చరిత్రకు యదార్థ సృష్టికర్తలనీ, ప్రజానీకంయొక్క చరిత్రమాత్రమే యథార్థచరిత్రయనీ కామ్రేడ్ మావోసేటుంగ్ మనకు ఎల్లప్పుడూ బోధిస్తున్నాడు. శ్రమజీవులు తమ్ముదాము విముక్తి జెందించుకుంటారని మార్క్సు యేనాడో చెప్పాడు. వారి విముక్తి చక్రవర్తులపైననుగానీ, దేవతలపైననుగానీ, లేక వీరులపైననుగానీ ఆధారపడియుండ లేదనీ వారిపైననే (ప్రజలపైననే) ఆధారపడియుండనీ అంతర్జాతీయత చెప్పింది. దీని కర్థమేమంటే ప్రజల పోరాటాలు, యత్నాలద్వారామాత్రమే వారి విముక్తి సాధింపబడగలదు. నిలబెట్టుకొనబడగలదు. సునిర్మితము కాగలదు. బయటవా రెవ్వరూ ప్రసాదించే విషయం గాదది. ప్రజలుతప్ప తదితరు డెవ్వడూ దానికై పోరాడజాలడు. సాధించలేడు. ప్రజలకృషివల్లనే అది సాధితమవుతుంది. అందువలన ప్రజలను విముక్తి జెందించుటకై వారికి బదులుగా వారితరఫున పోరాడుదామన్న దృక్పథం, ప్రజలకు విముక్తిని ప్రసాదించుదామన్న దృక్పథం శుద్ధతప్పుడు దృక్పథాలు.

ప్రజానీకం తనచరిత్రను తానే రచించుకొంటుంది. వారి విముక్తి, వారి స్వంతచైతన్యం అభీష్టాలపైననే ఆధార

పడాలి. వారు తమ అగ్రగామిదళాన్ని తామే ఎన్నుకొంటారు, యీ అగ్రగామిదళనాయకత్వంక్రింద తమ్ముతాము సంఘటిత పరచుకోవాలి. తమ స్వంతయత్నాలద్వారానే తమవిముక్తికై పోరాడాలి. అప్పుడుమాత్రమే వారు చైతన్యవంతంగా తమ పోరాటఫలితాలను పొందగలుగుతారు. వాటిని నిలబెట్టుకొన గలుగుతారు. బల్పరచుకొన గలుగుతారు. ప్రజాశత్రువులను ప్రజలే కూలద్రోయ గలుగుతారు. దీనికి మార్గాంతరం లేదు. కేవలం అగ్రగామిదళ కృషిద్వారానే సరియైన ప్రజాచైతన్య సహాయం లేనిదే, ప్రజలను సరిగా సమీకరించనిదే ప్రజలను విముక్తి జెందించుట అసాధ్యమైన విషయం. చరిత్రముందుకు నడువదు. దేనినీ సాధించలేం. ప్రజల సత్వరప్రయోజనాలకు సంబంధించిన విషయాలన్నీ కౌలుధనం తగ్గింపు వడ్డీరేటు తగ్గింపు పరస్పర సహకారదళాలు లేక పరపతిసంఘాలులాంటి వన్నీ ప్రజలు పై వాటిలో చైతన్యవంతంగా తమంతట తాము స్వచ్ఛందంగా పాల్గొననిదే వఠి చెత్తవాడుగుగానే వుండి పోతాయ్. కౌలుధన తగ్గింపు కాగితంమీాదనే వుండిపోతుంది, అమలులోనికిరాదు. యదార్థవిషయంగా వుండదు. పరపతి సంఘాలు పరస్పర సహకార దళాలసంగతి అంతే. పేరుకు మాత్రం వుంటాయి, ఆచరణలోవుండవు. అందువలన బయట వారు ప్రజలకు పై వాటిని ప్రసాదించటంకంటె బయటవారు స్థానిక ప్రజలకు వాటిని సంఘటితపరచి పెట్టుకంటె అచ్చటి ప్రజలే పై వాటిని అనులుజరుపుకొనుటకై చైతన్యవంతంగా ముందుకు రావాలి.

ప్రజల ఆశయంకన్న కమ్యూనిస్టులకు మరొక ఆశయం

లేదు. మన కార్యక్రమం పాలసీ ఎంత సవ్యమైనవి అయినా ప్రజలనుండి ప్రత్యక్షంగా సపోర్టు లేనిదే ప్రజలు దానికై సంఘటితంగా పోరాడనిదే వాటిని సాధించజాలం.

అందువలన ప్రతివిషయం ప్రజల చైతన్యంపైననూ వారు తమంతట తాము స్వేచ్ఛగా ఆచరించుటపైననూ ఆధారపడియుండి వాటిచే నిర్ణయించబడుతుంది. వారి చైతన్యం స్వేచ్ఛాయుతంగా పాల్గొనటం అనేవి లేకపోతే మనం దేనినీ సాధించలేం. మన యత్నములన్నీ వృధా అవుతాయ్. మనం ప్రజానీకంయొక్క చైతన్యం స్వచ్ఛంద ఆచరణపై ఆధారపడి యున్నంతకాలం అలాంటి చైతన్యం స్వచ్ఛందకార్యాచరణలు యదార్ధాలైనప్పుడు పార్టీయొక్క సవ్యనాయకత్వసహాయంతో పార్టీయొక్క ఘనఆశయానికి పరిపూర్ణవిజయం చేకూరుతుంది. అందువలన ప్రజలచైతన్యం పరిపూర్ణంగా అభివృద్ధికానప్పుడు ప్రజల అగ్రగామిదళమైన కమ్యూనిస్టుల విధియేమంటే అన్ని విధాలా వుపయుక్తమైన ప్రతిభావంతమైన పద్ధతులద్వారా ప్రజలచైతన్యాన్ని అభివృద్ధిపరచుటకు యత్నించాలి. ఇది మన పనిలో మొదటి అడుగు. అదెంత కఠినమైనప్పటికీ, అదెంత కాలం పట్టినప్పటికీ మనం యీ ప్రథమసోపానంలో చక్కగా పనిచేయాలి.

ప్రథమసోపానాన్ని ఎక్కినతర్వాత మాత్రమే రెండవ సోపానంపై కాలు పెట్టగలుగుతాం. మరియొకరకంగా చెప్పాలంటే చైతన్యంయొక్క అవసరస్థాయిని ప్రజానీకం చేరుకొన్న తర్వాత వారిని తమ కార్యకలాపాలలో మనం నడుపాలి — సంఘటితపడుటకు, పోరాడుటకు మనం వారిని నడు

పాలి. మనపార్టీ యిచ్చిన ప్రజల మూలసూత్రాలను సాధించు టకు ప్రజలు పోరాడుటకై ప్రజానీకాన్ని మనం ఒక అడుగు తర్వాత మరియొక అడుగు ముందుకు గొనిపోయే వైనమది. కమ్యూనిస్టులమైన మనం ప్రజానీకంలోని అత్యంత పురో గామిత శక్తులు, విశిష్టవ్యక్తులు, ప్రజల ఆశయాన్ని నిర్వహిం చుటలో వహించవలసిన పాత్ర అది ఇంతకన్న వేరే యేదో చేయగల మనుకోవటం భ్రమ. ఇంతకన్న ఘనమైన పాత్రను వహిద్దామని యత్నిస్తే వీరులిలాగున నటించటం అధికారకతత్వం విషయాలను నిరంకుశ నైఖరితో నిర్వహిం చటం ప్రజలపై మేలును కురిపించాలని యత్నాలు చేయటం. యిలాంటి అన్నిరకాలతప్పులు తలయెత్తుతాయ్.

ప్రజా విముక్తికై జరిగే పోరాటంలో కమ్యూనిస్టు ప్రజానీకానికి నాయకుడుగా లేక దిక్సూచకుడుగా మాత్రమే వ్యవహరించాలి. వ్యవహరించగలడు. ప్రపంచాన్ని జయించే కర్తవ్య నిర్వహణలో ప్రజలకు బదులుగా వారిస్థానంలో అతడు "వీరుడుగా" వ్యవహరించరాదు, వ్యవహరించజాలడు. తమ విప్లవపోరాటంలో ప్రజానీకానికి దూరదృష్టి కలిగియున్న గట్టిగా నిలబడగలిగిన నాయకులను చేకూర్చుకొనవలసిన గట్టి అవసరంవుంది. ప్రజానీకం విజయాన్ని చేపట్టుటకై తప్పని సరిగా దిక్సూచకులను కలిగియుండాలి. కాని, తమకొరకు ప్రపంచాన్ని జయించే "వీరులతో" ప్రజానీకానికి అవసరం లేదు. ఎందువల్లనంటే అలాంటి "వీరులు" ప్రజలనుండి వేరు పడియుంటారు. కాబట్టి ప్రజా విముక్తి ఆశయానికై వారు సాధించ గలిగిన దేమీవుండదు.

నాల్గవది ప్రజలనుండి నేర్చుకోవాలన్న దృక్పథం. ప్రజలకు బాగా సేవచేయుటకు, వారి చైతన్యాన్ని సరిగా వెలిగింపజేయుటకు, వారి కార్యకలాపాలకు దిక్సూచనయిచ్చుటకు కమ్యూనిస్టులమైన మనం కొన్ని లక్షణాలను కలిగియుండాలి. మనకు ముందుజూపు లేక ముందుఆలోచన యుండాలి. దీని కర్థమేమంటే, వెలుగొందనివారు వెలుగులోనికి వచ్చుటకు సహాయపడగలిగిన ఏకైక వ్యక్తులుగా, వెలుగు సందేశాన్ని యిచ్చేవారుగా మనంవుండాలి. ప్రజావిముక్తి ఆశయానికి మనంజూపే పరిపూర్ణ భక్తితోపాటు, అనంత వుత్సాహంతోపాటు, అనంత త్యాగబుద్ధితోపాటు ప్రజలచైతన్యాన్ని మనం విజయవంతముగా పెంపొందించగలిగేముందు, వారి కార్యకలాపాలలో వారిని నడిపేముందు, వారికి చక్కగా సేవజేసేముందు మనం తగినంతజ్ఞానాన్ని, అనుభవాన్ని, జాగ్రుతిని కలిగియుండాలి. మనం జ్ఞానాన్ని, అనుభవాన్ని, దూరదృష్టిని సంపాదించుకోవాలంటే మనం నేర్చుకోవటం తప్పనిసరి.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాలను, ఇతర దేశాలలోని ప్రజాపోరాటాల గుణపాఠాలను, చరిత్రను అధ్యయనం చేయుటద్వారా మనము మన జ్ఞానాన్ని అభివృద్ధిపరచుకోవచ్చును. మనం మన శత్రువులనుండికూడా నేర్చుకోగలం. ప్రజల జ్ఞానం, అనుభవాలు, అమితంగావుండును కాబట్టి, అత్యంతప్రయోగాత్మకంగా వుండును కాబట్టి వారి సృజనాత్మక శక్తి అమోఘంగావుండును కాబట్టి ప్రజానీకంనుండి నేర్చుకోవటం అనేదే అత్యంతప్రధానమైన విషయం. అందువల్లనే

కామ్రేడ్ మావోసేటుంగ్, మనం ప్రజలను శిక్షగర పేముండు, మనం ప్రజలనుండి నేర్చుకోవాలని అనేకసార్లు నొక్కివక్కాణించేడు.

మన కామ్రేడ్సు నమ్రతగా ప్రజలనుండి నేర్చుకొన్నప్పుడే ప్రజలజ్ఞానాన్ని, అనుభవాన్ని వడగట్టినప్పుడే వాటిని వున్నతస్థాయికి జెందిన క్రమబద్ధజ్ఞానంలోనికి మార్చినప్పుడే ప్రజలచైతన్యాన్ని అభివృద్ధిజేయుటకు వలసిన సరియైన చర్యలను తీసుకొనగలుగుతారు. ప్రజల కార్యకలాపాలకు సరియైన దిక్సూచికత్వాన్ని యివ్వగలుగుతారు. ప్రజల చైతన్యాన్ని అభివృద్ధిజేయుటకు ప్రజలను నడుపుటకు పైనుదహరించబడిన పద్ధతులను అనుసరించకుండా మనం వాటికి బదులుగా అహంకారంతో మన వూహాలలో జనించిన కొన్ని స్కీములను తయారుజేస్తే లేక విదేశాల అ: ాలు, చారిత్రక నిదర్శనాలనుండి కొన్ని స్కీములను ( ఎజేసి, యాంత్రికంగా ప్రవేశపెట్టితే వాటివల్ల సాధి ౨గిన ప్రయోజనం శూన్యం. శ్రమ దండుగ అవుతుంది. మనం అవిచ్ఛిన్నంగా ప్రజలనుండి నేర్చుకొనుటకుగాను, ఎక్కక్షణమైనా ప్రజల నుండి వేరుపడియుండకూడదు. మనం ప్రజలనుండి వేరుపడియుంటే మన జ్ఞానం విపరీతంగా పరిమితమైపోతుంది; మనం తెలివితేటలను పొందలేమనుట నిశ్చయం. మనకు కావలసిన సమాచారం లభించదనుట నిశ్చయం. మనం సద్గురులుగా వుండజాలమనుట నిశ్చయం. ప్రజలకు నాయకత్వంవహించుటకు మనకు అర్హత వుండదనుట నిశ్చయం.

“యదార్థానికి మన వున్నత సంఘాలలో కొన్నింటి

కన్న సామాన్యవ్యక్తి తరచుగా సత్యానికి సన్నిహితముగా వుంటాడు.''

"మన ఆశయానికి నాయకత్వాన్ని యిచ్చుటకుగాను, మనం మన అనుభవాలమీదనే లేక నాయకుల అనుభవము మీదనే పూర్తిగా ఆధారపడియుంటే సరిపోదు. నాయకత్వాన్ని సవ్యంగా అమలుజరుపుటకు, నాయకుల అనుభవాలకు పార్టీ మెంబర్లు, కార్మికవర్గసభ్యుల, శ్రీమజీవుల అనుభవాలనూ అంతేగాకుండా "ప్రాధాన్యతలేని వ్యక్తులు" అని పిలువబడేవారందరి అనుభవాలనూ తప్పకుండా కలుపాలి."

దీనిని సిద్ధింపజేసుకోటానికి "ప్రజలకు, నాయకులకు మధ్య అత్యంతసన్నిహితసంబంధాలు వుండాలి. నాయకులకూ పార్టీమెంబర్లకూ కార్మికవర్గానికి, రైతాంగానికి మరియు కార్యకర్తలకుమధ్య అత్యంతసన్నిహితమైన సంబంధాలు వుండాలి."

"ప్రజలతో సంబంధాలను నిలబెట్టుకోవటం గట్టిపరచుకోవటం ప్రజలు చెప్పేదానిని వినుటకు సర్వదా తయారుగా వుండటం, యిష్టపడటం వీటిలోనే బోల్షివిక్కు నాయకత్వం యొక్కబలం, అది తప్పకుండా గెలుపొందుటకు కారణం వుంది" (స్టాలిన్ కలెక్టెడ్ వర్కున్, వాల్యూం, 5, పే. 322)

సోవియట్ యూనియను కమ్యూనిస్టులకు కామ్రేడ్ స్టాలిన్ యిచ్చిన సలహా అలాంటిది. అదొక సార్వజనిక సత్యం.

సవ్యంగా నాయకత్వాన్ని అమలుజరపటం పరిస్థితిని గురించి సవ్యఅభిప్రాయాన్ని కలిగియుండటం దాని సారాం

శాన్ని గ్రహించటం కర్తవ్యాలను ముందుంచటం నిర్ణయాలు చేయటం యీ నిర్ణయాలను అమలుజరుపుటకుగాను, పనిని పర్యవేక్షించుటకుగాను ప్రజలను సమీకరించటం, సంఘటిత పరచటం యనేవి నాయకుల నాయకత్వ సంఘాల గురుతర కర్తవ్యాలు. దీనిని చక్కగా కొనసాగించాలంటే, ప్రజలనుండి నేర్చుకోవటం "ప్రజలనుండి వచ్చే" పంథాను "ప్రజలకు తిరిగి వెళ్ళే" పంథాను అనుసరించటం చాలా అవసరం. అలా చేయకపోతే నాయకత్వం సంతృప్తికరంగా నడువజాలదు.

ప్రజలనుండి నేర్చుకోవాలన్న దృక్పథానికి అర్థం అది. "అంతా ప్రజలకే" అన్న దృక్పథం ప్రజలకు బాధ్యత వహించాలన్న దృక్పథం ప్రజలు తమ్ముదాము విముక్తి జెందించుకొన గలరన్నదానిలో నమ్మకం గలిగియుండుటకు సంబంధించిన దృక్పథం ప్రజలనుండి నేర్చుకోవాలన్న దృక్పథం యీ దృక్పథాలన్నీ కలిసి ప్రజాదృక్పథాలుగా ఏర్పడుతాయి. ప్రజలపట్ల ప్రజల అగ్రగామిదళం వహించవలసిన దృక్పథాలివి. అలాంటి దృక్పథాలద్వారానే, పటిష్ఠమైన, అసందిగ్ధమైన ప్రజాదృక్పథాలద్వారానే, మన కామ్రేడ్సు తమపనిలో స్పష్టమైన ప్రజాపంథాను కొనసాగించగలరు. సవ్యమైన నాయకత్వాన్ని అమలుజరుపగలరు.

కార్మికసంఘాలలోనూ లేక రైతుసంఘాలలోనూ పని చేయుటమాత్రమే ప్రజలలో పనిచేయటంయనీ, ఇతర సంఘాలలో పనిచేయటమంటే ప్రజలలో పనిజేయటం గాదనీ కొంతమంది కామ్రేడ్సు భావిస్తున్నారు. ఇది శుద్ధతప్పు; పార్టీ కార్యకలాపాలన్నీ, లేక పార్టీ

అధ్వర్యాన నడిచే కార్యకలాపాలన్నీ ప్రజా కార్యకలాపాలే. ఎట్టిమినహాయింపులు లేకుండా వీటిని ప్రజాదృక్పథరీత్యా ప్రజాపంథాపై ఆధారపడి ప్రజలద్వారా కొనసాగించాలి. ప్రతికార్యకలాపానికి ప్రజాపంథా, ప్రజాదృక్పథాలు అవసరం.

మనపార్టీ ప్రజానీకంలో ఒక భాగంకాబట్టి, అంతేగాక మనపార్టీ ప్రజాసేవకై అంకితమైనది కాబట్టి మనపార్టీలో పనిచేయటంకూడా ఒకరకపు ప్రజా కార్యక్రమ నిర్వహణయే. దీనిని ప్రజాపంథాను అనుసరించి కొనసాగించాలి.

సైన్యం, ప్రజలలో ఒకభాగం కాబట్టి ప్రజాసేవకై అదికూడా అంకితమైనట్టిది కాబట్టి సైన్యంలో మనం పనిచేయటంకూడా ఒకరకపు ప్రజా కార్యక్రమాన్ని నిర్వహించినట్లే. దీనిని ప్రజాపంథా ననుసరించి కొనసాగించాలి.

వివిధరకాల పనులకు, వాటికి సంబంధించిన ప్రత్యేక నిర్వహణ పద్ధతులుంటాయ్. ఒకదానితో మరియొకదానిని కలగాపులగంజేసి గందరగోళం పడకూడదు. పార్టీ, సైన్యములలో పనిచేయుపద్ధతులకు, పనిరూపాలకు కార్మిక, కర్షక సంఘాలలో పనిచేయుపద్ధతులకు గల భేదాలను గుర్తెరుగాలి. ఏమైనప్పటికి యివన్నీ ప్రజా కార్యక్రమానికి జెందినవే.

సహజంగా ప్రజానీకం అంతా ఒకేరకంగా వుండదు. అందువలన మనపనికూడా వాటినిబట్టి భేదిస్తూవుంటుంది. మన కామేడ్స్ తమతమ రంగాలలో ప్రతి ఒక్కరూ యేదో ఒక సెక్షనుకు జెందిన ప్రజలకు సేవజేయాలి. అంటే ఫ్యాక్టరీ కార్మికులకు ఆఫీసులలో పనిజేసేవారికి, ఆర్మీయూనిట్‌లోని సైనికులకు లేక కొంతప్రజలకు సేవజేస్తూవుండాలి. ఏమైనప్పటికి

మొత్తంమీద ప్రజలందరికీ సేవజేయటం అనేది అందరికి సమానధ్యేయం.

అందువలన మన కామ్రేడ్స్ మొత్తమునకు భాగము నకు మధ్యగల సంబంధాన్ని సవ్యంగా అర్థంజేసుకోవాలి. పాక్షిక కార్యకలాపాలలో ప్రత్యక్షంగా నిమగ్నులవుతూ ఒక సెక్షను ప్రజలకు సేవజేస్తూవున్నారంటే దాని కర్థమేమంటే వారు పరోక్షంగా పరిపూర్ణ విప్లవాశయానికి తోడ్పడుతూ, బలపరుస్తూ, ప్రజలందరికీ సేవజేస్తూవున్నారన్నమాట. ఒక్క భాగంమీదనే కేంద్రీకరించి మొత్తంపట్ల అశ్రద్ధజూపటము గానీ, లేక మొత్తంమీదను కేంద్రీకరించి భాగంపట్ల అశ్రద్ధ జూపటంగానీ శుద్ధతప్పు. భాగాలును మొత్తమునూ సమైక్యం జేయాలి.

ప్రజల పాక్షిక ప్రయోజనాలకు అంటే తాత్కాలిక ప్రయోజనాలకూ, వారి మొత్తం ప్రయోజనాలకూ అంటే దీర్ఘకాలిక ప్రయోజనాలకూ మధ్య సంఘర్షణవస్తే, తాత్కాలిక ప్రయోజనాలను, దీర్ఘకాలిక ప్రయోజనాలకు లోబరచాలి. దీని కర్థమేమంటే చిన్న కారణాన్ని పెద్ద కారణానికీ, చిన్నసూత్రాన్ని పెద్దసూత్రానికి లోబరచాలి. ఇది చాలా కఠినసమస్య; ఏమైనప్పటికినీ అన్ని ప్రత్యేక పరిస్థితులలోనూ మన కామ్రేడ్సు ఎలా ఆలోచించాలో తెలుసుకోకపోతే, భేదాలను సవ్యంగా ఎలా కనుక్కోవాలో తెలుసుకొనకపోతే, ప్రజల పాక్షిక, మౌలిక ప్రయోజనాలను ఎలా సహకరింపజేయాలో తెలుసుకోకపోతే పరిపూర్ణమైన ప్రజా పంథా అంటూ ఒకటి వుండజాలదు. పైన చెప్పబడినవిధంగా తెలుసు

కోకపోతే వారు తెలిసో, తెలియకో, అత్యధిక ప్రజానీకం యొక్క దీర్ఘకాలిక ప్రయోజనాలకు వ్యతిరేకంగా ఒకసెక్షను ప్రజల ప్రయోజనాలను సపోర్టుజేయటం జరుగుతుంది. తన్మూలంగా వారు ప్రజానీకంనుండి వేరుపడుతారు.

అన్ని సెక్షన్ల ప్రజలలోనూ సాధారణంగా చురుకైనవారు, మధ్యస్థులు, వెనుకబడియున్నవారూ వుంటారు. ప్రథమదశలలో చురుకైనవారు సాధారణంగా తక్కువసంఖ్యలో వుంటారు. మధ్యస్థులు, వెనుకబడియున్నవారూ ఎక్కువగా వుంటారు. ప్రజాపంథా ననుసరించి మెజారిటీపట్ల అంటే మధ్యస్థులు, వెనుకబడి యున్నవారిపట్ల మనం శ్రద్ధవహించాలి. అలా చేయకపోతే అభివృద్ధిజెందిన సెక్షన్లు మెజారిటీనుండి వేరైపోతారు. తన్మూలంగా సంతృప్తికరంగా యేదీ చేయజాలం. మనం ప్రజలముందుపెట్టే కార్యాచరణకు సంబంధించిన నినాదాలు, పోరాటరూపాలు, నిర్మాణరూపాలన్నీ ప్రజలలో మధ్యస్థశక్తులకు వెనుకబడియున్న శక్తులకు ఆమోదకరంగావుండాలి. ప్రజల స్వీయ చైతన్యాభివృద్ధి స్వీయ కార్యాచరణ యనేవి వీరికి ప్రధాన విషయాలు. ఈ ప్రజలు (మధ్యస్థులు, వెనుకబడియున్నవారు) జాగృతి జెందిననాడే, కార్యాచరణకు దిగాలన్న వుత్సాహం రేకెత్తిననాడే, ప్రజావుద్యమం సాధ్యమవుతుంది.

ప్రజానీకంలో నాయకత్వానికి కేంద్రాలుగా తయారవుటకుగాను, చురుకైన వారందరినీ అధ్యయనం జేయించుటకు ఐక్యపరచుటకు, సంఘటితపరచుటకు మనం ప్రత్యేక శ్రద్ధను జూపాలి. ఏమైనప్పటికినీ, మనం యీ చురుకైన శక్తులను

సంఘటితపరుస్తున్నామంటే, అది వారొక్కరి క్షేమంకోరకే గాదనీ, మధ్యస్థులనుండి వెనుకబడి యున్నవారినుండి వీరిని దూరంచేయటం, పరిపూర్ణంగా అసమ్మతనీయమనీ మనం స్పష్టంగా అర్థం జేసుకోవాలి. మన ప్రధాన లక్ష్య మేమంటే, చురుకైన శక్తులద్వారా మధ్యస్థ శక్తులను, వెనుకబడియున్నవారిని ఆకర్షించటం, వారు కదలిపనిచేసేటట్లు చేయటం అనేవి మన ప్రధానలక్ష్యాలు. మధ్యస్థశక్తులు, వెనుకబడియున్న శక్తులు, యింకా జాగృతిజెందకపోయినట్ల యితే వారి నెలా జాగృతిజెందించాలో వారు జాగృతిజెందు నంతవరకూ ఎలా వేచియుండాలో మనకు తెలిసియుండాలి. మనం అలావేచియుండకుండా బాధ్యతారహితంగా మనం మనలను అనుసరించే అల్పసంఖ్యాకులైన చురకైన శక్తులను వెంటవేసుకొని ముందుకు పరుగెత్తిపోతే ప్రజలనుండి తప్పక వేరుపడుతాం, పరాజయంలో మనలను అంతంజేసుకొంటాం.

చైనాజనాభాలో రైతాంగప్రజలసంఖ్య నూటికి ఎనభై వంతులుంది. జాతిని మొత్తంమీద తీసుకొని ఆలోచిస్తే, మెజారిటీని పరిగణిస్తే రైతాంగాన్ని పరిగణించినట్లవుతుంది. మన ప్రజాదృక్పథానికి, మన గ్రామీణ దృక్పథానికి అత్యంత సన్నిహితసంబంధంవుంది. ప్రస్తుతపరిస్థితులలో చైనాకార్మిక వర్గం చైనారైతాంగాన్ని అలక్ష్యంజేసినా, లేక గ్రామీణ జిల్లాల విముక్తిజేయాలన్నదానికి ప్రత్యేకప్రాధాన్యత యివ్వక పోయినా తన కర్తవ్యాన్ని పరిపూర్తిజెందించజాలదు.

మేధావులను మినహాయించి, చైనారైతాంగప్రజలు, తదితర సెక్షన్లప్రజలు, సాంస్కృతికంగా చాలా వెనుకబడి

యున్నారు. అందువలన మనం మనపనిలో వ్యక్తిగత దిక్సూచికత్వాన్ని సాధారణసూచనలతో సమ్మిళితమొనరించి ఒక బిందువువద్ద యీ అజ్ఞానవలయాన్ని (సంస్కృతి లేక పోవటం అనేవలయాన్ని) ఛేదించుకొంటూ బయటపడి ఒక మహోద్యమాన్ని ప్రజ్వలితంచేయాలి. సాంస్కృతికంగా వెనుకబడియున్న ప్రజానీకంలో సాధారణ సూచనలు మాత్రమే విజయాన్ని సాధించజాలవు. దీనికి కారణమేమంటే మన సాధారణప్రచారం నినాదాలపై ఆధారపడుటకు బదులుగా ప్రజానీకం అందులో ప్రత్యేకంగా రైతాంగం సాధారణంగా తన అనుభవాలను ఆధారంగా తీసుకొని సమస్యలపై సమాలోచనలు జరుపుతుంది. మన కార్యక్రమాన్ని కొనసాగించుటలో ప్రజలకు ఒక వుదాహరణను యిచ్చుటకుగాను వారు తమంతటతామే విషయాలను పరిశీలించునట్లుగా చేయుటకుగాను, వారంతటవారే విషయాలను అర్థంజేసుకొనుటకుగాను మనం ఒకే బిందువువద్ద వలయాన్ని ఛేదించాలి. ప్రజలకు ప్రదర్శనాత్మకమైన వుదాహరణలిచ్చుటద్వారానే మనం ప్రజలను అందులో ప్రత్యేకంగా వెనుకబడియున్న శక్తులను, మధ్యశక్తులను వారు తమంతట తాము సమస్యలను అర్థంజేసుకొనటానికి అవకాశాలను, సౌకర్యాలను కల్పించుట ద్వారా ప్రోత్సహించగలం. తత్ఫలితంగా పార్టీనినాదాలక్రింద పనిచేయుటకు ధైర్యం, పార్టీనినాదాలలో విశ్వాసం వారిలో ఏర్పడుతుంది. ప్రజలవుత్సాహం ప్రజ్వలితమై పరాకాష్ఠను పొందుతుంది.

ఇటీవల వివిధ ప్రదేశాలలో సైనిక వీరులు, కార్మిక

వీరులు, మోడల్ వర్కర్లు విశిష్టమైనపాత్రను నిర్వహిస్తున్నారు. వుత్తమ ప్రచారకులుగా తయారయ్యేరు; ప్రజల అగ్రనేజ ర్లుగా తయారయ్యేరు; దీనికి కారణమేమంటే ప్రజలకు సుపరిచితమైన అలాంటి సజీవ వ్యక్తులుద్వారా, వుదాహరణల ద్వారా, అనుభవాలద్వారా ప్రజలు తమంతటతామే సమస్యలను అర్థంజేసుకొంటున్నారు; ఆ విధముగా వారి చైతన్యం, ఆత్మవిశ్వాసం వున్నోత్తుగా పెరుగుతూవుంది. చైనాదేశపు విప్లవ స్థావరాలలో విప్లవాత్మత పునర్నిర్మాణం యావజ్జాతికీ శిక్షను గరపునట్టి, వెలుగిచ్చునట్టి పాత్రను ఎందుకు నిర్వహిస్తున్నదో అన్నవిషయాన్ని, వారి చైతన్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని ఎందుకు అభివృద్ధిజేస్తున్నదోయన్న విషయాన్నీకూడా అది వివరిస్తూవుంది. అందువలన నాయకత్వం తన సాధారణ సూచనలను పటిష్ఠంజేసుకొనుటకై స్పష్టమైన అనుభవాలను పొందుటకు ఒకే బిందువువద్ద వలయాన్ని ఛేదించాలన్నది యదార్థం. తమకు సుపరిచితమైన అనుభవాలు తెలియజెప్పనిదే ప్రజలు సాధారణ సూచనలను అర్థంజేసుకోవటం కష్టం.

ఆ విధంగా మనం యావత్తునూ మెజారిటీని (విషయాన్నంతటినీ) పరిరక్షిస్తాం; కాని, కవాట – బాధ – తత్వాన్ని (మడిగట్టుకొని కూర్చోటం; ఎవరితోనూ సంబంధాలు పెట్టుకోకుండా ద్వారాలు బంధించుకొని కూర్చోటాన్ని కవాట – బంధ – తత్వమంటారు), పాక్షికతత్వాన్ని విసర్జిస్తాం. మనం ప్రజలతో అత్యంత సన్నిహితమైన సంబంధాలను కోరుతాం. కాని, నిరంకుశత్వాన్ని యుద్ధస్వామికతత్వాన్ని వ్యతిరేకిస్తాం.

మనం ప్రజలను ముందుకు నడుపకోరుతాం. అంతే

గాని అధికారకతత్వాన్ని కోరం. మనం ప్రజలతో అత్యంత సన్నిహితమైన సంబంధాలను కోరుతాం. కాని, శైలిజాన్ని కోరం. ప్రజల చైతన్యాన్ని అభివృద్ధి పరచుటలోనూ, వారిని ముందుకు నడుపుటలోనూ, యీ నాటికే ప్రజలు పొంది యున్న స్థాయినుండి మనం బయలుదేరాలి. మనం మనపనిలో ప్రజలతో సాధ్యమైనంత ఘనంగా సంబంధాలను పెట్టుకొనుచు వాటితో వున్నతసూత్రాలు సరిపడేటట్లుగా చేయాలి, మన ప్రజాపంథా అలాంటిది.ఇది ఆచరించుటకు కష్టమన్నది యదార్థం. మంచి మార్క్సిస్టు, కమ్యూనిస్టుగా అవుటకు యిదొక్కటే మార్గం.

సాధారణ కార్యక్రమాన్ని గురించి వివరణ అది.

## రెండవ అధ్యాయం

# పార్టీ సభ్యత్వం

పద్దెనిమిదియేళ్ళు వయస్సు వచ్చినతర్వాతనే పార్టీలోనికి సభ్యుడుగా జేర్చుకోవాలని పార్టీనిబంధనావళి సూచిస్తోంది. దీనికి కారణమేమంటే యీవయసు వచ్చినతర్వాతనే సాధారణంగా ప్రతివ్యక్తికీ రాజకీయంగానిర్ణయించుకొనుటలో గట్టితనం యేర్పడుతుంది.

నిబంధనావళిని తిరిగి రచించకపూర్వం పార్టీలో చేర్చుకోబడిన పధ్దెనిమిదేళ్ళ వయస్సులోపువాళ్ళందరూ పార్టీ సభ్యులుగా నే పరిగణింపబడుతూవుంటారు.

ఒక యువకుడు చిన్నవయసులోనే రాజకీయం పరిపక్వ మైతే, అంటే పద్దెనిమిదేళ్ళవయసులోపలనే సభ్యత్వాన్ని పొందుటకు అర్హుడుగా తయారైతే అతనిని పార్టీసభ్యుడుగా చేర్చుకొనకపోవటం వలన పార్టీకి నష్టమని భావిస్తే అతనిని ప్రత్యేకంగా కాండిడేట్ - మెంబరుగా ఆమోదించవచ్చును. ఏమైనప్పటికీనీ, పూర్ణసభ్యుడుగా అతనిని పద్దెనిమిదేళ్ళ వయసువచ్చినతర్వాతనే పరిగణించాలి.

కొత్తసభ్యులను జేర్చుకోవటంలో వయసుకు సంబంధించిన నిబంధనతోపాటు, వారి సామాజిక హోదాల ననుసరించి పార్టీలోనికి సభ్యులుగా జేర్చుకొనవలసినవారిని నాలుగురకాలుగా పార్టీనిబంధనావళివర్గీకరిస్తూవుంది. చైనాలోని ప్రస్తుత పరిస్థితులను బట్టి అలాంటివర్గీకరణ అవసరం.

ఇందులో మొదటిరకానికి కార్మికులు, కూలీలు వ్యవసాయ కూలీలు, బీదరైతులు, పట్టణాలలోనిబీదలు, విప్లవాత్మక సైనికులు జెందుతారు. ఈ రకానికి జెందినవారిని పార్టీలోనికి తీసుకొనటానికై శిఫారుస్సనకు వారి అర్హతలకు సంబంధించిన షరతులు చాలా సులభంగావున్నాయ్. దీని కర్థమేమంటే పార్టీలోనికి జేర్చుకోటానికి శ్రామికవర్గశక్తుల అర్థశ్రామికవర్గశక్తుల విషయంలో ప్రత్యేక ఆటంకాలంటూ లేవన్నమాట. తమ బాల్యంనుండి మన విప్లవ అనుయాయులలో పెరిగినవారికికూడా పైది వర్తిస్తుంది.

పట్టణాలలోని బీదలన్నదానికి అర్థమేమంటే దివాళా తీసిన చేతిపనివాళ్లు, వీధులవెంబడి తిరిగి వస్తువుల అమ్మకొని జీవించేవారు, పట్టణాలలో వుద్యోగాలకోసం యత్నం జేసి

విఫలులైన రైతులు, జీవితాన్ని వెళ్ళదీయుటకై అడపాదడపా దొరికే కూలిపనిపై ఆధారపడే కూలీలు అని అర్థం.

రెండవ రకానికి జెందినవారు పెటీబూర్జువా వర్గంలో నుండి విప్లవకారులు, వీరిని పార్టీలోనికి జేర్చుకోవలసినదిగా పార్టీ మెంబర్లలో అనుభవజ్ఞులే శిఫార్సు చేయాలి. వీరి కాండిడేచర్ కాలం (పార్టీలో చేర్చుకొనబడే ముందు అర్హతను సంపాదించుకొనుటకై సేవ జేయవలసిన కాలం) ఒక్క సంవత్సరం. ఈ విధంగా యెందుకు నిర్ణయించబడినదంటే ఈ వర్గం నుండి వచ్చినవారి సిద్ధాంతాలు, సాధారణంగా గజిబిజిగా వుంటాయ్. పార్టీ క్రమశిక్షణపట్లనూ, తీవ్ర విప్లవాత్మక పోరాటాలలో పాల్గొనుటపట్లను, వీరికి తరచుగా కొన్నితప్పుడు అభిప్రాయాలుంటాయ్. అందువలన సభ్యత్వార్హతకాలం దీర్ఘమైనదిగా వుండాలి. బాగా అనుభవం వున్న పార్టీసభ్యుల శిఫార్సు వీరికి వుండాలి.

నిబంధనావళిలో వాడబడినట్లుగా యీ రకానికిజెందిన "జీతాలు పుచ్చుకొంటున్న వుద్యోగులు" అన్న శబ్దం పాత పరిపాలిన కాలపు వున్నత వుద్యోగులకు వర్తించదు.

జాతీయ పరిధిలో చైనా విప్లవం యింకా విజయాన్ని సాధించలేదు. కాబట్టి చైనాదేశంలోని ఎక్కువ ప్రాంతాలలో మనపార్టీ యింకనూ ప్రచ్ఛన్న జీవితాన్ని గడుపుతూవుంది. కాబట్టి మనపార్టీలో జేరాలని అనేకమంది విప్లవకారులు తహతహలాడుతున్నారు. కాని వారికి మార్గం కనుపడుట లేదు. అందువలన యిటీవల విప్లవం వ్యాపించిన ప్రదేశాలలో మొదటి రెండవ రకాలకుజెంది వ్యక్తులను పార్టీలో జేర్చ

కొనుటకు శిఫార్సు చేసే వ్యక్తుల కుండవలసిన అర్హతల విషయం లోనూ, సభ్యత్వార్హత కాలం విషయంలోనూ తాత్కాలికంగా పార్టీ నిబంధనను కొంత సడలించాలి. అలాంటి తాత్కాలిక చర్యల నన్నింటినీ ఆ రాష్ట్రం లేక ఆ ప్రాంతానికి సంబంధించిన పార్టీ కమిటీ నిర్ణయించాలి.

మూడవరకానికి మధ్యమతరగతి, పై తరగతి దోపిడి వర్గాలకు సంబంధించినవారు; వీరి సిద్ధాంతాలు మరింత చిక్కులమారివిగా వుంటాయ్; పార్టీ కార్యక్రమాన్ని, క్రిమశిక్షణను ఆమోదించుటకు వీరికి మహా యాతనగావుంటుంది. అందువలన పార్టీ నిబంధనావళి వీరి విషయములో యేమని నిర్ణయించినదంటే వీరు తమ్ము పార్టీలో చేర్చుకోవలసినదిగా పెట్టుకొనే దరఖాస్తులపై, బాగా అనుభవంవున్న పార్టీసభ్యుల శిఫార్సువుండాలనీ, దానికి సంబంధించిన వున్నత పార్టీ-కమిటీ ఆ దరఖాస్తులను ఆమోదించాలనీ వీరికి సభ్యత్వార్హతకాలం రెండు సంవత్సరాలనీ నిర్ణయించింది,

నాల్గవరకానికి జెందినవారెవరంటే, యితర రాజకీయ సిద్ధాంతాలను ఆమోదించి, యితర రాజకీయ పార్టీలలోనూ, లేక గ్రూపులలోనూ జేరినవారు. వీరిని పార్టీలో జేర్చుకొనుట విషయమై పార్టీ నిబంధనావళి యేమని చెప్పుతూవున్నదంటే, వీరిని పార్టీలో జేర్చుకొనుటకు పై నుదహరింపబడినవారికన్న మరింత బాగా అనుభవంవున్న పార్టీసభ్యుల శిఫార్సు వీరికి వుండాలనీ, బాగా వున్నత పార్టీ - కమిటీ వీరి విషయము పూర్తిగా పరిశోధించి, ఆమోదించిన తర్వాతనే వీరిని పార్టీలోనికి తీసుకోవాలనీ చెపుతూ వుంది. ఏమైనప్పటికినీ,

ఇతర రాజకీయపార్టీల సాధారణసభ్యునకునూ, అతనికన్న బాధ్యతగలస్థానంలో నున్న సభ్యునకునూ అత్యంతప్రధానమైన బాధ్యతాయుతమైన స్థానంలోనున్న సభ్యునకునూ, మధ్య భేదాన్ని గమనించాలి. తాను వత్తిడిమూలంగా కొమింటాంగ్‌లో చేరాననీ, లేక తన అభీష్టానికి వ్యతిరేకంగా లేక తన స్వచ్ఛంద అభిప్రాయాన్ని పాటించకుండా గ్రూపు రాజకీయాలద్వారా తన్ను కొమింటాంగ్‌లో జేర్చివేసుకొన్నారని, తాను దానిలో జేరినతర్వాత దాని రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనలేదనీ ఒకవ్యక్తి రుజువుచేసుకొంటే అతని యితరరాజకీయపార్టీ సిద్ధాంతాలకు సంబంధించినవానిగా జూచుటకు బదులుగా అతని సామాజిక హోదాకు అనువర్తనీయమైన క్రమాన్ని అనుసరించి మనపార్టీ లోనికి తీసుకోవాలి.

తమ తమ పార్టీలను వదలివచ్చినతర్వాతనే యితర పార్టీలకు జెందినవారిని మనపార్టీలో జేర్చుకోవాలి.

కార్మికసంఘాలు, రైతుసంఘాలు, లేక సాంస్కృతిక సంస్థలులాంటి కొన్నిసామాజికసంఘాల సభ్యులకు - యితర రాజకీయసంఘాలలోగాని, గ్రూపులలోగానీ జేరనివారికి - వారి సామాజికహోదా ననుసరించి పార్టీలో ప్రవేశమివ్వాలి.

మనపార్టీలో పూర్వంసభ్యుడుగావుండి, మనపార్టీని వదలిపోయి, మరల పార్టీలో ప్రవేశించగోరే వ్యక్తి నాల్గో రకానికిజెందిన వానిగా పరిగణించాలి. నాలుగో రకానికి సంబంధించిన క్రమంద్వారానే అతనికిపార్టీలో ప్రవేశమివ్వాలి. ఎందువల్లనంటే ఆలాంటి వ్యక్తి రాజకీయ వూగిసలాటను ప్రదర్శించాడని మనకు వ్యక్తమవుతూవుంది. అందు

వలన అతనిని పార్టీలో చేర్చుకొనుటకు మరింత బాగా అను భవమున్న పార్టీసభ్యులు శిఫార్సుచేయాలి. ఉన్నతకమిటీ ఇతనినిగురించి పూర్తిగా పరిశోధించాలి. ఏమైనప్పటికినీ సభ్యత్వాపేక్షిత కాలాన్ని తగ్గించవచ్చును.

పార్టీతో అతనికి సంబంధాలు స్వచ్ఛంద పూర్వకంగా తెగిపోక పోయినట్లయితే అతడు తన్ను మరల పార్టీలోనికి తీసుకోవలసినదిగా కోరినప్పుడు ఆ విషయాన్ని రాష్ట్రపార్టీ కమిటీ లేక ప్రాంతీయకమిటీ లేక వున్నతపార్టీ కమిటీ వెంటనే విచారించి అతనిని పార్టీలో జేర్చుకోవాలి. నూతన సభ్యుడు అనుసరించవలసిన క్రమాన్ని యితడు అనుసరించ నక్కర లేదు.

ప్రతి నూతన సభ్యుడూ, నిర్దేశించబడిన క్రమాన్ని వ్యక్తిగతంగా అనుసరించుటద్వారా పార్టీలో ప్రవేశించాలనీ అంటే అతడు వ్యక్తిగతంగా దరఖాస్తు నిచ్చుకోవాలని దర ఖాస్తు ఫారంపై సంతకం జేయాలనీ, యితనిని సభ్యుడుగా జేర్చు కోవలసినదని శిఫార్సుజేస్తూ పార్టీసభ్యులు యిచ్చిన జాబులను కలిగియుండాలనీ పార్టీనిబంధనావళిలో వ్రాయబడివుంది. అతని దరఖాస్తును పార్టీ శాఖయొక్క సాధారణసభ్యుల సమావేశంలో చర్చించి, నిర్ణయించాలి. సాధికారక వున్నతపార్టీకమిటీ దానిని ఆమోదించాలి. సామూహికంగా పార్టీసభ్యులుగా జేర్చు కొనుట, రద్దు అయిపోయిందని భావించాలి. అవసరమైన పార్టీ లోనికి సభ్యులను తీసుకొనే విధానం ఆయా ప్రదేశాలనుబట్టి మారవచ్చు.

పార్టీలోని సభ్యులుగా జేర్చుకొనవలసినదిగా శిఫార్సు జేసేవారి బాధ్యతలను గురించి, నూతనపార్టీ సభ్యుడి ప్రవే

శాన్ని గురించి నిర్ణయించే, ఆమోదించే పార్టీ కమిటీల బాధ్యత లను గురించి పార్టీ నిబంధనావళిలో వివరించబడింది. ఈ నిబంధనలు చాలా ప్రధానమైనవి. అన్ని స్థాయిలకు చెందిన పార్టీ కమిటీలు వీటిని కచ్చితంగా అమలుజరుపాలి. కొన్ని పార్టీ కమిటీలు వీటిని అమలుజరుపలేదు. అలాకాకుండా అన్నిపార్టీ కమిటీలు యీ నిబంధనలను అమలు జరుపాలి.

జపాను వ్యతిరేకయుద్ధం ప్రారంభమైనది లగాయతు మనపార్టీ అద్భుతంగా అభివృద్ధి చెందింది. పది లక్షలమందిని పార్టీ సభ్యులుగా చేర్చుకొంది. రమారమి వేయివరకూ కౌంటీ పార్టీ కమిటీలను స్థాపించింది. వేలాది పార్టీ శాఖలను స్థాపించింది. ఆ విధంగా అది విముక్త ప్రాంతాలలో వీరోచిత పోరాటాన్ని నడుపుటలో 9 కోట్ల 50 లక్షలమంది సంఘటిత పరచి నడిపింది. అంతేగాక జపాను పాలిత ప్రాంతాలలోను కోమింటాంగ్ పాలిత ప్రాంతాలలోనూ, ప్రజా విప్లవపోరాటాలను నడిపింది. ఇవి అద్భుతమైన ఫలితాలు. పార్టీ మెంబర్లను చేర్చుకొనుటలోనూ, పార్టీ సంఘాలను సునిర్మితంగావించుటలోనూ, కొన్ని పార్టీకమిటీలు లోట్లను, తప్పులుకూడా చేసేయి.

కొన్ని పార్టీ కమిటీలకు, అందులో ప్రత్యేకంగా రాష్ట్రీయ సరిహద్దు ప్రాంతీయ, ప్రాంతీయ కౌంటీస్థాయికి చెందిన పార్టీ కమిటీలులాంటి వున్నత కమిటీలకు బాధ్యతగల నాయకత్వం స్పష్టమైన కార్యక్రమం స్పష్టమైన దిక్సూచను అనుభవాలను సమీక్ష,లాంటివి లోపించాయి. పార్టీ నిర్మాణానికై కొత్త సభ్యులను చేర్చుకొనటం అనేది అత్యంత ప్రధాన

మైన విషయమన్నమాట వాస్తవం. కాని యీ వున్నత కమిటీలు, పార్టీ సభ్యులను జేర్చుకొనే కార్యభారాన్ని పార్టీ శాఖలు, సబ్ డిస్ట్రిక్టు పార్టీ కమిటీలపైన వదలివేసేయి; యేదో ఒక కాలపరిమితిని నిర్ణయిస్తూ యింతమంది సభ్యులను జేర్చాలన్నకోటాలనుపంచివూరుకున్నాయి. తత్ఫలితంగా పార్టీసభ్యుల సంఖ్యను విస్తరింపజేసే కార్యక్రమానికి నాయకత్వం లేకుండా దానిదారి అది త్రొక్కేటట్లుగా వదలివేయబడింది. పరిపూర్ణత్వంలేని వ్యక్తులచేతులలో రాజకీయంగా విశ్వాసపాత్రతలేని పార్టీనిర్మాణంలో అణుమాత్రమైనా అనుభవంలేని వ్యక్తుల చేతులతో నూతనసభ్యులను చేర్చేకార్యక్రమం చిన్నస్థాయికి చెందిన పార్టీసంఘాలను నిర్మించే కార్యక్రమం పెట్టబడింది. పార్టీనిర్మాణ పరిశుద్ధతకు దాని కట్టుదిట్టస్వభావానికి యిది అమితమైన నష్టాన్ని చేకూర్చింది. అలాంటిపరిస్థితులలో పైదానిఫలితంగా అనేకరకాల అవిశ్వాసనీయమైన, అపవిత్రమైన శక్తులు మనపార్టీలో చొరబడ్డాయి. అవాంఛనీయమైన శక్తులతోకూడిన కొన్ని పార్టీశాఖలు తలయెత్తేయి.

ఉన్నతపార్టీసంఘాలు, పార్టీవ్యవహారాలలో సరిగా నాయకత్వాన్ని వహించకపోవుటచే పార్టీశాఖలలో అలాంటివి కొన్ని యేర్పడ్డాయనుట నిర్వివాదాంశం. అలాంటి దౌర్భాగ్య పరిస్థితులను అంతంచేయటానికి అలాంటివి మరల సంభవించకుండా జేయుటకు కార్మికవర్గంయొక్క పురోగామికపార్టీని నిర్మించుటకు అన్నిస్థాయిలకుజెందిన పార్టీకమిటీలు, అందులో ప్రత్యేకంగా వున్నతకమిటీలన్నీ పార్టీసభ్యత్వసంఖ్య విస్తరణ కర్తవ్యానికి అర్హప్రాధాన్యత నిచ్చి పనిచేయాలి. కార్య

క్రమాన్ని సవ్యమార్గాన నడిపించుటకుగాను గతఅనుభవాలను సమీక్షించటంకూడా చాలా అవసరం.

గ్రామాలలో ఎలాంటివారిని పార్టీలో జేర్చుకోవాలి? శత్రువునకు వ్యతిరేకమైన పోరాటంలోనూ, కౌలువడ్డీరేట్ల తగ్గింపుకై జరిగిన పోరాటాలలోనూ, అధికోత్పత్తి వుద్యమం లోనూ, తదితర విప్లవపోరాటాలలోను తమ కార్యదీక్షతను, పరిపూర్ణత్వాన్ని ప్రదర్శించినవారిని పార్టీలో జేర్చుకోవాలి. ఎక్కడ అలాంటి వుద్యమాలు అభివృద్ధిజెందలేదో ఎక్కడ చురుకైన కార్యకర్తలు లేరో, అక్కడ చైతన్యంగల శక్తులను కొన్నింటిని తప్ప, ఎక్కువగా పార్టీసభ్యులను జేర్చుతుండ రాదు. అలాంటి ప్రదేశాలలో వివిధవుద్యమాలు అభివృద్ధి జెందినప్పుడే చురుకైన శక్తులు అక్కడ యేర్పడిననాడే తగి నంతకాలం అచ్చట ప్రచారాన్ని పరిశోధననూ సాగించిన తర్వాతనే వారినుండి తగినంతమంది పార్టీమెంబర్లను తీసు కోవాలి. అలాంటి వుద్యమాల అభివృద్ధి గ్రామీణజిల్లాలలో అసమానంగా వుంటుంది. చురుకైనశక్తులు ఏర్పడటం వాటి అభివృద్ధికూడా సమానంగా వుండదు. అందువలన పార్టీ సభ్యత్వ విస్తరణకార్యక్రమం ఒక తావునకు మరియొక తావు నకు భేదించాలి. పార్టీ సభ్యత్వవిస్తరణకై ఒకేరకమైన పిలుపివ్వరాదు. ప్రత్యేక పరిశోధనలు, స్పష్టమైనసూచనలపై ఆధారపడి పనిచేయాలి.

సాయుధసైన్యాలలో, ఫ్యాక్టరీలలో, పబ్లికుఆఫీసులలో స్కూళ్ళలో పనిజేసేవారిని పార్టీసభ్యులుగా తీసుకొనేటప్పుడు అనుసరించవలసిన విధానము పైన చెప్పబడినట్లుగా యుద్ధాల

లోనూ, తదితర పోరాటాలలోనూ తమ పోరాటశక్తిని ప్రదర్శించినవారిని తగినంత ప్రచారం వారిలో చేసినతర్వాతనే, వారికి శిక్షగరపిన తర్వాతనే వారిని పార్టీలోనికి తీసుకోవాలి.

పార్టీ సభ్యత్వ విస్తరణోద్యమం నడుపుటకు పూర్వం ప్రజానీకంయొక్క చురుకైనశక్తులలో పార్టీ కార్యక్రమాన్ని, విధానాన్ని, నిబంధనావళిని బహుళంగా ప్రచారంచేయాలి.

ఈ కార్యభారాన్ని పరిపూర్ణంగా విశ్వాసపాత్రులైన పార్టీనిర్మాణంలో అనుభవజ్ఞులైన అంతేగాక పని విధానములోనూ, సిద్ధాంతంలోనూ పరిశుద్ధులైన పార్టీ కార్యకర్తల ఆధ్వర్యానవుంచటం అత్యంత ప్రధానమైన విషయం. వారు నిగ్గుదేరినవారుగా వుండాలి. అలాంటిశక్తులు లేనిచోట అలాంటి వారిని సృష్టించాలి. వారికి యీ కర్తవ్యాన్ని చెప్పజెప్పే ముందు వారికి తర్ఫీదుయివ్వాలి; ఈ కార్యక్రమాన్ని వారు నడుపునప్పుడు స్పష్ట దికూచనను, శిక్షణను నిరంతరము యివ్వాలి. ఈ కార్యక్రమాన్ని అవిచ్ఛిన్నంగా కొనసాగించుటకు ప్రతిప్రాంతీయ పార్టీకమిటీలోనూ, కౌంటీ కమిటీలోనూ, లేక సబ్ డిస్ట్రిక్టు పార్టీకమిటీలోనూ పైనుదహరింపబడినవిధముగా సుశిక్షితులైన, నిగ్గుతేరిన ఆర్గనైజర్లు చాలామంది వుండాలి. పరిశోధన వగైరా వ్యవహారాలలో పాల్గొనుటకు, వివరంగా సంభాషణ సాగించుటకు యీ కమిటీలు నూతన సభ్యుల ప్రవేశాన్ని ఆమోదించుటలో పైనచెప్పబడిన కార్యకర్తలపై ఆధారపడాలి. పార్టీయొక్కనాయకత్వం, కంట్రోలు పోగొట్టుకొనకుండా ఆ విధముగా సభ్యత్వవిస్తరణ యనేది క్రమబద్ధమైనపనిగా తయారవుతుంది.

నూతనసభ్యులను జేర్చుకోవటమనేది పార్టీ శాఖయొక్క నిరంతర కార్యకలాపాలలో ఒకటి. అలాంటి ఆర్గనైజర్లు వున్నాగాని గదాయని, యేపార్టీ శాఖయూయీపనిలో మందకొడిగా తయారుకారాదు. పార్టీ శాఖలచే సభ్యులను చేర్చుకోవట మనేది జరుపబడాలి. పార్టీయొక్క వున్నతకమిటీలు క్రింది శాఖలకు పై కార్యకలాపాలలో చేయూత, దిక్సూచికత్వాన్ని యివ్వాలి. యీ వున్నతకమిటీలు, సుశిక్షితులైన ఆర్గనైజర్లపై దిక్సూచికత్వం విషయంలో ఆధారపడాలి.

నిబంధనావళిలో చెప్పబడినరీతిగా క్రొత్తసభ్యులను పార్టీలోనికి ప్రవేశపెట్టేవారు. క్రొత్తసభ్యులను గురించి యదార్థసమాచారాన్ని యివ్వాలి. క్రొత్తసభ్యుల దరఖాస్తులపై తమ ఆమోదాన్ని తెలిపేటప్పుడు పార్టీయొక్క వున్నత కమిటీలు తమపై గురుతరమైన బాధ్యతగలదని గుర్తించుకొని మరీ తమ ఆమోదాన్ని తెలియజేయాలి. అంతేగాని దీనిని యేదో లాంఛనప్రాయమైన విషయంగా జూడరాదు.

క్లుప్తంగా చెప్పాలంటే సభ్యత్వ విస్తరణ కార్యక్రమాన్ని సవ్యంగా నడుపాలి. అంటే ప్రజానీకంలోని పురోగామిక శక్తులు మన పార్టీలోనికి వచ్చేలాగున చేయాలి. ఇలా జరుగాలంటే పార్టీ శాఖలు, పార్టీ మెంబర్లు, స్వాతమే సుశిక్షితంగా కృషిజేయవలసి యుండుటయేగాక పార్టీయొక్క వున్నత కమిటీల సహాయకత్వం కూడా అవసరం.

విముక్త ప్రాంతాలలో పార్టీసభ్యుల సంఖ్య అత్యధికంగా వున్నప్పటికీనీ, సగానికి పైబడిన గ్రామాలలో పార్టీ శాఖలు లేవు. అనేక గ్రామాలలో ఒక్కపార్టీ సభ్యుడైనా

లేదు. కొన్ని సరిహద్దు ప్రాంతాలలోని నూటికి యాభై వంతుల గ్రామాలలో మాత్రం పార్టీశాఖలు వున్నాయ్. అనేక యితర ప్రాంతాలలోని నూటికి యాభై వంతుల గ్రామాలలో పార్టి సభ్యులే లేరు

పార్టి నాయకత్వాన్ని బలపరచుటకుగాను కొద్దిమంది తోనో, గొప్పమందితోనో ప్రతి గ్రామంలోనూ పార్టిశాఖను స్థాపించాలి. అందువలన పార్టి సభ్యత్వ విస్తరణ కార్యక్రమాన్ని, పార్టిశాఖల నెలకొల్పుటను విముక్తప్రాంతాలలో కొనసాగించాలి. ఇటీవలి సంవత్సరాలలో పార్టిశాఖలు స్థాపించబడిన గ్రామాలలో శత్రువునకు వ్యతిరేకంగా పోరాడుట ద్వారాను కౌలు, వడ్డీరేట్ల తగ్గింపుకై జరుపబడిన పోరాటాల ద్వారాను, అధికోత్పత్తి వుద్యమాలద్వారాను మూడు విధానాల సవరింపు వుద్యమంద్వారాను, కార్యకర్తలను పరిశీలించుటద్వారాను చెప్పుకొనదగినంత అభివృద్ధి జరిగింది. చెప్పుకొనదగినంతమంది చురుకైన శక్తులుకూడా యేర్పడ్డాయ్. ఈశక్తులనుండే పార్టిసభ్యులను ఎన్నుకోవాలి. నూతనంగా విముక్తి జేయబడినప్రాంతాలలో సభ్యత్వాన్ని జేర్పించే వుద్యమాలను నడిపించవలసిన అవసరం ఎంతయినావుంది. విముక్తి ప్రాంతాలలో పార్టిసభ్యులను జేర్చుకోవటంయనేది పార్టియొక్క అత్యంత ప్రధాన నిర్మాణకర్తవ్యాలలో నొకటి. ఈ కార్యక్రమాన్ని పై నుదహరింపబడిన సవ్యరీతులలో సవ్యంగా నడిపించాలి. గతంలో జరిగినలోట్లను మరల చేయురాదు.

పార్టిసభ్యత్వ విస్తరణోద్యమాలుగానీ, పార్టిసంఘాలను పటిష్ఠంజేయు కార్యకలాపాలుగానీ, పార్టియొక్క యితర

కార్యకలాపాలు లేక సమిష్టిపోరాటాలనుండి వేరై నడువ జాలవు. ఈ కార్యకలాపాలులోని, పోరాటాలలోని చురుకైన శక్తులనుండియే నూతన పార్టీసభ్యులను ఎన్నికచేయటం జరుగు తుంది. ఈ కార్యకలాపాలూ పోరాటాలద్వారానే పార్టీ శాఖలు, సబ్ డిస్ట్రిక్టు శాఖలు, కౌంటీపార్టీ సంఘాలు పటిష్ఠ మవుతాయి. ఉదాహరణకు గ్రామీణపార్టీసంఘాన్ని తీసు కుందాం. కౌలువడ్డీ రేట్లను పూర్తిగా తగ్గింపులను సాధించు టకు వుత్పత్తిని పెంపొందించుటకు ఆవిధంగా ప్రజల వర్గ చైతన్యాన్ని పెంపొందించుచూ, ప్రజల జీవితపరిమాణాన్ని పెంపొందించుచూ ప్రజానీకాన్ని నడిపినప్పుడే. శత్రువునకు వ్యతిరేకంగా జరుపబడేపోరాటంలో శత్రువునుండి ప్రజలను రక్షించుటకై చక్కని సైన్యాన్ని సంఘటితపరచినప్పుడే, ప్రజామోదిత ఎన్నికల వుద్యమాలద్వారా రాజకీయాధికా రాన్ని తమ గుప్పెటలో నుంచుకొను ఆవశ్యకతను ప్రజలకు బోధపరచినప్పుడే సహకార కార్యకలాపాలనూ, సాంస్కృతిక కార్యకలాపాలనూ, ఆరోగ్య కార్యకలాపాలనూ ప్రతిభావంత ముగా సాగించినప్పుడే పార్టీసంఘం పటిష్ఠంకాగలదు. ఈ కార్యకలాపాలద్వారా ప్రజలతో సంబంధాలను యేర్పరచు కొన్నాయి కాబట్టి, ప్రజల చైతన్యాన్ని అభివృద్ధిజెందించినాయి కాబట్టి ప్రజలకు అనుభవాన్ని చేకూర్చుకొనుటలో సహాయ పడ్డాయి కాబట్టి అలాంటి పార్టీసంఘాలు పటిష్ఠము జేయబడు తాయ్. పార్టీ ఆంతరంగిక సమైక్యతకూడా పటిష్ఠమవుతుంది, పార్టీ పాలసీని బాగా అర్థంజేసుకొంటుంది; మరింత అధికంగా యదార్థానుభూతిని పొందుతుంది.

నూతన పార్టీసభ్యుల సభ్యత్వార్హతకాలాన్ని ఆరవ నేషనల్ పార్టీ కాంగ్రెసుచే ఆమోదించబడిన నిబంధనావళి నిర్ణయించలేదు; కాని యీ కాలాన్ని స్థానికసంఘాలు నిర్ణయిస్తూ వుండేవి. ఈ కాలం ఆయా ప్రదేశాలనుబట్టి రెండుమాసాల నుండి ఒక సంవత్సరంవరకూ వుంటూవుండేది. గ్రామాలలో పార్టీసభ్యులను తీసుకొనేటప్పుడు రెండుమూడుమాసాల సభ్యత్వార్హతకాలం చాలా అల్పమని అనుభవంమీద తేలింది; అదేవిధంగా పబ్లికు ఆఫీసులలోనూ, బడులలోనూ, సాయుధ సైన్యంలోనూ పనిచేసేవారి విషయంలోకూడా యీ కాలం చాలా అల్పమని అనుభవంమీద తేలినది. ముందుముందు సభ్యులుగా జేర్చుకొనబడేవారికి అవసరమైన శిక్షణ గరపటము చాలా అరుదుగా జరిగేది.

నూతననిబంధనావళి, సభ్యత్వఅర్హతకాలాన్ని – అర్ధ సంవత్సరం, సంవత్సరం, రెండుసంవత్సరాలుగా – మూడు రకాలుగా యేర్పరచింది. ఒక నూతనపార్టీ మెంబరువిషయంలో పార్టీకమిటీ సభ్యత్వ – అర్హతకాలాన్ని పొడిగించవచ్చును– తగ్గించవచ్చును. నిబంధనావళిలో వివరించబడిన ప్రకారం, యీకాలం ఎందుకు నిర్ణయింపబడినదంటే, పార్టీసభ్యుడు కానున్న అతనికి పార్టీయొక్క ప్రాథమికవిద్యను గరపుటకు అతని రాజకీయలక్షణాలను పరిశీలించుటకు పార్టీసంఘానికి అవకాశమేర్పడుటకు నిర్ణయింపబడింది. దాని కర్థమేమంటే నూతన సభ్యునకు పార్టీయొక్క ప్రాథమికవిద్యను గరపుట, అతని రాజకీయలక్షణాలను పరిశీలించుట యనేవి పార్టీనిర్మాణ కార్యక్రమంలో ఒకభాగం. అలాచేయకపోతే సభ్యత్వానికి

అర్థమేవుండదు. నిర్మాణ దృక్పథాలు, కార్మికదృక్పథం, ప్రజాదృక్పథం విషయాలలో సత్యాన్వేషణలాంటి భౌతిక వాద దృక్పథాలులాంటివాటిని ప్రధాన కమ్యూనిస్టు దృక్పథాన్ని నూతనపార్టీసభ్యుడు అర్థంచేసుకోవటానికి సహాయ పడుటకు అతనిపార్టీనియమావళి, కార్యక్రమం, పాలసీలను అర్థంజేసుకోటానికి సహాయపడుటకు అతనికి శిక్షగరపటం యనేది అత్యంతప్రధానమైన విషయం.

పార్టీ మెంబరుకు పార్టీని వదలిపెట్టిపోయే హక్కువుంది. అందువలన తాను పార్టీనుండి వెళ్ళిపోతున్నానని అతడు దరఖాస్తుచేసినప్పుడు, అతడు పార్టీడాంక్యుమెంట్లను, రికార్డులను అన్నింటినీ పార్టీకి యిచ్చివేయగానే అతనిపేరును పార్టీశాఖ తన రిజిష్టరునుండి ఎత్తివేయాలి. దీని కర్థమేమంటే, పార్టీనుండి వెళ్ళిపోవటం తేలికయనీ, పార్టీలోనికి చేర్చుకోబడటం యనేది షరతులతో కూడుకొన్నదనీ, స్వేచ్ఛాయుతమైనది గాదనీ తేలుతూవుంది.

పార్టీ మెంబర్లను పార్టీనుండి బహిష్కరించవచ్చునని నియమావళి చెపుతూవుంది. ఏ పార్టీ సభ్యునినైనా, ఏ స్థాయికి జెందిన పార్టీ సంఘమైనా వెళ్ళగొట్టాలంటే ఆ విషయాన్ని పార్టీ విస్తృత సమావేశంలో (ప్లీనరీ సెషన్‌లో) నిర్ణయించాలి; దానికన్న పై కమిటీ దీన్ని ఆమోదించాలి.

# మూడవ అధ్యాయం

## పార్టీసభ్యుల హక్కులు, విధులు

ఈ నూతన నియమావళిలో పార్టి మెంబర్ల హక్కులు, విధులనుగురించి నిర్వచించబడింది. అలాంటి నియమాలు, పార్టి ఆంతరంగిక జీవితం ప్రశాంతంగా అభివృద్ధి జెందుటకు గ్యారంటీనిస్తాయి. పార్టి ఆశయానికై పార్టిసభ్యులు చురుకుగా పాటుపడటానికి పార్టిపట్లవారు బాధ్యతాయుతంగా ప్రవర్తించుటకు, దోహద మిస్తాయ్. పార్టియొక్క కార్యాచరణ సమైక్యతను హామీ యిస్తాయ్.

మొదటి దేమంటే ప్రతిపార్టి సభ్యుడు, తన చైతన్య స్థాయిని అభివృద్ధి పరచుకోవటానికి యత్నించటం మార్క్సిజం లెనినిజంయొక్క ప్రాథమిక సూత్రాలను మాసీటుంగ్ సిద్ధాంతాన్ని అర్థం జేసుకోవటానికి యత్నించటం, తన విధులలోనే ఒకటిగా భావించాలని పార్టి నియమావళి చెప్తూవుంది దీనికి కారణ మేమంటే ప్రజల ఆశయానికి పార్టిసభ్యుడు సరిగా తోడ్పడ గలుగుటకు అతనికి సమర్థతవున్నదా లేదా యన్న ప్రధాన విషయం యిందులోవుంది. వుత్తమస్థాయికి జెందిన చైతన్యం అతనిలో లేనిదే అతడు అలాంటి ప్రాథమిక సూత్రాలను అవగతం జేసుకోనిదే చైతన్యవంతంగాను, సవ్యంగాను పార్టి సభ్యుడు తన కార్యక్రమాన్ని నిర్వహించజాలడు. మంచిపార్టి సభ్యుడుగా తయారుగా లేడు.

మార్క్సిజం – లెనినిజం మాసీటుంగ్ సిద్ధాంతాలచే

గొనిరాబడిన పార్టి మెంబర్ల సైద్ధాంతిక సమైక్యతపై పార్టి యొక్క నిర్మాణసమైక్యత ఆధారపడియుంటుంది. ఇది లేనిదే నిర్మాణంవిషయంలోనూ, కార్యాచరణ విషయంలోనూ పార్టి యొక్క ఐక్యతకు పునాదియేవుండదు. స్వేచ్ఛాపూరితంగా క్రమశిక్షణ స్థాపింపబడజాలదు. అనేకతగాదాలు యేర్పడు తాయ్. ప్రజల ఆశయానికి పార్టియొక్క పోరాటం పరాజిత మవుతుంది. పార్టిలో, పార్టిసభ్యుల చైతన్యంపై మనం నొక్కి వక్కాణిస్తాం. పార్టిసభ్యులచైతన్యం, చొరవలపై ప్రధానంగా ఆధారపడుటవల్లనే పార్టిపనియంతా జరుగుతుంది. పార్టి సభ్యుల చైతన్యాన్ని అన్నివిధాల పార్టి అభివృద్ధిపరచుతూ వుంటే తన అభిప్రాయాలను స్పష్టీకరించుకొనుటకుగాను ప్రతి పార్టిసభ్యుడూ తనంతట తాను నేర్చుకొనుటకు అవిరామంగా తన చైతన్యాన్ని పెంపొందించుకొనుటకు పాటుపడాలి. అందు వలన యిది పార్టిసభ్యుల విధులలో ప్రధానస్థానాన్ని అలంక రిస్తుంది.

పార్టీ నియమావళిలో అలాంటి నిబంధనకు అర్ధమేమంటే ప్రతిపార్టీసభ్యుడు అధ్యయనంజేసిది ప్రజాఆశయ నిర్వాహణకు తప్ప మరెందుకూగాదని దానికి అర్థం. మరియొకవిధంగా చెప్పాలంటే ప్రతిపార్టీసభ్యుడూ మార్క్సిజ - లెనినిజాన్ని మావోసేటూంగ్ సిద్ధాంతాన్ని నేర్చుకోవటం, తన చైతన్యాన్ని పెంపొందించుకోవటం తన అభిప్రాయాలను సరిజేసుకోవటం యనేది అతడు పార్టీపట్ల తన విధిని నిర్వహించటంయనీ తాను విసర్జించుటకు వీలుగానట్టి ప్రజలపట్ల తన విధిని నిర్వహించటం యని దానికర్థం. ఒక పార్టీ మెంబరులో అధ్యయనంపట్ల చూప

వలసిన ఆత్మీయత, సవ్యమైనవైఖరి లోపిస్తే, తన్ను అభివృద్ధి పరచుకోటానికి యత్నించకుండా అహంకారపూరితుడుగా తయారవుతే ప్రజల ఆశయంపట్ల బాధ్యతారహితమైన వైఖరిని అవలంబించినట్లవుతుంది.

అటుతర్వాత విషయమేమంటే ప్రతి పార్టీ సభ్యుడూ, పార్టీ క్రమశిక్షణను తప్పకుండా అమలుజరుపాలి. పార్టీ యొక్క రాజకీయజీవితంలో చురుకుగా పాల్గొనాలి, చైనా లోని విప్లవోద్యమంలో చురుకుగా పాల్గొనాలి. పార్టీపాలసీని, పార్టీసంఘాల నిర్ణయాలను అమలుజరుపాలి. పార్టీ ప్రయోజనాలకు హానికరమైనవాటి కన్నింటికీ వ్యతిరేకంగా - పార్టీ లోపలను, పార్టీకి వెలుపలనువున్న హానికరశక్తులు, అభిప్రాయాలు, సిద్ధాంతాలన్నింటికి వ్యతిరేకంగా పోరాడాలి. పార్టీ సభ్యుల యీ విధులను చాలాకాలంక్రిందటనే అందరూ గుర్తించారు.

పార్టీనిర్మాణ జీవితంలో పాల్గొనాల్సిన ఆవశ్యకతపై కేవలం నొక్కి వక్కాణించుటకు బదులుగా ప్రతి పార్టీ సభ్యుడూ పార్టీ ఆంతరంగిక రాజకీయజీవితంలో పాల్గొనవలసిన ఆవశ్యకతపై మనమిక్కడ నొక్కి వక్కాణిస్తున్నాం. ఎందువల్లనంటే, పార్టీకి సంబంధించిన విషయాలన్నింటిలోనూ పార్టీసభ్యుడు రాజకీయదృక్పథాన్ని కలిగియుండాలి; అతడు పార్టీకి రాజకీయ బాధ్యతను వహించాలి. పార్టీఎన్నికలు మీటింగులు, నిర్ణయాలను తీసుకొనుటలో చురుకైన పాత్రను వహించుటద్వారా ప్రతిపార్టీ సభ్యుడు తన బాధ్యతాయుత వైఖరిని ప్రదర్శించాలి.

ఎట్టి పరిస్థితులలోను, ఏ పార్టీ సభ్యుడు పార్టీకి ప్రమాదాన్ని తెచ్చిపెట్టుటగానీ, పార్టి ప్రయోజనాలకు హానిచేయుటంగానీ, చేయరాదు. పార్టిలోపల, వెలుపల, పార్టి ప్రయోజనాలకు హానికరంగా నున్నవాటి కన్నింటికీ వ్యతిరేకంగా ప్రతి పార్టి సభ్యుడూ తప్పక పోరాడాలి.

ప్రజలకు సేవజేయటం, సకాలంలో ప్రజల అవసరాలేమిటో తెల్సుకోవటం వాటిని రిపోర్టుచేయటం ప్రజలతో పార్టియొక్క సంబంధాలు పటిష్ఠమవుటకుగాను పార్టి పాలసీని గురించి ప్రజలకు వివరించటం యనేది ప్రతిపార్టి సభ్యుని విధియని పార్టినియమావళి నిర్దేశిస్తూవుంది.

పార్టి మెంబర్లు పార్టి క్రమశిక్షణను మాత్రమే అమలు జరుపుటగాక, విప్లవాత్మక ప్రభుత్వంయొక్క నియమాలు, న్యాయాలన్నింటినీ అనుసరించుటలోనూ, విప్లవాత్మక సైన్యం విప్లవాత్మక ప్రజాసంఘాల విప్లవాత్మక సంస్థలయొక్క క్రమశిక్షణతోసహా అన్ని విప్లవాత్మక సంఘాల క్రమశిక్షణను అమలు జరుపుటలో ఆదర్శప్రాయులుగా నుండాలని నియమావళి చేపుతూవుంది. ఈ విప్లవ కార్యక్రమ రంగంలో ప్రతి పార్టి మెంబరూ ఆదర్శవంతంగా తయారుగావాలి. పార్టీక్రమశిక్షణను విప్లవాత్మక ప్రభుత్వం విప్లవాత్మకసంఘాల క్రమశిక్షణను అమలుజరుపుటలో జతపర్చాలి. అంతేగాని ఒకదానికి మరియొకదానికీ వ్యతిరేకంగా వుంచరాదు. ప్రజల విప్లవాత్మక క్రమశిక్షణను అమలుజరుపుటలోనూ విప్లవాత్మక ప్రభుత్వం, సంఘాలక్రమశిక్షణను అమలు జరుపుటలోనూ ప్రతిపార్టీసభ్యుడూ ఒక నమూనాగా తయారుగావాలని, పార్టీ

డిమాండుచేస్తూవుంది. ఏ పార్టీసభ్యుడైనా పైదానిని అనుస రించకపోతే అతడు పార్టీక్రమశిక్షణను అమలు జరిపినట్లుగాదు. రెండింటినీ వైరుధ్యవిషయాలుగా జూచేకార్మికులు తమ పొరపాట్లను సవరించుకొనుటకు తగు యత్నాలుచేయాలి.

చాలా కాలంనుండి మన పార్టీ ఒక పెద్దపార్టీగా వుంది. అందులో ప్రత్యేకంగా యీనాడు పెద్దపార్టీగా వుంది. అంతేగాక విముక్తప్రాంతాలలో అధికారంలోవున్న పార్టీ మనది. వృత్తిరీత్యా విప్లవవాదులైనవారు కొందరుతప్ప పార్టీ మెంబర్లలో అధికసంఖ్యాకులకు వుద్యోగాలుండాలి. దానిలో వారు ఆరితేరాలి. యే వృత్తిలోనూ లేక యే వ్యాపారంలోనూ ఆరితేరకపోతే, విప్లవాత్మక వుత్సాహం వున్నంత మాత్రాన మనం ప్రజలను నడుపలేము. పటిష్టమైన సంపత్తికరమైన దేశంగా మనదేశాన్ని నిర్మించలేం.

పార్టీసభ్యులకు పార్టీనియమావళి యీ క్రింది హక్కులను యిస్తూవుంది.

1. పార్టీమీటింగులలో జరిగే స్వేచ్ఛాపూరితమైన ఆచరణాత్మకమైన చర్చలలో పాల్గొనటం. పార్టీపాలసీని కొనసాగించుటకు సంబంధించిన సమస్యలయొక్క పార్టీ ప్రచురణలలో పాల్గొనటం.

2. పార్టీలోపల జరిగే ఎన్నికలలో తాను నిలబడవచ్చును. యితరులను ఎన్నుకోవచ్చును.

3. తన ప్రతిపాదనలను, స్టేట్ మెంట్లనూ కేంద్రకమిటీతో సహా అన్నిపార్టీకమిటీలకు పంపవచ్చును.

4. పార్టీమీటింగులలో యేపార్టీ కార్యకర్తనైనా విమర్శించవచ్చును.

సభ్యుల హక్కులకు సంబంధించిన యీ నియమాలు పార్టీసభ్యుల కార్యకలాపాన్ని పార్టీపట్ల వారి బాధ్యతను చురుకుపరుస్తాయనుటలో సందేహంలేదు. అంతేగాక పార్టీ ప్రయోజనాలకు వ్యతిరేకమైన ప్రతిదానికీ వ్యతిరేకంగా వారు పోరాడునట్లు చేస్తాయనుటలో సందేహంలేదు. అహంకార పూరితమైన నిరంకుశతత్వాన్ని, అధికారికత్వాన్ని తీవ్రంగా ప్రతిభావంతంగా ఎదిరించుటకు పార్టినాయకత్వం అనుయాయులమధ్య సంబంధాన్ని పెంపొందించుటకు తత్ఫలితంగా నిర్ణీతపంథా ననుసరించి పార్టీపనిని అభివృద్ధిపరచుటకు పై నియమాలు పార్టికి దోహదమిస్తాయనుట నిస్సందేహం.

పార్టీసభ్యుల యీ హక్కుల నన్నింటిని గౌరవించాలి. కాని తరచుగా ఆచరణలో దీనికి భిన్నంగా జరుగుతూవుం టుంది. తమకు వ్యతిరేకమైన అభిప్రాయాలను మీటింగులలో వెలిబుచ్చకుండా వుండేలాగున కొన్ని పద్ధతులను కొంతమంది కామ్రేడ్సు కనిపెట్టేరు. ఎన్నికలపై వివిధ నిరోధాలను రుద్దేరు. పార్టిమెంబర్లు వున్నత పార్టీసంఘాలకు తమ ప్రతి పాదనలను, ప్రకటనలను యివ్వరాదని నిషేధించేరు. పార్టీ మెంబర్ల అప్పీళ్ళను పై పార్టి కమిటీలకు పంపకుండా తొక్కి పెట్టేరు. ఆలస్యంజేసేరు. పార్టి మీటింగులలో పార్టిమెంబర్లు బాధ్యతగల నాయకులను విమర్శించరాదని నిషేధించారు. ఆత్మవిమర్శ, విమర్శలను అమలుజరుపుటచే పార్టి మెంబర్లలో కొందరు అధికారికశక్తుల, నిరంకుశశక్తుల నిరంకుశత్వానికి

గురిఅయ్యేరు. హానికరమైన యిలాంటి ఆచరణలను పూర్తిగా తుడిచివేయాలి.

మెజారిటీ నిర్ణయానికి మైనారిటీ కట్టుబడియుండాలి. అయితే మైనారిటీయొక్క సవ్యమైన హక్కులనుగూడా గౌరవించాలి. మెజారిటీ నిర్ణయాలకు కట్టుబడియుండగలనని మైనారిటీ వప్పందంజేసినప్పుడు మెజారిటీకి వ్యతిరేకంగా తన దృక్పథాలను వెలిబుచ్చుటకు తన వ్యతిరేకతను సూచిస్తూ పార్టి మీటింగులలో వోటుచేయుటకు హక్కువుంది. మెజారిటీచేతులలో మైనారిటీ బాధపడకుండావుండేలాగుననూ, అసభ్యంగా మైనారిటీపట్ల మెజారిటీ ప్రవర్తించకుండా వుండేలాగుననూ పార్టిసంఘాలు చూడాలి. మెజారిటీ నిర్ణయాలకు మైనారిటీ కట్టుబడియుంటే, మైనారిటీకి తన అభిప్రాయాలకు అంటిపెట్టుకొనివుండే హక్కువుంది.

మైనారిటీకిగల అలాంటి ప్రాథమిక హక్కులను, పార్టి అంతరంగిక ప్రజాస్వామ్యం కాపాడవలసివుంది. అది అనివార్యమైన విషయంకూడాను. ఎందువల్లనంటే కొన్ని పరిస్థితులలో సత్యమన్నది మెజారిటీపక్షాన వుండకపోవచ్చును. మైనారిటీపక్షాన వుండవచ్చును. సాధారణ పరిస్థితులలో మెజారిటీయొక్క పంథా సవ్యమైనప్పుడు, మైనారిటీని అపసవ్యమైనప్పుడు, యిలాంటిహక్కును మైనారిటీ తన అపసవ్యభావాలను, సరియైన విధంగా సరిదిద్దుకోటానికి అవకాశమిచ్చుట యిస్తాం.

పార్టి మీటింగులలో పార్టి కార్యకర్తలనూ అంతేగాక బాధ్యతగల యే సభ్యునినైనాసరే విమర్శించుటకు ప్రతి పార్టి సభ్యుడూ, అవిచ్ఛేదమైన హక్కునుగలిగి యున్నాడని

పార్టీ నియమావళి జెపుతూవుంది. కొన్ని ప్రదేశాలలో యీనాడు అమలులోనున్న బాధ్యతగల స్థానాలలోనున్న. పార్టీసభ్యులను పార్టీ మీటింగులలో విమర్శించరాదన్న దానికి వ్యతిరేకంగా పై నిబంధన రూపొందించ బడింది. పార్టీ మీటింగులలో పార్టీలో బాధ్యతగల స్థానాలలోనున్న సభ్యులను విమర్శించరాదన్నది చాలా చెడ్డఅలవాటు. ఎందువల్లనంటే యిలాంటి అలవాటు నిరంకుశత్వాన్ని అధికారికతత్వాన్ని ప్రోత్సహిస్తుంది. పార్టిసభ్యుల చొరవను బాధ్యతను, ఆటంకపరుస్తుంది. అందువలన యీ అలవాటును రద్దు చేయాలి. ఈ కాంగ్రెసు యీ నియమాన్ని ఆమోదించగా పై అలవాటు సహించబడదు. పార్టి కార్యకర్తను, యేపార్టిసభ్యుడైనా విమర్శించుటను ఆటంకపరచుటయునేది అశాస్త్రీయంగా పరిగణింపబడుతుంది. పార్టినియమావళిని వుల్లఘించినట్లుగా భావింపబడుతుంది.

"వ్యక్తి తన మనస్సులోనున్నదానినంతనూ యెవరికి చెరుపుచేయకుండా స్వేచ్ఛగా బయటపెట్టినప్పుడే పార్టిమెంబర్లు యేది దాచిపెట్టకుండా అన్నింటినీ బయటపెట్టి నిర్మలంగా వుండగలుగుతారు" అన్నవిషయాన్ని మనం అర్ధజేసుకోవాలి. ఈవిధంగా మాత్రమే మనం పార్టి-ఆంతరంగిక-దృఢత్వాన్ని క్రమశిక్షణను నిర్మించగలం, పటిష్ఠంచేయగలం.

సాధ్యమైన, అవసరమైన ఎన్నికలన్నిటిలోనూ పాల్గొనుటకున్నూ, పార్టీనాయకత్వసంఘాలకు ఎన్నుకొనబడుటకున్నూ పార్టీ మెంబర్లకు అధికారంగలదని పార్టీ

నియమావళి చెపుతూవుంది. పార్టి నియమావళిలో సూచించ బడినవి తప్ప మరేరకమైన ఆటంకాలను జేర్చరాదు.

అన్నిస్థాయిలకు జెందిన పార్టి కమిటీలు, పార్టి నాయకత్వ సంఘాలకు పార్టిసభ్యులు తమద్వారా పంపిన ప్రకటనలను, ప్రతిపాదనలను, అప్పీళ్ళను అన్నింటినీ ఆలస్యంచేయకుండా పంపివేయాలి.

పార్టి సభ్యులయొక్క అలాంటి ప్రజాస్వామికహక్కులను కాపాడుటద్వారానే నిర్మాణానికి వ్యతిరేకమైన, అరాజకమైన అశాస్త్రీయమైన విమర్శనలను, చర్యలను గుసగుసలను తగ్గించగలం. పార్టి మెంబర్ల విమర్శనలను, చర్యలను బాధ్యతాయుతమైన సవ్యమైన మార్గాన పార్టీ ఆశయానికి ప్రయోజనకారిమైన మార్గాన నడిపించగలం.

పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని వినియోగించుకొని తమ విచ్ఛిన్నకార్యక్రమాన్ని సాగించుటకు పార్టీవ్యతిరేకశక్తులకు పార్టీలో దాగొనియున్న గూఢచారులకు, విచ్ఛిన్నకారులకు అవకాశంగలదనుట యదార్థం. కాని పార్టీ అనుయాయులు యిలాంటి కార్యకలాపాలను సహించరు. పార్టినాయకత్వ సంఘాలకు పైనుదహరింపబడిన దుష్టశక్తులను యేరిపారవేయుటకు పార్టి అనుయాయులు సహాయపడతారు.

మనపార్టిలోనున్న లోట్లన్నింటినీ సరిదిద్దుకోవాలి. పార్టిపట్ల పార్టిసభ్యుల బాధ్యతను చొరవను పెంపొందించుట ద్వారానే పార్టియొక్కశక్తిని ఉచ్ఛస్థాయిలో నిలబెట్టుటకు అభివృద్ధిపరచుటకు సాధ్యమవుతుంది. పార్టిపట్ల బాధ్యతను గలిగియుండుటకై చొరవను గలిగియుండుటకై పార్టిసభ్యులను

గల హక్కులకు పార్టీనియమావళి దోహదమిస్తూవుంది. పార్టీలోనున్న లోట్లను సవరించుటకు పార్టీలో మంచి ఆచరణ లన్నింటినీ పెంపొందించుటకు పార్టీ కార్యకలాపాలనుపురోగ మింపచేయుటకు పార్టీని దృఢమైన శక్తివంతమైన, ప్రశాంత మైన పునాదిపై యింతకు పూర్వమెన్నడూ ఎరుగని విధంగా నిర్మించుటకు పార్టీసభ్యులందరూ తమకు యివ్వబడిన హక్కులను పరిపూర్ణంగా వినియోగించుకొంటారని విశ్వసిస్తున్నాను. మన ఆశ అలాంటిది.

## నాల్గవ అధ్యాయం

# పార్టీలో కేంద్రీకృత ప్రజాస్వామ్యం

మన పార్టీయంటే కేవలం సభ్యుల సమాఖ్యగాదు. ఒక ఖచ్చితమైనసూత్రాన్ని అనుసరించి స్థాపించబడిన సమైక్య పూరిత సజీవసంఘం. అది నాయకుల, అనుయాయుల సమ్మేళనం. కేంద్రకమిటీ అన్నిస్థాయిలకు జెందిన పార్టీసంఘాలూ కలసి యేర్పడిన పరిపూర్ణరూపమది; పార్టీ - ఆంతరంగిక - కేంద్రీకృత ప్రజాస్వామికంయొక్క ఖచ్చితమైన సూత్రాన్ని అనుసరించి విశాలమైన సభ్యత్వాన్ని కలిగియున్న సంఘమది.

ఏదోఒక ఫ్యాక్టరీకి జెందినవారు, లేక ఒక గ్రామానికి జెందినవారు ముగ్గురు పార్టీ మెంబర్లు వున్నంతమాత్రాన ఒక పార్టీసంఘం తప్పనిసరిగా యేర్పడనవసరంలేదు. వారిని కేంద్రీ

కృత ప్రజాస్వామ్యసూత్రాన్ని అనుసరించి సంఘటితపరచాలి. సాధారణ పరిస్థితులలో యీ ముగ్గురిలో ఒకడు గ్రూపునాయకుడుగాను, మిగిలిన యిద్దరూ గ్రూపుమెంబర్లుగానూ వుండాలి. తత్ఫలితంగా అన్ని కార్యకలాపాలలోనూ ఒక నాయకుడు, అనుయాయులూ వుంటారు. అలా యేర్పాటు చేయబడినప్పుడే యీ గ్రూపు పార్టీసంఘంగా అవగలదు. ఈ రకపు నిర్మాణం నూతన బలాన్ని జనింపజేస్తుంది. శ్రామికవర్గంయొక్క బలం నిర్మాణంలోనేవుంది.

పార్టీ నియమావళిలో సూచించబడినట్లుగా కేంద్రీకృత ప్రజాస్వామ్యానికి అర్థమేమంటే ప్రజాతంత్రంపై ఆధారితమైన కేంద్రీకృత తత్వమున కేంద్రీకృత నాయకత్వంక్రింద ప్రజాస్వామ్యమనీ అర్థం. అది ప్రజాతంత్రమైనట్టిది, కేంద్రీకృతమైనట్టిది. నాయకత్వమూ అనుయాయుల మధ్యగల సంబంధాలను, పార్టీయొక్క వున్నత సంఘాలకు క్రింది సంఘాలకు మధ్యగల సంబంధాలను పార్టీయొక్క వ్యక్తిగత సభ్యులకు పార్టీ యావత్తుకూ మధ్యగల సంబంధాలనూ పార్టీయొక్క కేంద్రకమిటీకి అన్నిస్థాయిలకు జెందినపార్టీ సంఘాలకు మధ్యగల సంబంధాన్ని ఒకవైపునను, మరియొకవైపున పైవాటికినీ పార్టీ అనుయాయువర్గమునకు మధ్యగల సంబంధాన్ని ప్రతిబింబిస్తుంది.

పార్టీ కేంద్రీకృతతత్వాన్ని ప్రజాతంత్రింపై ఆధారితమైన కేంద్రీకృతతత్వంగా ఎందుకు చెప్పుతున్నాం? దానికర్థమేమంటే పార్టీయొక్క నాయకత్వ సంఘాలు ప్రజాతంత్రసూత్రంద్వారా సభ్యులచే ఎన్నుకోబడుతాయ్. అవి సభ్యుల

విశ్వాసాన్ని చూరగొంటాయ్. దాని కర్థమేమంటే ప్రజా తంత్రం ఆధారితమై పార్టియొక్క క్రిందిసభ్యులనుండి ఎన్ను కొనబడి ప్రతినిధులచేతనూ, పార్టీసభ్యులచేతనూ, పార్టీయొక్క సూచనలు, తీర్మానాలు రూపొందించ బడుతాయని, అటు తర్వాత పార్టీయొక్క నాయకత్వం పార్టీసభ్యుల సహాయంతో నిరంతరం అమలు జరుపుతుండనీ దీనికి అర్థం. పార్టీ నాయకత్వ సంఘానికి అధికారాన్ని పార్టీసభ్యులు యిస్తారు. అందువలన యీ పార్టీ నాయకత్వ సంఘం పార్టీ సభ్యుల తరపున పార్టీ వ్యవహారాలన్నింటిని నడుపుటకు తన క్రింది సంఘాలను తన అదుపాజ్ఞలలో వుంచుకొని పనిచేయించుటకు పార్టీ సభ్యత్వం పనిచేయించుటకు కేంద్రీకృత నాయకత్వాధికారాన్ని వినియో గించుటకు సామర్థ్యాన్ని కలిగియుంటుంది. వ్యక్తిని, సంఘానికి, మైనారిటీని, మెజారిటీకి క్రిందిసంఘాలను పైసంఘాలకూ పార్టినియోజకవర్గ సంఘాలన్నింటినీ కేంద్రకమిటీకిలోబరుచుట యనే సూత్రంద్వారా పార్టిలో క్రమశిక్షణ నిలబెట్టబడు తుంది. దీని కర్థమేమంటే ప్రజాతంత్రంనుండి విడివిడియుండు టకు బదులుగా పార్టియొక్క కేంద్రీకృతతత్వం, ప్రజాతంత్రపై ఆధారితమవుతుంది. ఇది వ్యక్తిగతనిరంకుశత్వంగాదు.

పార్టీయొక్క ప్రజాతంత్రమంటే కేంద్రీకృతనాయకత్వం క్రింద నడుపబడే ప్రజాతంత్రమని ఎందుకంటాం ? దాని కర్థ మేమంటే ప్రతిపార్టిమీటింగూ, ఒకనాయకత్వసంఘంచే జరుపబడాలి. నాయకత్వంక్రింద అది నడుస్తుంది. ఒక తీర్మానాన్నిగానీ, లేక ఒక నియమాన్నిగానీ రూపొందించు టకు ముందుగా దానిని పరిపూర్ణంగా ఆలోచించి చేయాలి.

ప్రతిఎన్నికకూ జాగ్రత్తగా తయారుచేయబడిన అభ్యర్థుల జాబితావుంటుంది. పార్టీయావత్తుకూ, సమైక్యపార్టీనియమావళి వుంది. సమైక్యక్రమశిక్షణవుంది. దీనిని పార్టీసభ్యులందరూ అమలుజరుపాలి. అందరు సభ్యులూ లోబడియుండవలసిన సమైక్యనాయకత్వసంఘంవుంది. దీని కర్థమేమంటే పార్టీ ఆంతరంగికప్రజాతంత్రమంటే నాయకత్వంలేని ప్రజాతంత్రం గాదనీ అమితప్రజాతంత్రంగాదనీ, పార్టీలోపల అరాజకవాదం గాదనీ అర్థం.

పార్టీలోపల కేంద్రీకృత ప్రజాస్వామ్యమనేది అసంఖ్యాకమైన పార్టీఅనుయాయులతో, పార్టీయొక్క నాయకత్వాన్ని సమైక్యమొనరించే ఒకవిధానం, క్లుప్తంగా చెప్పాలంటే పార్టీసభ్యులనుండి వడగట్టేవిధానం పార్టీసభ్యులలో దానిని నిరంతరం కొనసాగించే విధానం అది. పార్టీలోపల ప్రజాపంథాకు స్పష్టీకరణ అది.

పార్టీయొక్క కేంద్రీకృతతత్వం ప్రజాస్వామ్యంపై ఆధారపడియున్నదని కొంతమంది కామ్రేడ్సు అవగతం జేసుకొనుటలేదు. తన్మూలంగా వారుతమపార్టీనాయకత్వాన్ని పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యంనుండి పార్టీ అనుయాయులునుండి వేరుజేసి, దానికి "కేంద్రీకృతతత్వం" అని ముద్రవేస్తారు. తాము నాయకులుకాబట్టి తాము అధికారాన్ని పార్టీసభ్యుల నుండి పొందవలసిన అవసరంలేదనీ తమంతట తామే దానిని గుంజుకోవచ్చుననీ, భావిస్తారు. తమ వున్నత స్థానాలకు ఎన్నికలు జరుపవలసిన అవసరంలేదనీ పార్టీమెంబర్ల విశ్వాసాన్ని చూరకొన అవసరంలేదనీ క్రిందికమిటీల విశ్వాసాన్ని చూర

గాన అవసరంలేదనీ తమంతట తామే నాయకత్వస్థానాలను అలంకరించవచ్చుననీ భావిస్తారు. తమ సూచనలు, తీర్మానాలూ క్రిందిపార్టీ సభ్యులనుండి పైవరకూ బలపరచపడనక్కరలేదనీ వారిచే నిర్ణయించబడనక్కరలేదనీ నిరంకుశంగా తాము వాటిని జారీచేయవచ్చుననీ భావిస్తారు. పార్టీ మెంబర్లతో కలసిమెలసిపోవుటకు బదులుగా, పార్టీ మెంబర్లకు అతీతంగా వారు నిలబడుతారు. పార్టీ సంఘాలలో వుండుటకు బదులుగా, పార్టీ కంట్రోలుకు లోబడియుండుటకు బదులుగా, పార్టీ చెప్పినట్లు నడుచుకొనుటకు బదులుగా పార్టీ సంఘాలపై పెత్తనంజేస్తూ, పార్టీని ఆజ్ఞాపిస్తూవుంటారు. పార్టీని కంట్రోలుజేస్తూవుంటారు. పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రంపేరుతో పార్టీపై సంఘాలనుండి స్వతంత్రంగా వ్యవహరించకోరుతారు. కాని పార్టీ ఆంతరంగిక కేంద్రీకృత తత్వం పేరిట వారు పార్టీసంఘాల పార్టీసభ్యుల ప్రజాస్వామికహక్కులను అణచివేస్తారు. వారు యదార్థానికి తమ క్రిందివారిపట్ల ప్రజాస్వామికంగాగానీ, తమపై వారిపట్ల కేంద్రీకృత తత్వరీత్యాగానీ వ్యవహరించరు.

ఇతరులు పార్టీ క్రమశిక్షణకు మెజారిటీ నిర్ణయాలను అమలుజరుపాలనీ, కట్టుబడియుండాలనీ తాముమాత్రం నాయకులుగా మరియొకరకంగా వ్యవహరించుట అర్హతగలదనీ అనుకొంటూవుంటారు. వ్యక్తి సంఘానికి లోబడాలి. మైనారిటీ మెజారిటీ నిర్ణయాలకు లోబడియుండాలి. పార్టీ వున్నత కమిటీలకు లోబడియుండాలి. ఇలాంటిమూల నిర్మాణ సూత్రాలను వారు వ్యక్తిగతంగా అమలుజరుపరు. అంటే పార్టీనియమాలు

గానీ, పార్టీ తీర్మానాలుగానీ సాధారణ పార్టీ సభ్యులకోరకే వ్రాయబడ్డాయనీ నాయకులైన తమకోరకు అవి వ్రాయబడి వుండలేదనీ వారి అభిప్రాయం. ఈ ధోరణి పార్టీలో వ్యక్తి ప్రజాతంత్ర వ్యతిరేక ధోరణి; నిరంకుశత్వానికి అపరూప ధోరణి యన్నమాట. అంతేగాక యిది సమాజంలోని అభిజాత్యవర్గాల సిద్ధాంతానికి ప్రతిబింబం ఈ ధోరణికి మన పార్టీయొక్క కేంద్రీకృతతత్వానికెట్టి పోలికా లేదు. ఏమైనప్పటికీ, మనపార్టీలో యీనాడు అస్థిత్వంలోనున్న ఒక పెడ మార్గమది. అందువలన యీ పెడమార్గాన్ని పూర్తిగా తుడిచివేయాలి.

పార్టీలోపల ప్రజాతంత్రమంటే కేంద్రీకృత నాయకత్వంక్రిందనున్న ప్రజాతంత్రమని అర్థం జేసుకోని కామ్రేడ్సు కొంతమందివున్నారు. అందువలన వారు తమ కార్యకలాపాలను పార్టీయొక్క కేంద్రీకృత నాయకత్వంనుండి వేరు జేస్తారు. మొత్తం పార్టీనుండి వేరుజేస్తారు; వారు పరిస్థితి యావత్తునూ దృష్టిలో వుంచుకోరు. యావత్తు పార్టీయొక్క దీర్ఘకాలిక ప్రయోజనాలను దృష్టిలో వుంచుకోరు. పార్టీలో స్వేచ్ఛగా ప్రవర్తిస్తారు. హద్దూపద్దూ లేకుండా తమ ప్రయోజనాలనే, తమ దృక్పథాలనే దృష్టిలోపెట్టుకొని సంచరిస్తారు. పార్టీ క్రమశిక్షణను దీక్షాయుతంగా అమలు జరుపరు, పార్టీ నాయకత్వ సంఘాల నిర్ణయాలను అమలు జరుపరు. వారు అన్నిరకాల అసాంఘికమైన అనిర్మాణాత్మకమైన అరాజకమైన అశాస్త్రీయమైన వాగుళ్లు వాగుతారు. చర్యలు జేస్తారు. ఎలాంటి పరిస్థితిలోనున్నామో ఆలోచించకుండా అవసర

ముందా లేదా యని ఆలోచించకుండా పార్టీలో చీలికలను వ్యాపింపజేయుటకుగాను, పనిగట్టుకొని గోరంతలను కొండంతలుజేసి ప్రచారంజేస్తూవుంటారు. హద్దూపద్దూలేని సోమరిపోతుకబుర్లకు, చర్చలకు దిగుతారు. సైద్ధాంతికం పార్టీ మెంబర్లు తయారై వుండకపోవటంవలన యేర్పడిన అజ్ఞానాన్ని పూర్తంగా తీసుకొని, తమ ప్రతిపాదనలకు అనుకూలంగావోట్లువేయించుకొంటారు.ఆవిధంగా "మెజారిటీ" పేరుతో తమ దుష్టవ్యవహారాలను ఫలవంతం జేసుకొన చూస్తారు.

ఇది అమిత - ప్రజాస్వామ్యానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. దీనికీ మనపార్టీప్రజాస్వామ్యానికీ ఎట్టి పోలికా లేదు. ఇలాంటిభావంనుండి సంభవించే ప్రమాదాన్ని గురించి కామ్రేడ్ మాసీయూంగ్ యిలా వివరించేడు. "పార్టీనిర్మాణానికిది ప్రమాదాన్ని చేకూర్చుతుంది. పార్టీనిర్మాణాన్ని నాశనంజేస్తుంది కూడాను. పార్టీపోరాటశక్తిని బలహీనపరుస్తుంది. అంతేగాక నాశనంజేస్తుందికూడాను."

ఈ భావానికి మూలమెక్కడున్నదంటే, పెట్టి-బూర్జువా వర్గంయొక్క (చిన్నఎత్తువ్యవసాయక వుత్పత్తిదారులు, చిన్న ఎత్తు పట్టణ-పెట్టి బసీదారులయొక్క)విచ్చలవిడితనంలో వుంది. దీనిని పార్టీలోనికి గొనిరాగానే అమితప్రజాతంత్రభావ మవుతుంది. అంటే రాజకీయంగానూ, నిర్మాణాత్మకంగానూ అమిత ప్రజాతంత్రభావంగా తయారవుతుంది. మౌలికంగా యిది శ్రామికవర్గకర్తవ్యాలతో సరిపడనిసంగతి, అసంగతమైన విషయం. అందువలన యదార్థానికి ఒకరకమైన విప్లవ-ప్రతీ

ఘాతుక సిద్ధాంతం. దీనిని తీవ్రంగా అరికట్టుటకు బదులుగా, అభివృద్ధికానిస్తే దీనిని వరించినవారందరూ తప్పకుండా విప్లవ-ప్రతిఘాతుక - గూ్రిపులలో దిగబడతారు." (మాసీయాంగ్ కూ్రైన్ కాన్ఫరెన్సు తీర్మానం) ।

పార్టీలోపల ప్రజాస్వామిక - వ్యతిరేక - నిరంకుశ తత్వధోరణి, అమిత - ప్రజాతంత్ర - ధోరణి యనేవి పార్టీ - ఆంతరంగిక జీవితంలో రెండు విపరీతమైనకొనలు. అయితే యిందులో రెండవది అంటే అమిత - ప్రజాతంత్ర - ధోరణి యనేది మొదటిదానికి అంటే ప్రజాస్వామిక - వ్యతిరేక - నిరంకుశ తత్వధోరణికి ఒకరకమైన విరుగుడుగా, తరచుగా తల యెత్తుతుంది. ఆవిధంగా ఎక్కడ నిరంకుశతత్వం తీవ్రంగా తలయెత్తుతుందో అక్కడ అమిత - ప్రజాతంత్రం తలయెత్త వచ్చు. పార్టీయొక్క యదార్థఐక్యతకు, దృఢత్వానికి యీ రెండు తప్పుడుధోరణులూ హానికరాలు. ఇవి రెండూ పార్టీలో తలయెత్తకుండా వుండేలాగున పార్టీయావత్తూ ఎల్లప్పుడూ జాగృతి వహించాలి.

మనమిప్పుడు మనపార్టీలో ప్రజాతంత్ర జీవిత విధానాన్ని పరిపూర్ణంగా అభివృద్ధిజేయాలి. పార్టీ - ఆంతరంగిక - ప్రజాతంత్రాన్ని వుత్తమస్థాయికి గొనిపోవాలి. అదేకాలంలో వుత్తమస్థాయిలో అభివృద్ధిజేయబడిన ప్రజాతంత్రాన్ని ఆధారంగా తీసుకొని దాని పునాదిపై పార్టీనాయకత్వంలో వుత్తమస్థాయికి జెందిన కేంద్రీకృతతత్వాన్ని సిద్ధింపజేసుకోవాలి.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ, ఆరవ విస్తృత

సమావేశానికి తానిచ్చిన రిపోర్టులో కామ్రేడ్ మావోసీటూంగ్ యిలా చెప్పేడు.

"మనపార్టిలో తగినంతగా ప్రజాతంత్ర జీవితం లేక పోవటం యనేది మన దేశంలో ప్రజాతంత్ర జీవితం లేక పోవటానికి ప్రతిబింబం. ఈ కొరత యావత్తు పార్టి కార్య కలాపాల పరిపూర్ణాభివృద్ధిని ఖచ్చితంగా అరికట్టుతుంది. ఈ లోపల యిది ప్రజావుద్యమంలోనూ, సంయుక్త సంఘటన లోనూ తగినంతగా ప్రజాతంత్రం లేకపోవుటకు వూతమిస్తుంది" (మావోసీటూంగ్ - నూతనదశ)

ఆరవ విస్తృత సమావేశం జరిగిన నాటినుండి యీనాటివరకూ చూస్తే పరిస్థితిలో మార్పువచ్చింది. చైనా లోని విముక్త ప్రాంతాలలోని ప్రజా తంత్రోద్యమంలోనూ, పార్టి ఆంతరంగిక ప్రజాతంత్రంలోనూ, అందులో ప్రత్యేకంగా మూఢు విధానాల సవరింపు వుద్యమంద్వారాను, పార్టిపని సమీక్షద్వారాను, చక్కని పురోభివృద్ధి యేర్పడింది. ఏడవ జాతీయపార్టి కాంగ్రెసు సమావేశానికి పూర్వం కేడర్లు, పార్టి చరిత్రనూ, పార్టి పంథాను నిరాటంకంగాను, వివరంగాను పరీ క్షించుటచే పార్టి ఆంతరంగిక ప్రజాతంత్రం తగినంత అభివృద్ధి జెందుటకు కావలసిన వూతమిచ్చింది. కాంగ్రెసునకు కావల సిన యత్నాలను జేసింది. ఏమైనప్పటికినీ, మొత్తంగా పార్టిని జూచినా లేక స్థానికపార్టి సంఘాలను విడివిడిగా జూచినా పార్టిలోపల ప్రజాతంత్ర జీవితం యింకనూ అభివృద్ధి జెందా ల్సిన అవసరంవుందని తేలుతూ వుంది. అందువల్లనే పార్టి

ఆంతరంగిక జీవితాన్ని విశాలమొనర్చుటకే పార్టి నియమావళిలో అనేక నిబంధనలు చేర్చబడ్డాయ్.

మన పార్టి యింకనూ యుద్ధము జేస్తున్నప్పటికి యీ యుద్ధం దీర్ఘకాలికస్వభావాన్ని కలిగియుండటి నొక్కిచెప్పాలి. మన సాంకేతిక పరిస్థితులలోనూ, శత్రువుయొక్క పరిస్థితుల లోనూ మార్పులొచ్చేవరకూ యీ యుద్ధం మౌలికంగా గెరిల్లాయుద్ధంగానే వుండిపోతుంది. అందువలన గెరిల్లా యుద్ధ పరిస్థితులు వీలుకల్పించునంతవరకు మీటింగులు, ఎన్నికలూ జరుపాలి. యుద్ధపరిస్థితి సాకుతో పార్టి ఆంతరంగిక ప్రజాతంత్రాన్ని అమలుజరుపకుండాయుండుటకు యత్నించరాదు.

విముక్త ప్రాంతాలలో పెద్ద మీటింగులు, ఎన్నికలు జరుపుటకు వీలున్నప్పుడు అన్ని స్థాయీలకు జెందిన పార్టి కాంగ్రెసులనూ, సభ్యుల సమావేశాలనూ పార్టి నియమావళి నిబంధనల ననుసరించి, అన్నిస్థాయీలకు జెందిన పార్టి నాయకత్వ సంఘాలను ఎన్నుకొనుటకుగాను యేర్పాటుచెయ్యాలి. పార్టి నాయకత్వసంఘాన్ని ఎన్నుకొనుటలో సభ్యుల జాబితాను సూచించే హక్కువున్నది. ఒక్కకాంగ్రెసు ప్రెసిడీయం నకేగాదనీ, ప్రతి ప్రతినిధికీ సభ్యులను నామినేటుచేసే హక్కు వున్నదనీ, అలా పై నుదహరింపబడినవారిచే సూచించబడిన కాండిడేట్లను విమర్శించేహక్కు, వారినిగాక మరొకరిని ఎన్నుకొనేహక్కు ప్రతి డెలిగేటుకూ వుందనీ పార్టీ నియమావళి సూచించింది. కాండిడేట్ల లిస్టును పూర్తిగా చర్చించాలి. లిస్టుప్రకారం వోటింగును రహస్యంగాగానీ, బహిరంగంగా గానీ జరిపించాలి. స్థానిక పార్టీసంఘాల కాంగ్రెసులను రెండే

కొకమారు జరిపించాలని పార్టీ నియమావళిలో సూచించబడింది. దీని కర్థమేమంటే స్థానిక పార్టీసంఘాల నాయకత్వ సంఘాలకు క్రొత్త ఎన్నికలను రెండేళ్ళ కొకసారి జరుపాలన్న మాట. ఒక కాంగ్రెసుకు మరియొక కాంగ్రెసుకూ మధ్య కాలంలో సత్వరకర్తవ్యాలపై నిర్ణయాలుతీసుకోటానికి కాన్ఫరెన్సులను జరుపుకోవటం అవసరం, సాధ్యం. పార్టీ కాంగ్రెసులనుగానీ, కాన్ఫరెన్సులనుగానీ జరుపుకోకుండా పార్టీపనిని సమీక్షించుకోటానికి కేడర్ల మీటింగులనేకం యిదివరలో జరిపేం. కాని అలాంటి కాంగ్రెసులను, కాన్ఫరెన్సులనూ భవిష్యత్తులో జరిపిచాలి. వెంటవెంటనే ఎన్నికలు జరపటం అవసరంకాబట్టి మనపనిని ఆటంకపరుస్తాయి. కాబట్టి ఎన్నికలను రెండేళ్ళకొకసారి జరుపాలి. అందువలన పార్టీ కాంగ్రెసులనే గాకుండా పార్టీకాన్ఫరెన్సులను కూడ మనపనిని సమీక్షించుకోటానికి, ప్లానుజేసుకోటానికి జరిపించటం అవసరం. స్థానిక అవసరాలనుబట్టి అలాంటి కాన్ఫరెన్సులను యేడాదికి ఒకటి రెండుసార్లు యేర్పాటుచేసుకోవచ్చును. అలాంటి కాన్ఫరెన్సులకు ప్రతినిధులను క్రిందిపార్టీకమిటీలు ఎన్నుకోవాలి. పార్టీకమిటీయొక్క సభ్యులను కొంతమందిని తీసివేసి, వారి స్థానాలలో క్రొత్తసభ్యులను ఎన్నుకోటానికి అధికారంవుంది. అయితే అలాజరుప నిర్ణయాలను పార్టీకమిటీసభ్యులను తీసివేయటాన్ని లేక క్రొత్తవారిని ఎన్నుకోటాన్ని దానికి సంబంధించిన పార్టీకమిటీచే ఆమోదించబడాలి. గతంలో జరుపబడిన కేడర్లమీటింగులకన్న యిలా జరుపబడే కాన్ఫరెన్సులకు అధికారం ఎక్కువగా వున్నప్పటికీ పార్టీకమిటీ అధికారంతోపోల్చి

జాస్తీ యీ కాన్ఫరెన్సు తక్కువ అధికారంమాత్రమే గల్గి వుంటుంది. అంటే యీ కాన్ఫరెన్సు పార్టికమిటీకన్న తక్కువ స్థాయికి జెందిన సంఘమన్నమాట.

క్రమానుగతంగా రాష్ట్రం లేక సరిహద్దుప్రాంతీయ ప్రాంతం కౌంటీ లేక సబ్ డిస్ట్రిక్టుల, పార్టికాంగ్రెసులను, కాన్ఫరెన్సులను జరుపవచ్చును. ఉదాహరణకు యీ సంవత్సరం రాష్ట్రం, సరిహద్దుప్రాంతం మరియు కౌంటీలు పార్టి కాంగ్రెసులనూ ప్రాంతం (రీజియన్) సబ్ డిస్ట్రిక్టుల పార్టి కాన్ఫరెన్సులనూ జరుపుకోవచ్చును. వచ్చే సంవత్సరం ప్రాంతము, సబ్ డిస్ట్రిక్టులు, పార్టికాంగ్రెసులనూ రాష్ట్రం, సరిహద్దుప్రాంతం, కౌంటీలు పార్టికాన్ఫరెన్సులను జరుపుకోవచ్చును.

వివిధరంగాలలో పనిచేయుచున్నవారికిని, ప్రజలతో అత్యంతసన్నిహితసంబంధాలు కలిగియున్న కేడర్లనూ కలుపుకొని వచ్చుటకుగాను అన్నిస్థాయిలకు జెందిన పార్టికమిటీలను విశాలంగాచేయాలి, పార్టినియమావళిననుసరించి దైనందిన కార్యక్రమాన్ని నడిపించుటకు ప్రతిపార్టికమిటీలోనూ ఒక స్థాయిసంఘాన్ని యేర్పరచాలి. తన ప్రాంతంలోని వివిధ రంగాలలోని కార్యక్రమాన్ని నడిపించుటకుగాను కేంద్రంగా వుండుటకు యీ స్థాయీసంఘంలో వివిధరంగాలకు సంబంధించిన కేడర్లను జేర్చుకోవాలి. నిరాటంకంగా పనిసాగిపోవుటకుగాను పార్టినాయకత్వకమిటీ, అవసరమనుకుంటే సెక్రటరీకి సహాయంజేయుటకుగాను ఒకళ్ళిద్దరు సహాయకార్యదర్శులను నియమించుకోవచ్చును. అన్నిస్థాయిలకు జెందిన పార్టీ

కమిటీలు, పార్టీ ఆంతరంగిక నిర్మాణకార్యక్రమానికే తమ్ము తాము పరిమితించివేసుకొనక తమ ప్రాంతాలలోని కార్య కలాపాలన్నింటికీ దిక్సూచికత్వమిచ్చే సంఘాలుగా తయారు గావాలి. పార్టీ ఆంతరంగిక నిర్మాణ కార్యక్రమం యనేది పార్టీ కమిటీయొక్క కార్యక్రమంలో ఒకభాగంమాత్రమే; యీ కార్యక్రమాన్ని కమిటీయొక్క నిర్మాణశాఖకు వప్పగించాలి. అందువలన ప్రతిపార్టీ కమిటీకి సంబంధించిన నిర్ణయాలు కార్యక్రమంయొక్క ప్లానులను అంటే ఆ నిర్ణయాలు, కార్యక్రమంయొక్క ప్లానులు సాధారణస్వభావాన్ని కలిగియున్నప్పుడు పార్టీ కమిటీకిజెందిన సభ్యులందరితోకూడిన మీటింగులలో వాటిని చర్చించాలి. వాటిపై నిర్ణయాలు తీసుకోవాలి. సమిష్టిగా వాటిపై నిర్ణయాలు జేసినతర్వాత, ఆ నిర్ణయాలను అమలుజరుపుటకుగాను బాధ్యులుగా వ్యక్తులను నియమించాలి.

పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రాన్ని సువిశాల మొనరించడం అనుదానికి ప్రమాణమేమంటే పార్టీ సభ్యులలోనూ, పార్టీ కేడర్లలోనూ, విమర్శనను, ఆత్మవిమర్శనూ పెంపొందించాలి. కామ్రేడ్ మావోసీటుంగ్ తనరిపోర్టులో ఆత్మవిమర్శపై నొక్కివక్కాణిస్తూ "తదితర రాజకీయపక్షాలకన్న మనలోనున్న విశిష్టలక్షణమేమంటే మనలో తీవ్రమైన ఆత్మవిమర్శయనే లక్షణమువుంది" అన్నాడు. పార్టీపాలసీ పార్టీపనిపట్ల పార్టీ మెంబర్లు కేడర్లలో బాధ్యతాయుత దృష్టిని పెంపొందించాలి. ఆ విధంగావారు తమంతట తాము ఆలోచించే లాగునను, సమస్యలను ధైర్యంగాను, సవ్యంగాను లేవనెత్తే లాగుననూ, వాటిపై తమ అభిప్రాయాలను వివరించేలాగున చేయాలి. తమ అధ్య

ర్యాన నడుపబడుతున్న అన్నిస్థాయిలకు జెందిన నాయకత్వ సంఘాల నాయకులు, తమ నాయకత్వంక్రింద జరుగుతున్న పనిలోని లోట్లు, పొరపాట్లపై ఆత్మవిమర్శనను పూర్తిగా సాగించుటయందు ప్రప్రథములుగా వుండాలి. వీరు పార్టీ మెంబర్లకు కేడర్లకు ఆదర్శప్రాయులుగా తయారవ్వాలి. ఇతరులుచేసే విమర్శనను ఆమోదించుటకు పరిపూర్ణంగా తయారుగావాలి. అంతేగాని, యితర మెంబర్లు విమర్శించినంత మాత్రాన వుద్రేకపడగూడదు. పొగరుమోతుతనంగా ప్రవర్తించరాదు; విమర్శన జేసినమెంబర్లను అణచుటకు శిక్షలకు గురిచేయుటకు యత్నించరాదు. ఈ విధంగా మాత్రమే పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రం ప్రోత్సహింప బడగలదు. ఇలా చేయకపోతే విడవకుండా ఎన్నిమార్లు పార్టీ కాంగ్రెసులను, కాన్ఫరెన్సులను జరిపినా అవి నిర్జీవాలే. తలదిమ్మెత్తించే వుపన్యాసాలతోనూ, చేతులెత్తటంతోనుకూడిన అపసవ్యమైన అప్రజాతంత్రమైన సమావేశాలుగానే వుండిపోతాయి. ఇంతకన్న మరేమీగావు.

మన క్యామేడ్సులో చాలామందికి అందులో బాధ్యతగల క్యామేడ్సుకు కూడా పార్టీ మీటింగును నడుపుటెలాగో దానిని విజయవంతం చేయుటమెలాగో తెలియదు. అందువలన ఆవిధంగా అనేకమీటింగులు వృథా అయిపోయాయి; అల్పాతి అల్పమైన ఫలితాలను యిచ్చేయి. కొన్ని సమయాలలో యీ మీటింగులు పార్టీ సభ్యులమీదనూ, ప్రజలమీదనూ తీవ్రభారంగా తయారవ్వేవి. అనేక మీటింగులు జరిపినంతమాత్రాన ప్రజాతంత్రం చేకూరదు. యీ విషయం

సుస్పష్టం. ప్రజాతంత్రం విమర్శన, ఆత్మ - విమర్శనలతో కూడినధోరణితో మీటింగులు నడపబడాలి. పై వాటితో మీటింగులు నిండియుండాలి. యీ విషయంలో "మీటింగులకు హాజరగుటలో పార్టి మెంబర్లకు అభిరుచి కల్పించేదెలా?" అన్న విషయంపై కామ్రేడ్ మాసీయూంగ్ కుమైన్ కాన్ఫరెన్సు తీర్మానంలో సూచించినదానిని మనం అనుసరించాలి.

బాధ్యతాయుతమైన స్థానంలోనున్న కామ్రేడు పార్టి సభ్యులఎదుటను, ప్రజలఎదుటను, అవసరమైన ఆత్మవిమర్శనను తీవ్రంగానూ, నిష్కళంకంగానూ ఆచరించినపుడు ప్రజలలోనూ, పార్టిసభ్యులలోనూ, విమర్శన, ఆత్మవిమర్శనలు, వున్నతస్థాయికి పోతాయి. వారి కార్యకలాపాలస్థాయి ప్రవర్థితమవుతుంది. వారి అంతరంగిక-దృఢత్వం ప్రవర్థితమవుతుంది. వారిపని అభివృద్ధి అవుతుంది. వారు లోట్లను అధిగమిస్తారు; బాధ్యతాయుతస్థానంలోనున్న అలాంటికామ్రేడుపట్ల ప్రజలకు విశ్వాసం పెరుగుతుందిగాని, తరగదు యని మన అనుభవం రుజువుచేస్తూవుంది. మనపార్టిలోనూ, ప్రజలలోనూ పై దానికి సంబంధిచిన అనేక దృష్టాంతాలున్నాయ్. ఇందుకు భిన్నమైన దృష్టాంతాలుకూడా వున్నాయ్; దానికర్థమేమంటే బాధ్యాయుతమైన స్థానంలోనున్న ఒక కామ్రేడ్‌లో ఆత్మ-విమర్శన ధోరణి లేనప్పుడు విమర్శనజూచి భయపడినా, నిరాకరించినా, తనతప్పులను, లోట్లను,బట్టబయలుచేయ నిరాకరించినా,వాటిపై విమర్శను నిరాకరించినా, లేక వాటిని దాచయత్నించినా, తన్ను యితరులు విమర్శించినప్పుడు, కృతజ్ఞతను చూపించక పోయినా, "తన స్వంతపొరపాట్లను గురించి తనకు యితరులు

చెప్పినప్పుడు సంతోషించుటకు" బదులుగా సిగ్గిలినా, పెడ చెవిని బెట్టినా లేక క్రోధోద్రేకంగా బదులుచెప్పినా లేక కచ్చి తీర్చుకోటానికై ఛాన్సుకోసం ఎదురుజూసినా బాధ్యతాయుత స్థానంలో నున్న ఆ కామ్రేడ్ పట్ల గౌరవం తగ్గుటయేగాక దుష్టఫలితాలేర్పడుతాయన్నమాటకూడా యదార్థం. అలాంటి పరిస్థితిలో పార్టి మెంబర్లలోనూ, ప్రజలలోనూ ప్రజాతంత్ర స్వభావం పెరుగదు వారి కార్యకలాపాలు వున్నతస్థాయికి పోవు. ఆంతరంగిక దృఢత్వం చేకూరదు. లోట్లను అధిగమించ టం జరుగదు. పని అభివృద్ధిగాదు. ఆ కామ్రేడ్ యొక్క గౌరవం మటుమాయమై పోతుంది. అందువలన అన్ని స్థాయిల పార్టి సంఘాలయొక్క బాధ్యతగల సభ్యులపైననూ పార్టిలో ప్రజాస్వామికాన్ని పెంపొందించుటకు, విశాలమొనర్చుటకు అత్యద్భుతమైన బాధ్యతయుంది.

అన్నిస్థాయిలకు జెందిన పార్టిసంఘాలు వాటిలో బాధ్యతాయుతస్థానాలలో నున్న కామ్రేడ్సందరూ నిర్ణీత సమయాలలో తమను ఎన్నుకొన్న పార్టిమెంబర్లకూ క్రింది పార్టిసంఘాలకు తమపనిపై రిపోర్టులివ్వాలి. అలాంటి రిపోర్టు లలో ఆనాటి పరిస్థితులనుగురించీ పొందిన ఫలితాలనుగురించి చెప్పటమేగాక పనిలో జరిగిన లోట్లను, బలహీనతలను, పొర పాట్లను బయటపెట్టుతూ వాటిపై తమతమ అభిప్రాయాలను వ్యాఖ్యానలను యివ్వవలసినదిగా తమను ఎన్నుకొన్న పార్టి సభ్యులను, క్రిందిసంఘాలనూ అర్థించాలి. క్రిందిపార్టి పార్టి సంఘాలచే, పార్టి కేడర్లచేతనూ ఆచరించబడిన కార్యక్రమ ములో జరిగిన పొరపాట్లను, లోట్లను బాధ్యత వాటిది

గాదనీ, నాయకత్వ సంఘాలదేననీ, అనుభవంవల్ల మనకు స్పష్టమవుతూవుంది. ఎలాగంటే యీ లోట్లు పొరపాట్లనే వాటిలో అనేకం సంభవించుటకు కారణమేమంటే వున్నత నాయకత్వ సంఘాలు, పార్టీ కేడర్లకు క్రిందిసంఘాలకు సకాలంలో కర్తవ్యాలను వప్పగించకపోవటంవల్లనూ పార్టీ పాలసీని సకాలంలో వ్యక్తీకరించక పోవటంవల్లను, కర్తవ్యాలను, వప్పజెప్పినా, పాలసీని వ్యక్తీకరించినా, యుక్తసమస్యలను క్రమబద్ధంగాను, పరిపూర్ణంగాను, కదిలించ లేకపోవుటయే కారణమని అనుభవంవల్ల స్పష్టమవుతూవుంది. కొన్ని సమయాలలో యీ పొరపాట్లు సంభవించటానికి కారణమేమంటే వున్నత సంఘాలు రూపొందించిన కర్తవ్యాలలోను పాలసీలలోను తప్పులుండుటయే కారణమని తేలుతూవుంది. అలాంటి పరిస్థితులలో క్రింది పార్టీ సంఘాలపైనను, పార్టీ సంఘాలపైనను లేక పార్టి కేడర్లపైనను అమితమైన నిందలు మోపి "తప్పించుకొన యత్నించటం శుద్ధతప్పు" ఎందువల్లనంటే అలా చేయుటంవలన వారి విశ్వాసం కార్యాచరణ, బలహీన పడుతుందనుట ఖచ్చితమైన విషయం. అయితే తమలో లోట్లు పొరపాట్లూ కనుక వుంటే, క్రిందిపార్టి కమిటీలు పార్టి మెంబర్లూ, కేడర్లు పైన సూచించబడిన ఆత్మ విమర్శన విధానాన్ని కలిగియుండాలి యనుట యధార్థం.

పార్టి ఆంతరంగిక ప్రజాతంత్రంయొక్క సారమేమంటే పార్టి మెంబర్ల చొరవను, కార్యకలాపాన్ని, పెంపొందించటం, పార్టి ఆశయంపట్ల వారి బాధ్యతను సంబంధించిన జ్ఞానాన్ని ప్రవర్ధిత మొనరించటం, పార్టి మెంబర్లుగానీ లేక వారి

ప్రతినిధులుగానీ, పార్టీ నియమావళిలో యివ్వబడిన అవకాశాన్ని అనుసరించి తమ భావాలను పరిపూర్ణంగా వ్యక్తీకరించే లాగున ప్రోత్సహించటం యనేవి. ఆ విధంగా ప్రజల ఆశయ సిద్ధికై పాటుపడుతున్న పార్టీ పనిని నడుపుటలో వారు వుత్సాహవంతంగా పాల్గొనగలరు. పార్టీ క్రమశిక్షణ, ఐక్యతలు బలపడగలవు. పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్రాన్ని సవ్యముగా విశాలమొనరించుటద్వారానే స్వేచ్ఛాపూరితంగా పార్టీ క్రమశిక్షణ బలపడగలదు. పార్టీ ఆంతరంగిక కేంద్రీకృతతత్వాం సుస్థాపితంకాగలదు. సునిర్మితం, సుసంఘటితం కాగలదు. నాయకత్వ సంఘాలు సవ్య నాయకత్వాన్ని అమలుజరుపగలవు. ఆ విధంగా పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్ర సూత్రాన్ని అనుసరించి అన్ని స్థాయీలకు జెందిన పార్టీ నాయకత్వసంఘాలు తమపనిని సాగించాలని పార్టీ నియమావళి సూచిస్తూవుంది.

పార్టీలోపల ప్రజాతంత్రాన్ని వున్నతస్థాయిలో అమలు జరుపుటయంటే పార్టీ ఆంతరంగిక కేంద్రీకృతతత్వాన్ని బలహీనపరచుటకై అది యేర్పరచబడిందని అర్థంగాదు. తద్వ్యతిరేకం. వున్నతస్థాయికిజెందిన ప్రజాతంత్రంయొక్క పునాదిపై వెంటనే వున్నతస్థాయికి జెందిన కేంద్రీకృతతత్వాం నిర్మితమవుతుంది. వున్నతస్థాయికిజెందిన ప్రజాతంత్రాన్నీ, వున్నతస్థాయికి జెందిన కేంద్రీకృతతత్వాన్ని సమ్మిళిత మొనరించాలి. అంతేగాని ఒకదానికి వ్యతిరేకంగా మరియొకదానిని నిలబెట్టరాదు. వున్నతస్థాయికి జెందిన ప్రజాతంత్రాన్ని అమలుజరుపుటద్వారానే వున్నతస్థాయికి జెందిన కేంద్రీకృత నాయకత్వాం ఫలించగలదు. ప్రజాతంత్రంపై ఆధారితమైన వున్నతస్థాయికి

జెందిన కేంద్రీకృత నాయకత్వం క్రిందనే వున్నతస్థాయికి జెందిన ప్రజాతంత్రం వ్యాపించగలదు. వున్నతస్థాయికి జెందిన ప్రజాతంత్రాన్ని ఆచరించుటవలన నాయకత్వ కేంద్రీకరణ బలహీన పడగలదని భావించటం శుద్ధతప్పు. ఏ స్థాయికిజెందిన నాయకత్వసంఘమైననూ తన కార్యక్రమాన్ని పార్టీ - ఆంతరంగిక ప్రజాతంత్ర సూత్రాన్ని అనుసరించి సాగించేటప్పుడు కేంద్రీకృతకార్యాచరణకు సవ్యమైన, లాభదాయకమైనపార్టీ- ఆంతరంగిక - ప్రజాతంత్రానికి అపార్థాలుకల్పించి అరాజక వాద ధోరణులలోనికి దానిని దిగజార్చుటగానీ - స్వతంత్ర తత్వం (Autonomism) అమిత - ప్రజాస్వామిక తత్వాల చర్యలలోనికి దిగజార్చి దిగబడటంగానీ లేక పార్టీ ఆంతరంగిక - కేంద్రీకృతతత్వానికి హాని కలుగజేయుటంగానీ, చేయకూడదనీ పార్టీనియమావళి నొక్కి- వక్కాణిస్తూవుంది.

ప్రజల ఆశయానికి, పార్టీ ఆశయానికి లాభదాయకంగా వుండే మార్గాలను అనుసరించేలాగున పార్టీ - ఆంతరంగిక - ప్రజాతంత్రాన్ని ప్రోత్సహించాలి. అది పార్టీపోరాటశక్తినీ, దృఢతత్వాన్ని, సమైక్యతనూ బలహీనపరచే విధంగా వుండ రాదు. అంతేగాక అది విచ్ఛిన్నకుల, పార్టీ - వ్యతిరేకశక్తుల ద్రోహుల, అవకాశవాదుల, సాహసికవాదుల హస్తాలలో ఆయుధంగా తయారుకారాదు. ఆవిధంగా పరిస్థితులు అనుకూలంగా వున్నప్పుడు యావత్తు పార్టీపాలసీ, పంథాలపై లేక స్థానిక పార్టీసంఘముయొక్క పాలసీ పంథాలనే సవ్యనాయకత్వం అధ్యర్యాసమాత్రమే పరిపూర్ణంగా సమీక్షించవలెననీ, చర్చలు జరుపబడాలనీ పార్టీనియమావళి నొక్కి

చెప్తూవుంది. మరియొక విధంగా చెప్పాలంటే పార్టీ కేంద్ర కమిటీగానీ లేక స్థానిక నాయకత్వసంఘంగానీ యేదో ఒకటి నిర్ణయిస్తేనే తప్ప లేక పార్టీయొక్క క్రిందికమిటీలలో అత్యధిక సంఖ్యచేతగానీ లేక వున్నతపార్టీ సంఘంచేతగానీ ప్రతిపాదింపబడితేనే తప్ప హడావిడిగా చేయరాదని అర్థం.

పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని విశాలమైన రించాలి కాని, పార్టీ నిర్ణయాలను బేషరతుగా అమలుజరపాలి. పార్టీసభ్యులు పార్టీ సంఘానికి క్రిందిపార్టీ సంఘాలు పైపార్టీ సంఘాలకు, మైనారిటీ, మెజారిటీకి, పార్టీయొక్క నియోజకవర్గ సంఘాలు, పార్టీయొక్క కేంద్రకమిటీకి లోబడియుండాలి. పార్టీ నియమావళిలో సూచించబడిన సూత్రాలన్నింటినీ బేషరతుగా అమలుజరపాలి.

ఈ సూత్రాలను అమలు జరపాలంటే తీర్మానాలను లేక సూచనలనూ సవ్యమైనవిగా తాము ఆమోదించామా లేదా యన్నదానిపై ఆధారపడి యుండాలనీ లేక తమకన్న వున్నత స్థానంలోనున్న కామ్రేడుయొక్క సామర్థ్యం, హోదా, పార్టీ సభ్యత్వకాలం సాంస్కృతిక స్థాయిలపైనను అతడు తమను సరిగా చూశాడా లేదా యన్నదానిపైననూ, లేక అతడు తమ గ్రూపువాడా కాదా యన్నదానిపైనను ఆధారపడి యుంటుందని, కొంతమంది కామ్రేడ్సు భావిస్తారు. ఇలాంటి పరిస్థితులు, షరతులూ ఎన్నటికినీ సహించబడవు. ఒక కమ్యూనిస్టు వృత్తుస్థాయిలో క్రమశిక్షణను అమలు జరుపుతున్నాడనేది ఎప్పుడు రుజువవుతుందంటే, అతడు ప్రమాదాన్ని ఎదుర్కొంటున్నప్పుడుగానీ లేక ఒక సూత్రంపై

గానీ లేక వ్యక్తిగత విషయాలలోగానీ, అతనికీ, పార్టీకి తీవ్ర భేదాభిప్రాయాలు ఏర్పడినప్పుడు మాత్రమే. అంటే అతడు బేషరతుగా తాను మైనారిటీ వర్గంలో నున్నప్పటికినీ, నిర్మాణ సూత్రాలను అమలుజరుపు తున్నప్పుడు మాత్రమే పరిస్థితిని యావత్తును గ్రహించినవాడుగాను మొత్తం ప్రయోజనాలకు పాక్షిక ప్రయోజనాలను లోబరచాలని చిన్నసత్యాన్ని పెద్ద సత్యానికి లోబరచాలని అప్రధాన సూత్రాలపై వ్యక్తిగత విషయాలపై వచ్చిన భేదాభిప్రాయాన్ని పార్టి ఐక్యత,పార్టి క్రమ శిక్షణల యొక్క వున్నత సూత్రానికి లోబరచాలని అర్థంచేసు కొన్నవ్యక్తిగానూ, ఘనాతిఘనమైన క్రమశిక్షణగలిగినపార్టి సభ్యుడుగానూ, సూత్రబద్ధుడైన పార్టి సభ్యుడుగానూ పరిగణింప బడుతాడు.

కమ్యూనిస్టులమైన మనం, ఎలాంటిపరిస్థితులలోనూ, అంధవిధేయతను ప్రోత్సాహించరాదు. మనం, యీనాడు గెరిల్లాయుద్ధతంత్రం మధ్యలో వున్నాం. ఈ గెరిల్లాయుద్ధం పరివ్యాప్తమైవున్న గ్రామీణజిల్లాలలో జరుగుతూవుంది; ఈ జిల్లాలలో ఒకదానికి మరియొకదానికి అంతరంగిక బాహ్య పరిస్థితులలో, అపారమైన భేదముంది.; అందువలన మనం, మనపనిలో "కేంద్రీకృతనాయకత్వం క్రింద వికేంద్రీకృతచర్చల విధానాన్ని అమలు జరుపాలి, అమిత - కేంద్రీకృతచర్యలు సమానత్వం అనేవి, తప్పుడు పంథాలు. (అమిత - కేంద్రీకృత చర్యలు, యుద్ధం విషయంలో నన, సమానత్వమనేది యుద్ధచర్యలను నడుపుటలో యదార్థపరిస్థితులు గమనించ కుండా అన్నిప్రదేశాలలోనూ, రూళ్ళకర్రసిద్ధాంతాన్ని అనుస

రించి, సమానస్థాయికిజెందిన యుద్ధచర్యలను జరుపజూచటమనీ అర్థంజేసుకోవాలి.

ఏమైనప్పటికినీ, వికేంద్రీకరణచర్యలకు, స్వతంత్రంగా వ్యవహరించే తత్వమని అర్థంగాదు. వాటికర్థమేమంటే, స్వతంత్రంగా ఆచరించటం, స్వతంత్రంగా పనిచేయుటకు సామర్థ్యం అని అర్థం. వాటిని కేంద్రీకృతనాయకత్వంనుండి విడదీయరాదు. దానికి బదులుగా, వాటికి నాయకత్వంలో కేంద్రీకరణం వుండాలి.

మరియొక విషయ మేమంటే నాయకత్వం సంఘం యిచ్చే సూచనలు, చేసే నిర్ణయాలు ప్రతిప్రదేశంలోని ప్రతి స్థితికి సరిపోక పోవటమేగాక సాధారణస్వభావాన్ని కలిగియుండటం తరచుగా సంభవిస్తుంది. తత్ఫలితంగా అవి సాధారణ ప్రాంతాలకు వర్తనీయాలుగా వుండటం కొన్ని ప్రత్యేక ప్రాంతాలకు సరిపడకపోవటం జరుగుతూ వుంటుంది. అవి తప్పులను కలిగియుండటం, ఆచరణ యోగ్యాలుగా వుండకపోవటం కూడా తరచుగా సంభవిస్తూవుంటుంది. ఇలాంటి పరిస్థితులలో మనం వాటిని గుడ్డిగా ఆచరించాలని గానీ, లేక గుడ్డిగా వాటిపట్ల విధేయుంగా వుండాలనిగానీ సలహా యివ్వరాదు. దీనికి బదులుగా, తెలివిగానూ, దీక్షాయుతంగానూ వ్యవహరించాలని ప్రోత్సహించాలి. దీనికర్థమేమంటే పరిస్థితులను, నిర్ణయాలను, సూచనలను అన్నింటినీ తీవ్రంగా అధ్యయనం జేయవలసిన అవసరంగలదని పైవి అంటే నిర్ణయాలు, సూచనలు, స్థానిక పరిస్థితులకు సరిపడనప్పుడు వాటిలో పొరపాట్లు వున్నప్పుడు ప్రజల కాలాన్ని వృధాజేయు

నట్టి, ధనాన్ని వృధా జేయునట్టి అంతేగాక ప్రజలనుండి వేరు చేయునట్టి అలాంటి నిర్ణయాలను, సూచనలను, గ్రుడ్డిగాను, తిక్కగాను అమలు జరుపుటకు మారుగా వాటిని అమలు జరుపరాదని గానీ లేక సవరించాలనిగాని ధైర్యంగా వున్నత సంఘం ఎదుటపెట్టాలి. అలా క్రిందిపార్టి సంఘాలుచేస్తే అవి ధేయతగా ప్రవర్తించిన ట్లైనట్టికినీగాదు. వారు స్వతంత్రంగా వ్యవహరించినట్లూగాదు. దీక్షాయుతంగా నిర్ణయాలను సూచనలను ఆచరించినట్లే అవుతుంది. స్వతంత్రంగా ఆలోచించ గల్గటమేగాక వున్నత సంఘంయొక్క పొరపాట్లనూ, లోట్లనూ, సవరించుటకు సమర్థతగలిగిన పార్టీమెంబర్లు మాత్రమే విశిష్ట లక్షణాలు గలవారని చెప్పవచ్చును. అలాంటివారినందరినీ ప్రత్యేకంగా ప్రోత్సహించాలి.

ఈ విషయంలో మూడురకాలు వుంటూవుంటాయి. మొదటిదేమంటే వున్నతిసంఘాలు చేసిన నిర్ణయాలలోనూ యిచ్చిన సూచనలలోనూ తమ అభిరుచికి అనుకూలమైన వాటిని ఆచరించటం, మిగిలినవాటిని వదలివేయుటం అనేవి. ఇది కేవలం శుద్ధ స్వతంత్రతత్వాం. ఎలాంటి సాకుచెప్పినాసరే దీనిని సమ్మతించరాదు. ఇక రెండవదేమంటే ఆ ప్రత్యేక నిర్ణయాలు, సూచనలూ వర్తనీయాలవునా కాదా యని చూడకపోవటం లేక అస్థిత్వంలో నున్న పరిస్థితులను అధ్యయనం జేయకపోవటం, గుడ్డిగాను, యాంత్రికంగానూ అమలు జరపటం యనేది. ఈ పద్ధతి కర్థమేమంటే వున్నతసంఘాల నిర్ణయాలను, సూచనలను దీక్షాయుతంగా ఆచరించినట్లుగాదు, గుడ్డిగా అనుసరించినట్లువుతుంది. అందువలన యిదికూడా

సమ్మతనీయమైనదిగాదు. మూడవదేమంటే నిర్ణయాలను, సూచనలను ఒకవైపునను, పరిస్థితులను మరియొకవైపునను అధ్యయనంచేయటం ఆచరణయోగ్యమైనదాని నంతనూ దీక్షాయుతంగా సాగిస్తూ, ఆచరణయోగ్యంగాని దానినంతనూ ఎందువలన ఆచరణయోగ్యంకాదో అన్న వివరాలనిస్తూ దాని సరించవలసిందిగా కోరుతూ, వున్నతసంఘానికి రిపోర్టుజేయుటం అనేది. నిర్ణయాలను, సూచనలను తెలివితేటలుగానూ, దీక్షాయుతంగా ఆచరించమంటే యిదే. ఇదే ఏకైకసవ్యమార్గం. మనం యీ పద్ధతిని వ్యతిరేకించకపోవటమేగాక కమ్యూనిస్టుయొక్క యీ రకమైన సృజనాత్మకశక్తినీ, కార్యకలాపానీ అన్నివిధాలా ప్రోత్సహించాలి. క్రమశిక్షణపట్ల గౌరవం చూపకపోవటాన్ని, స్వతంత్రంగా వ్యవహరించటాన్ని పార్టీ వ్యతిరేకిస్తుంది; కాని సమస్యలను సవ్యంగాకదిలించటంలోనూ పార్టీయొక్క సాధారణదర్శకత్వంక్రింద తన పనిని చేయుటలో స్వతంత్రంగా వ్యవహరించుటలో ప్రతిపార్టీమెంబరూ చూపే చొరవను, ప్రోత్సహిస్తుంది; అలాగే చేయాలని సలహాయిస్తుంది.

నాయకత్వసంఘం తాను జేసిన నిర్ణయాలు సూచనలపై తన క్రిందిసంఘాలు, పార్టీమెంబర్లు, తమ తమ ప్రశ్నలను, సలహాలను, యివ్వనివ్వాలి; వారు పైవాటిలో పొరపాట్లు, లోట్లూవున్నాయని కనుగొన్నప్పుడు వారు తమతమ సవరణలను ప్రతిపాదించనివ్వాలి; తదనుసారంగా వాటిని సరిదిద్దాలి. క్రిందిసభ్యుల అభిప్రాయాలు పొరపాటయినవని తెలినప్పుడు వాటిని సరిదిద్దుటకుగాను తగినంతగా వివరించాలి, అంతేగాని

వారిపై కఠినచర్యలు తీసుకోరాదు. తానుజేసిన ఒకానొక నిర్ణయాన్నిగానీ, లేక ఒకానొక సూచననుగానీ అమలు జరుపాలని వున్నతసంఘం పట్టుబట్టినప్పుడు ఆ సూచనను, లేక నిర్ణయాన్ని సవరించవలసినదిగా క్రింది సభ్యులు విజ్ఞప్తి జేసియున్నప్పటికి దానిని అంటే వున్నతసంఘం పట్టుపట్టిన సూచనను, లేక నిర్ణయాన్ని క్రింది పార్టీసభ్యులు అమలుజరుపాలి. తమ దృక్పథంపైననే పట్టుకొని వ్రేళ్లాడరాదు; నిర్ణయాన్ని ఎదిరించరాదు.

కమ్యూనిస్టు పార్టియొక్క క్రమశిక్షణ స్వచ్ఛంద విధేయతపై ఆధారపడియుంది. అది యాంత్రికంగా వుండరాదు. లేక పార్టిసభ్యుల చొరవనూ చురుకుదనాన్ని చంపే "క్రమశిక్షణ"గా యుండరాదు. పార్టి సభ్యుల క్రమశిక్షణ చొరవ సమ్మిళితమవ్వాలి.

అన్ని స్థాయిలకు జెందిన పార్టి సంఘాలు తన దర్శకత్వాన వున్నతసంఘాల కేంద్ర సంఘాల నిర్ణయాలను పాలసీని ప్రచురించగలమనీ, వాటిని బాగా ప్రచారం జేయగలమనీ, హామీ యివ్వాలని పార్టి నియమావళి సూచిస్తూవుంది. ఇలాంటి నిబంధన ఎందువలన ఏర్పరచవలసి వచ్చిందంటే పార్టియొక్క ఐక్యత దాని జాతీయ స్వభావాన్నిబట్టి చేయాల్సి వచ్చింది. కేంద్రకమిటీ తదితర వున్నతపార్టి సంఘాల నిర్ణయాలను, పాలసీని, అన్ని ప్రదేశాలకు వ్యాపింపజేయాలి. పై వాటికి భిన్నమైన మెట్టిభావాలను ప్రచురించరాదు. ప్రచారం చేయరాదు. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని పరివ్యాప్తం జేయాలి. దానికి వ్యతిరేకమైన అభిప్రాయాలను సిద్ధాంతా

లను వ్యాపింపజేయరాదు. ఈ కార్యక్రమాన్ని మనపార్టీ స్థానిక సంఘాలలో కొన్ని సంతృప్తికరంగా సాగించుటలేదు. కేంద్రకమిటీ నిర్ణయాలకు పాలసీలను కొన్ని పేపర్లు తగినంతగా ప్రచారం చేయుటలేదు. వారు కేంద్రకమిటీ నిర్ణయాలు, పాలసీతో భేదించే వ్యాసాలను ప్రచురించటంకూడా జరుగు తూవుంది. అందువలన అన్ని స్థాయిలకుజెందిన పార్టీ సంఘా లన్నీ యీ విషయాన్ని, ఆచరణలను సరిదిద్దాలి.

జాతీయ స్వభావాన్ని కలిగియున్న సమస్యలపై క్రింది పార్టీ సంఘాలుగానీ, వాటి సభ్యులుగానీ, కేంద్రకమిటీ నిర్ణ యించనిదే కేంద్రకమిటీ తన అభిప్రాయాలను ప్రకటించ నిదే, తమ అభిప్రాయాలను ముందుగా ప్రకటించరాదని పార్టీ నియమావళి సూచిస్తూ వుంది. అలాంటి సమస్యలపై తమలో తాము చర్చించవచ్చుననీ, వాటిపై తమ ప్రతిపాద నలను కేంద్రకమిటీకి అందజేయ వచ్చుననీ అంతేగాని అలాంటి సమస్యలపై నిర్ణయాలుచేయుటగానీ లేక స్వతం త్రంగా ప్రకటనలిచ్చుటగానీ చేయరాదని పార్టీనియమావళి సూచిస్తూవుంది. ఇదికూడా పార్టీఐక్యతకూ, దాని జాతీయ స్వభావానికి అవసరం. మొత్తంమీద పార్టీకంతటికీ ఒకేరక మైన పంథామాత్రమే వుండగలదు. అంతేగాని వివిధపంథాలు వుండవు. జాతీయసమస్యపై ఒకేరకమైన వైఖరిని లేక ఒకే రకమైన దృక్పథాన్ని మాత్రమే ఆమోదించగలదు. అంతే గాని వివిధరకాలను ఆమోదించజాలదు. కేంద్రకమిటీచే నిర్ణ యించబడవలసిన సమస్యలపై కేంద్రకమిటీ ప్రకటించవలసిన సమస్యలపై దానికన్న ముందుగా తమ అభిప్రాయాలను,

దృక్పథాలను ప్రకటించే స్వేచ్ఛను తీసుకొనుటద్వారా తను కున్న అధికారాన్ని స్థానికపార్టీసంఘాలు మితిమీరి సంచరించ రాదు. కేంద్రకమిటీ ఆమోదంలేనిదే బాధ్యాతాయుత స్థానం లో నున్న యే పార్టీనాయకుడుగానీ, కేంద్రకమిటీ సభ్యులు గానీ జాతీయసమస్యలపై తమ దృక్పథాలను ప్రకటించరాదు. వారు తమ అభిప్రాయాలను స్థానికపార్టీ కమిటీలలో చర్చించ వచ్చును. కేంద్రకమిటీకి తమ అభిప్రాయాలను, సలహాలను తెలియపరచవచ్చును. వారు పార్టీ కేంద్రకమిటీచే బయట పెట్టబడని దృక్పథాలను పార్టీలోపల లేక పార్టీవెలుపల ప్రక టించటంగానీ లేక యీ దృక్పథాలను స్థానికపార్టీ కమిటీలలో వ్యాపింపజేయరాదు. దీనికి కారణమేమంటే అలాంటి దృక్ప థాలు లేక నిర్ణయాలు కేంద్రకమిటీ వాటితో సంఘర్షిస్తాయి. పార్టీలోనూ, ప్రజలలోనూ దురభిప్రాయాలకు దారితీస్తాయ్. పార్టీశత్రువులకు అవహేళన చేసే అవకాశం యేర్పడుతుంది. మనకు రేడియో వగైరా ఆధునిక ప్రచారక యంత్రాల సౌకర్యం చాలా అల్పంగానున్నప్పుడు మనం యీ విషయంపై ఎక్కువ నొక్కిచెప్పలేదు. కాని యీనాడు యీ సౌకర్యాలు తగినంతగా వున్నవి. అందువలన యీ విషయిం నొక్కి జెప్పాల్సివచ్చింది. జపాను – వ్యతిరేక – యుద్ధకాలంలో యీ విషయాన్ని అనేకసార్లు మనపార్టీ కేంద్రకమిటీ మన దృష్టికి తెచ్చింది.

పార్టీ కేంద్రకమిటీ మరియు తదితర వున్నతసంఘాల నిర్ణయాలతో సంఘర్షించకుండా వున్నంతమేరకు స్థానిక సమ స్యల విషయంలో స్థానికపార్టీ సంఘాలు స్వతంత్రనిర్ణయాలను

చేసుకోవచ్చుననీ, పార్టీ నియమావళి సూచిస్తూవుంది. ఈ విషయానికి సంబంధించినది మరొకటిచెప్పాలి. అదేమంటే క్రింది సంఘాలు చేసుకొనే నిర్ణయాలలో వున్నతసంఘం అమితంగా జోక్యం కలిగించుకోవటం మానివేయాలి. వున్నతసంఘం క్రిందిపార్టీ సంఘాలు సవ్యమైన నిర్ణయాలకు వచ్చుటకు సహాయపడుటకుగాను తమ సలహాలను యివ్వవచ్చును. నిర్ణయంజేసుకొనే అధికారంమాత్రం క్రిందిసంఘాలకే వుంది; వుండాలి.

ప్రస్తుతం మనపార్టీ యింకనూ చాలా ప్రదేశాలలో ప్రచ్ఛన్నజీవితాన్ని గడుపుతూవుంది. తన కార్యక్రమాన్ని సాగించుకొనుటకుగాను అట్టిపరిస్థితులలో పార్టీ సంఘం తదనుగుణ్యమైన పద్ధతులను అవలంబించాలి. అందువలన రహస్యంగా పనిజేస్తున్న పార్టి అనుకూలంగానుందని పార్టీ పని పద్ధతులను పార్టీయొక్క బహిరంగ నిర్మాణసూత్రాలను సవరించాలని పార్టీనియమావళి సూచిస్తూవుంది. ఈ నిబంధన చాలా అవసరం. పార్టీనియమావళిలో సూచించబడిన నిర్మాణ సూత్రాలను పార్టీ యీవత్తూ అమలుజరుపాలి. కాని మార్పు జెందుతున్న పరిస్థితుల కనుగుణ్యంగా పార్టీనిర్మాణరూపాలను పార్టీ కార్యక్రమనిర్వహణ పద్ధతులను సవరించుకోవాలి. ఈ విషయంపై యిదివరకే వివరించబడింది.

# అయిదవ అధ్యాయం

## కేడర్ల సమస్య

మనపార్టీ నియమావళినిబట్టి మనకు వ్యక్తమవుతూ వున్నదేమంటే మన పార్టీకి దాని ఆశయాలకు, అన్ని స్థాయిలకుజెందిన పార్టీ నాయకత్వ సంఘాలు యెంతో ప్రముఖమైనవని, అన్ని స్థాయిలకు జెందిన యీ నాయకత్వ సంఘాలు కేడర్లతో యేర్పడుతాయ్. కాబట్టి కేడర్ల సమస్యకూడా అత్యంత ప్రముఖసమస్యయే.

పార్టీ కేడర్లు, పార్టీ నాయకత్వానికి చైనా విప్లవానికీ, బీజాలువంటివి. "అన్నింటినీ కేడర్లు నిర్ణయిస్తారు" అన్నసంగతి అందరికీ తెలుసు. పార్టీ కార్యక్రమాన్ని, పాలసీని కేడర్లు లేకుండా ప్రజలలో సాగించగల మనుకోవటం లేక చైనా ప్రజల విముక్తిని సాధించగల మనుకోవటం, వట్టిభ్రమ. దుస్సాధ్యమైన విషయం. గత యిరువైనాలుగు సంవత్సరాల కాలం లోనూ పార్టీయొక్క వీరోచిత పోరాటక్రమంలో అసంఖ్యాకమైన కార్యకర్తలు (కేడర్లు) వుక్కులాగున తయారయ్యేరు. వారు తమ ఆత్మ బలిదానంద్వారా అపారమైన సృజనాత్మక శక్తిద్వారా దీక్షాయుతంగా పనిచేయుటద్వారా చైనా ప్రజల విముక్తి ప్రయోజనాలకై చైనా ప్రజల మహోదాత్త విప్లవాత్మక లక్షణాలను ప్రదర్శించేరు. వీరినిగురించి కామ్రేడ్ మాసేటుంగ్ "జాతికి సంపత్తి వీరు. పార్టీ యావత్తుకూ వీరు గర్వకారణాలు" అని చెప్పేడు.

గతంలో మనపార్టీ కార్యకర్త లనేకమంది త్యాగాలు చేయకపోయినట్లయితే, కృషిసల్పకపోయినట్లయితే యీనాడు మనకు కాన్పించుతున్న ప్రజా ఆశయసిద్ధిని మనం పొందలేక పోయేవారం. మన కేడర్లందరూ భవిష్యత్తులో సమిష్టిగా కృషిసల్పకపోతే ప్రజావిముక్తి ఆశయానికి పరిపూర్ణ విజయాన్ని చేకూర్చజాలం. అందువలన చైనాప్రజలపట్ల కేడర్ల సమస్య యదార్థంగా సర్వవిషయ నిర్ణాయకసమస్య. ఈ సమస్యపట్ల ఏదైనా తీవ్రమైన పొరపా..జరుగుతే అది చైనా ప్రజల ఆశయంపై దెబ్బతీస్తుంది.

మన కార్యకర్తలు ప్రజలనుండి వచ్చారు; ప్రజలలో పనినిజేస్తున్నారు. వారు ప్రజలకు నాయకులవ్వాలి; అదే సమయంలో ప్రజాపంథాను సాగించాలి. ప్రజా పోరాటాలనుండి జనించి మరల ప్రజాపోరాటాలను నడుపునట్టి, ప్రజలలో పని చేయునట్టి నాయకత్వానికి బీజాలువంటివారు. అందువలన మన ప్రత్యేక గౌరవానికి అర్హమైనట్టివారు, ప్రజలలో ఒకభాగమైనట్టివారు మన కేడర్లు. ప్రజలు, వారి ఆశయాలను మనం గౌరవిస్తాం. అందువలన ప్రజల కేడర్లంటే మనకు అమితగౌరవం. మనకు ప్రజలపట్లగల గౌరవంనుండి కేడర్లపట్ల గౌరవం ప్రారంభమవుతుంది. ఈ విషయం పై దృక్పథంనుండి వేరైనదిగాదు. అల్పవిషయమూగాదు. అందువలన ప్రజలనుండి తమ్ము వేరుపరచుకొన్న కార్యకర్తలు (కేడర్సు) లేక ప్రజలకు చక్కగా సేవజేయుటకు బదులుగా ప్రజలకు హానిజేసిన కార్యకర్తలు మన గౌరవానికి పాత్రులుగారు. అలాంటి కార్యకర్తలకు శిక్షణ గరపుటద్వారా పార్టీ వారిని సంస్కరిం

చాలి. కేడర్లను గురించి మదింపు వేయుటకు కావలసిన ప్రమాణ ములలో అత్యంత ప్రధానమైనదేమంటే వారి ప్రజాదృక్ప థము ప్రజాపంథా ప్రజలతో వారికిగల సన్నిహితసంబాధాలు యనేది.

మన కేడర్లు వివిధ వృత్తులనుండి వచ్చినవారు. సాధా రణంగా వారు రెండు తరగతుల క్రిందకు వస్తారు. కార్మిక కర్షకులనుండి వచ్చినవారు, విద్యార్థులు, మేధావులనుండి వచ్చినవారు. ఏమైనప్పటికినీ, యీ రెండు తరగతులు, సమిష్టి లక్ష్యాన్ని జేరుకొనుటకు పోరాడుతాయి. పనిజేస్తాయి. ఇందులో మొదటిది (కార్మిక, కర్షకులనుండివచ్చిన వారు) మన కేడర్లలో మెజారిటీగా వుంటుంది. ఇందులో మొదటి దానిలోనే కర్షకవర్గం నుండివచ్చిన వారి సంఖ్య మెజారిటీగా వుంటుంది. పై విషయాలేమనిరుజువు జేస్తాయంటే, మనపార్టీ చైనా కార్మికవర్గానికి అగ్రగామి దళమని. యావత్తు చైనా చరిత్రలో మనపార్టీలాంటిదే, సాధారణ కార్మిక కర్షకులనుండి వచ్చిన విశిష్టమైన వేలాది కేడర్లకు శిక్ష గరపగలిగిందనీ, తర్ఫీదు యివ్వగలిగిందనీ, మనపార్టీ యిచ్చిన శిక్షణాపల్లనూ ప్రోత్సాహంవల్లనూ మాత్రమే చైనా జాతీయ ఆశయానికి వీరులు యీనాడు అభివృద్ధి జెందగలిగారు. ఇది మన పార్టీకి మార్క్సిజం-లెనినిజం, మాసీయాంగ్ సిద్ధాంతాలకు ప్రతిష్టను చేకూర్చుదూవుంది.

ఈ రెండురకాలకు జెందిన మనపార్టీ కేడర్లలో సుగు ణాలు, లోట్లూకూడా వున్నాయ్. మనం సుగుణాలను పెంపొందించాల్సి వుంది. లోట్లను విసర్జింప జేయాల్సి

వుంది. కార్మిక - కర్షక కార్యకర్తలు (కేడర్లు) ప్రజలతో తమ సంబంధాలను నిలబెట్టుకొనుటకూ, విశాలపరచుకొనుటకు, తమ ప్రజామోదిత కార్యక్రమవిధానాన్ని నిలబెట్టుకొనుటకు, సువిశాలకొనసాగించుటకూ కృషిచేయాలి. తమ సాంస్కృతిక, సైద్ధాంతిక కొరతలను అధిగమించాలి. ఇక మేధావి వర్గానికి జెందిన కారకర్తల విషయమేమంటే వారు యదార్థమైన దృక్పథాలనూ, ప్రజాదృక్పథాలను పెంపొందించుకోవాలి. తమ ఆదర్శవాద దృక్పథాన్ని విసర్జించాలి. శ్రమపట్లనూ కార్మికులు, కర్షకులపట్లనూ వారికిగల గౌరవం లేమితనాన్ని విసర్జించాలి. కార్మిక, కర్షకప్రజలతో కలసి మెలసిపోవుటకు కృషిజేయాలి.

ఈ రెండురకాల కార్యకర్తలూ చైనా ప్రజావిముక్తి ఆశయం విజయవంతమవుటకు కావలసినవారేగాని, విసర్జనీయులుగారు. ఇందులో ఏరకమూ విసర్జనీయంగాదు. అందువలన, కార్మిక - కర్షక కార్యకర్తలను ద్వేషించటం, అగౌరవపర్చటం యెంతతప్పో మేధావివర్గానికి జెందిన కార్యకర్తలను ద్వేషించటం, అగౌరవపర్చటం వారిపట్ల వ్యత్యాసంగా ప్రవర్తించటం కూడా అంతతప్పే. ఈ రెండురకాలూ ఒకదాని పట్ల మరియొకటి గౌరవంగా ప్రవర్తించాలి. ఒకదాని నుండి మరియొకటి నేర్చుకోవాలి. అన్ని పరిస్థితులలోనూ యీ రెండురకాలకు జెందినవారి మధ్య అత్యంతసన్నిహిత సహకారం, సమైక్యతలు యనేవి మన అభ్యుదయాన్ని, మన ఆశయవిజయాన్ని నిర్ణయిస్తాయ్.

ఈ రెండు రకాలలోనూ పాత, కొత్త కేడర్లమధ్య

తేడావుంది, కొత్తవాళ్ళది మెజారిటీ. జపాను వ్యతిరేకయుద్ధం ప్రారంభమైనతర్వాత మనపార్టీలో జేరిన కేడర్లలో చాలా మంది ప్రజలకొరకు అద్భుతంగా పాటుపడ్డారు, అత్యద్భుత మైన తర్ఫీదుపొందారు, పోరాటంలో రాకలుదేరేరు. మన పార్టీ నిరంతరం అసంఖ్యాకమైన కొత్త కేడర్లతో పటిష్ఠ మయ్యింది. అలాంటి కొత్త కేడర్ల బలాలతోనే మన పార్టీ ఆశయం విజయవంతమవుతుంది. కొత్త, పాత కేడర్ల మధ్య సంబంధం అంటే ఒకరు యింకొకరిపట్ల సవ్యమైన వైఖరిని అవలంబించాలనేది మన పార్టీలోపల సర్వదా ప్రాధాన్యతగల సమస్య.

ఈ సమస్యయొక్క ప్రాధాన్యతనుగురించి కామ్రేడ్ మాసీయాంగ్ అనేకసార్లు యిలాచెప్పేడు. "అత్యంత వుత్సాహంతో పాతకేడర్లు క్రొత్తకేడర్లను ఆహ్వానించాలి. వారిపట్ల చక్కగా శ్రద్ధవహించాలి. కొత్తకేడర్లూ, పాతకేడర్లూ తామిద్దరూకలిసి ఏకోన్ముఖులవుటకు, సమిష్టి ఆశయానికై పాటుపడుటకు ఒకరినొకరు గౌరవించుకోవాలి. ఒకరినుండి మరియొకరు నేర్చుకోవాలి. ఒకరి మంచిగుణాలను మరియొకరు పొందాలి. తమతమ లోట్లను సవరించుకోవాలి."

ఏమైనప్పటికి కామ్రేడ్ మాసీయాంగ్ యిచ్చిన యీ ప్రధాన సూచనపై కొంతమంది కామ్రేడ్లు యింకనూ శ్రద్ధ జూపించలేదు. క్రొత్తకేడర్లకు, పాతకేడర్లను గురించి చాలా తక్కువ అభిప్రాయముండటం, పాతకేడర్లు, క్రొత్తకేడర్లను అసహ్యించుకోవటం, ఆహ్వానించలేకపోవటం, శ్రద్ధ జూపలేక పోవటం యింకనూ సంభవిస్తూనేవుంది. ఇప్పటినుండి వారు

యీ విషయంపై బాగా ఆలోచించాలి. బాగా ఆలోచించి దీనిని తప్పకుండా సరిదిద్దుకోవాలి. పాతకేడర్లు, క్రొత్తకేడర్లూ అన్నివిషయాలపైననూ సమైక్యమైననాడే సహకరించినాడే మనం మన కర్తవ్యాలను కొనసాగించ గలుగుతాం.

విప్లవక్రమంలో తమతమ పనుల స్వభావం, వృత్తి రికార్డులలోగల భేదాలనుబట్టి కేడర్లలో ఒకరికి మరియొకరికి భేదంవుంటుంది. అంటే సైనిక కేడర్లు, సివిలియన్ కేడర్ల మధ్య ఒక సైన్యంయొక్క కేడర్లు, మరియొక సైన్యం కేడర్ల మధ్య ఒకప్రదేశం మరియొక కేడర్లమధ్య ఒక డిపార్టుమెంటు కేడర్లు మరియొక దాని కేడర్ల మధ్య స్థానిక కేడర్లు బయటి కేడర్ల మధ్య వ్యత్యాసం వుంటుంది. ఈ కేడర్ల ప్రతి ఒకటి విప్లవకార్యక్రమంలోని యేదో ఒక రంగంలో ఆరితేరి వుంటుంది. యితర రంగాలలో బలహీనంగా వుంటుంది. ప్రతిఒక్కరికి వారివారి సుగుణాలూవున్నాయ్, లోట్లూవున్నాయ్. అందువలన వారు, ఒకరిపట్ల మరియొకరు ద్వేషం చూపించుకోవటంకంటె, ఒకరి మీద మరియొకరు చాడీలు చెప్పుకోవటంకంటె, ఒకరితో మరియొకరు సంఘర్షించటంకంటె, ఒకరినొకరు గౌరవించటం, ఒకరికొకరు సహాయపడటం, ఒకరినుండి మరియొకరు నేర్చుకోవటం, విధిగాచేయాలి. కామ్రేడ్ మావోసేటుంగ్, తాను మూడువిధానాల సవరింపుపై యిచ్చిన రిపోర్టులో కేడర్ల మధ్య వుండవలసిన సత్సంబంధాలనుగురించి నొక్కి చెప్పాడు; ప్రతి కేడరూ, ప్రతిపార్టీ మెంబరూ దాని ననుసరించి తప్పక పని జేయాలి. అన్నిపరిస్థితులలోను కేడర్ల మధ్య వున్నతస్థాయికి

జెందిన సమైక్యత, సహకారంవల్లనే మన సమిష్టిఆశయం పురోగమించగలదు.

అన్నిటికన్న ప్రధానమైనది మనపార్టీ, మావోసేటుంగ్ యొక్క కేడర్లవిధానం; అంటే కేడర్లమధ్య సమైక్యతా విధానం. అంటే కార్మిక – కర్షక కేడర్లు, మేధావివర్గానికి జెందిన కేడర్లమధ్యనూ, కొత్తకేడర్లూ, పాతకేడర్లమధ్యనూ, వివిధరంగాలలోని కేడర్లమధ్యనూ, వివిధస్థానాలలో పనిచేయు కేడర్లమధ్యనూ, యావత్తుపార్టీయొక్క కేడర్లమధ్య సమైక్యతా విధానమది. అందువలన, సమైక్యతామార్గం అవరోధంగా నిలబడే ప్రతిదానిని విధిగా అధిగమించాలి.

ఏ ప్రాతిపదికపై మన కేడర్లసమైక్యతను నిర్మించాలి? వారి సమైక్యతను ఆటంకపరచేదేమిటి?

మనపార్టీ ఒక కుటుంబగూపుగాదు; వ్యాపార సంఘమూగాదు. సమిష్టిసిద్ధాంతం, సమిష్టిరాజకీయ కార్యక్రమాలచే ఏకోన్ముఖం చేయబడిన విప్లవాత్మక రాజకీయపార్టీ మనది. అందువలన మనకేడర్ల సమైక్యతనేది సూత్రరహితమైనదిగాదు. వ్యక్తిగత జీవితప్రయోజనాలు, అభిప్రాయాలపై స్థాపించబడియుండ లేదు.

మార్క్సిస్టు లెనినిస్టు సిద్ధాంత సమైక్యతమీదనే చైనా ప్రజల విముక్తి ఆశయంపట్ల సమిష్టివిశ్వాసం, సమిష్టి కార్యక్రమంపైననే, పార్టీ కేంద్రకమిటీయొక్క సవ్యపంథామీదనే, కామ్రేడ్ మావోసేటుంగ్ సిద్ధాంత నాయకత్వంమీదనే, కేంద్ర కమిటీయొక్క సవ్య నాయకత్వంమీదనే ఆధారితమైవుంది. అందువలన మనం సైద్ధాంతికంగా సమైక్యమైయున్నంతకాలం

మనం ఒకే విశ్వాసాన్ని కలిగియున్నంతకాలం ప్రజలకు సేవ చేయుటకై ఒకే కార్యక్రమాన్ని కలిగియున్నంతకాలం మన మంతా కేంద్రకమిటీ పంథాను సపోర్టుజేసి కొనసాగించినంత కాలం కేంద్రకమిటీ కామ్రేడ్ మాసీయూంగుల నాయకత్వం క్రింద చేవోడువాదోడుగావుండి పోరాడినంతకాలం మన మేర కానికి జెందిన కేడర్లయిననూ లేక ఏ స్థానంలో, ఏప్రదేశంలో, ఏ రంగములో పనిజేసే కేడర్లమైనప్పటికీ మనము సమైక్య మవ్వాలి. మన మిలా ఎందుకుచేయరాదో యన్నదానికి కార ణములేదు. వ్యక్తిగత జీవితాలలోని, భావాలలోని అల్ప భేదాభిప్రాయాలు మనలో విచ్ఛిన్నబీజాలు అంకురింపజేయ నీయరాదు. యావత్తుపార్టీ కేడర్లందరిమధ్య సమైక్యత, దృఢ త్వానికు గట్టిపునాది యిదే.

మన పార్టీ మెంబర్లలోగానీ, లేక కేడర్లలోగానీ ఎవ రైనా మార్క్సిజం లెనినిజంకు బదులుగా పిడివాదాన్ని, లేక అనుభవవాదాన్ని అనుసరిస్తే, యావత్ ప్రజల ప్రయోజనా లకై నిలబడుటకు బదులుగా వ్యక్తిగత లేక ముఠా ప్రయో జనాలకై నిలబడితే కేంద్రకమిటీ పంథాను సాగించుటకు బదు లుగా దానికి వ్యతిరేకంగాపోతే కేంద్రకమిటీ నాయకత్వాన్ని ఆమోదించుటకు బదులుగా స్వతంత్రంగా వ్యవహరించవలసి నదిగా సలహాయిస్తే, కామ్రేడ్ మాసీయూంగ్ నాయకత్వాన్ని అనుసరించవలసినది బదులుగా, స్వతంత్రంగా వ్యవహరించ వలసినదిగా సలహాయిస్తే యీ విషయాన్నంతనూ క్లుప్తంగా చెప్పాలంటే పార్టీయొక్క సమిష్టికార్యక్రమంనుండి మార్క్సిజం — లెనినిజం సూత్రాలనుండి, కామ్రేడ్ మాసీయాంగ్

సిద్ధాంతంనుండి లేక యావత్ ప్రజానీకం ప్రయోజనాలనుండి ఎవరైనాదూరమైతే విషయిగతత్వమును (Subjectivism), పాక్షికతత్వమును (Sectarianism), శిఖరాగ్రతత్వమును (mountain - top-ism), ఆలింగతమొనరించుకొంటే మన పార్టీ సమైక్యతామూలం దెబ్బతింటుంది. యీ తప్పుడు ధోరణులను అధిగమించుటకు రాజీరహితమైన సన్యపోరాటాన్ని చేయుటద్వారానే సమైక్యతను సాధించగలం. పార్టీలోని యీ తప్పుడు ధోరణులు – అవకాశవాదం, పిడివాదం, అనుభవ వాదం, పాక్షికతత్వం (సెక్టేరియానిజం), శిఖరాగ్రతత్వం (mountain - top-ism) అనే తప్పుడు ధోరణులు – మన పార్టీ సమైక్యతకు హానికరాలు. అందువలన వీటిని తప్పక అధిగమించాలి.

పార్టీ, చరిత్రను అనేక సంవత్సరాలనుండి అధ్యయనం జేయుటఫలితంగా, మూడువిధానాల సవరింపు ఉద్యమఫలితంగా మనపార్టీలోని పిడివాదం యిప్పటికే తీవ్ర విమర్శకు గురి అయ్యింది. దాని చిహ్నాలు పార్టీలో యింకా వున్నప్పటికీ, వాటిని అధిగమించుటకు యింకనూ దృష్టిని కేంద్రీకరించవలసివున్నప్పటికీ, పార్టీలో దేనికి మార్కెటులేదనే చెప్పవచ్చు. దీనికంపుకు మన కామ్రేడ్సు యిష్టపడ్తేస్తున్నారు; అందువలన యిది (పిడివాదం) పార్టీలో పెరగాలంటే యాతనపడాల్సివస్తుంది.

మూడు విధానాల సవరింపుఉద్యమ కాలములోనూ, పార్టీ చరిత్ర అధ్యయన కాలములోనూ, పార్టీలోనున్న అనుభవ వాదముకూడా కొంతవరకు విమర్శకు గురిఅయ్యింది.

పార్టీలో దీని వ్యాపారంకూడా దిగజారిందని చెప్పవచ్చును. అయినప్పటికి దీనిపై (అనుభవవాదం) విమర్శ యింకనూ తగినంతగా జరుగలేదనే చెప్పాలి; చాలామంది కామ్రేడ్సు దీనిని పసిగట్టలేకపోతున్నారు. వారికి దానిని పసిగట్టగలుగుటకు తగినంతజ్ఞానం యింకా లేదనేచెప్పాలి. అందువలన దీనికి (అనుభవవాదానికి) పార్టీలో చెలామణివుంటుంది. మార్క్సిజం - లెనినిజంను మావోసీయూంగ్ సిద్ధాంతాన్ని వ్యాపింపజేయుటకు పార్టీ ఆంతరంగిక సమైక్యతకు యిది కొంతవరకు అడ్డంకియే యని చెప్పాలి. అందువలన యావత్తు పార్టీయొక్క సమైక్యతను పురోగమింపజేయుటకు మూడు విధానాల సవరింపు తత్వాన్ని సజీవంగా నిలిపివుంచుటద్వారా అనుభవవాద చెడ మార్గాన్ని పరిపూర్ణంగా అధిగమించాలి.

అనేక సంవత్సరాలపాటు మూడువిధానాల సవరింపు వుద్యమాన్ని సాగించుటద్వారా పార్టీచరిత్ర అధ్యయనాలను సాగించుటద్వారా మనం పార్టీలోనున్న అత్యంత తీవ్రమైన పాక్షికతత్వాన్ని అధిగమించినప్పటికి పార్టీ ఆంతరంగిక సమైక్యతను బలహీనపరచే గ్రుడ్డిశిఖరాగ్ర తత్వంవైపుకు మొగ్గే ధోరణి యింకనూ పార్టీయొక్క కొన్నిసెక్షన్లలోవుంది. ఈ రకపు అంధశిఖరాగ్రతత్వం జనించుటకు భౌతిక, చారిత్రిక కారణాలున్నాయ్. అవేవంటే.

(1) పార్టీలోపల వెలపల పెట్టీ బూర్జువాశక్తులు అత్యధికంగా వుండటం;

(2) గ్రామీణ గెరిల్లా యుద్ధతంత్ర పరిస్థితులలో పార్టీయొక్క వివిధ సెక్షన్లు చాలాకాలంపాటుగ విడదీసివుంచబడు

టచే ఒకదానితో మరియొకటి వేరైనట్టి ప్రత్యేక చరిత్రలు, ప్రత్యేక సంబంధాలు ప్రత్యేక పనివిధానాలు యేర్పడ్డాయ్;

(3) పార్టీలో తగినంతగా మార్క్సిస్టు లెనినిస్టు అధ్యయనం లేకపోయింది. అందువలన పార్టీలోని వివిధ సెక్షన్లకు జెందిన కామ్రేడ్సు శిఖరాగ్రతత్వధోరణితో తమకు తెలియకుండా అవాంఛనీయమైన లక్షణాలను ప్రదర్శిస్తూవుంటారు. వారు తమ ప్రఖ్యాత చరిత్రపట్లనే అభిరుచి చూపుతారు. ఇతర సెక్షన్లకు జెందినవారి ప్రఖ్యాతచరిత్రను గురించి గౌరవం జూపరు. లేక దానిని అల్పంగా జూస్తూవుంటారు. తమ లోటుపాటులను తెలుసుకోరు. తాము సాధించిన ఫలితాలను గురించి మాత్రం పొగడుకొంటూయుంటారు. తత్ఫలితంగా వారు తమ యదార్థమైన, స్పష్టమైనలోట్లను విమర్శించుటకు ఇతర సెక్షన్లలోని కామ్రేడ్సుకు అవకాశం ఇవ్వరు. అంతేకాక తాము సాధించిన ఫలితాలనుగురించి స్తుతిపాఠాలు చేయుటకు మాత్రమే ఒప్పుకుంటారు. అంతేగాక పార్టీయొక్క ఇతర సెక్షన్లలో తప్పులుతప్ప వారికి మరేమీ కాన్పించవు. అందువలన యితరులను విమర్శించుట తప్ప వారివద్ద యితరులకు యివ్వగలిగిదేమీ ఉండదు. ఇతరుల కష్టాలను పరిగణలోనికి తీసుకొనుటగాని, వాటిని ఒప్పుకొనుటగాని చేయరు. వారు తమ మురాలోనివారితో కులాసాగా కబుర్లు చెప్పుకొంటూ ఒకరితో మరియొకరు కలసిమెలసి తిరుగుతూ, ఒకరిపట్ల మరియొకరు శ్రద్ధచూపుతూ, ఒకరితో మరియొకరు హృదయాలు విప్పుకొంటూ మాట్లాడుతూ యుంటారు కాని, తమ మురాకు జెందనివారికి అందుబాటులో యుండరు. దూరంగాను, పెడ

మొగముగాను, పెడసరంగానూ ఉంటాయి. తమపార్టీ అంత రంగిక సంబంధాలను బట్టి యితరులను ఆటంకపరచుటకు వీరికి కొంత వెనుకబలము ఉంటుంది. అంతేగాక కొన్ని సమయాల్లో వీరందరు ఏకమౌతారు. అంటే ఇతరులను ఆటంకపరచుటకు ఏకమౌతారన్నమాట.

జాగ్రత్త వహించవలసినదిగా యితరులను వత్తిడిజేసే వారు, అహంకారం గలవారూ మనపార్టీలో వున్నారు.

ఈ రకపు శిఖరాగ్రతత్వపుధోరణి తరచుగా పార్టి యొక్క కొన్ని సెక్షన్లలో వ్యక్తమవుతూవుంది; అంటే స్థానిక కేడర్లూ, బయటి కేడర్ల మధ్యనూ. సైనిక కేడర్లూ, సివిలియన్ కేడర్ల మధ్యనూ, సైన్యంలోని ఒక సెక్షనుయొక్క కేడర్లకు మరియొక సెక్షను కేడర్లమధ్యనూ, లేక ఒక జిల్లా కేడర్లకు మరియొక జిల్లా కేడర్లమధ్యనూ, సమైక్యతను భగ్నంగావించు చున్న అవాంఛనీయమైన సంఘర్షణలకు తావిచ్చుచున్న శిఖరాగ్రతత్వం అమలులో వుంది. అనేక విషయాలలో యీ రకపు శిఖరాగ్రతత్వధోరణి, గ్రుడ్డియైనది. చైతన్య రహితమైనదై వున్నది. అందువలన యీ ధోరణికి లొంగిన వారు తమ తప్పులను ఒప్పుకోరు; అంటే విషయాన్ని వారికి సవ్యంగా విప్పిచెప్పేవరకూ, దానిలో వారికి నమ్మకం చిక్కే వరకూ,వారు తమతప్పులనుఒప్పుకోరు. ఈధోరణి గ్రుడ్డితనాన్ని ప్రచ్ఛన్నలక్ష్యాలు కలిగియున్న కొన్ని శక్తులు వినియోగించు కొన్నప్పుడు, వారిలో తీవ్రమైన తగాదా లేర్పడుతాయి.

శిఖరాగ్రతత్వముయొక్క యీ గ్రుడ్డిధోరణి, ఒక విశిష్ట రకానికిజెందిన పాక్షికతత్వం; దీనికి పైకి కనపడే పొంపాటు

రాజకీయకార్యక్రమమేమీ వుండదు; కాని, దీనికిఅపసవ్యమైన రాజకీయనిర్మాణాత్మక దృక్పథాలనేకం వుంటాయి. విసర్జన తత్వం, మితవాదతత్వాలయొక్క తీవ్రధోరణులు, ప్రజలనుండి తీవ్రంగా వేరుపడియుండుధోరణులు, దీనికి వుంటాయి. ఈ శిఖరాగ్రతత్వధోరణి, మార్క్సిజానికి, లెనినిజానికి వ్యతిరేకం; యావత్తుపార్టీ సమైక్యతను, దృఢత్వాన్ని, విచ్ఛిన్నంచేస్తుంది; ముఠాతత్వానికి దారితీస్తుంది. అందువలన దీనినివ్యతిరేకించాలి. పార్టీలోనుండి దీనిని వెడలనడుపాలి. యిది గట్టిగా అందరూ తెల్సుకోవలసిన సూత్రమిది. ఇందులో ఏమాత్రమూ సందేహ ముండరాదు.

మనపార్టీ శిఖరాగ్రతత్వం అస్థిత్వంలోవున్నదని ఎత్తి జూపుతూవుంటే దాని మూలానికిగల భౌతికకారణాలను మనం బయటపెట్టుతూవుంటే కొంతమంది కామ్రేడ్సు యీ ధోరణి వుండాల్సిన అవసరంగలదని భావిస్తున్నట్లూ, దానినిజూచి గర్వపడుతున్నట్లూ కనుపడుతూవుంది. అది అస్థిత్వంలో వేరే యని విచారిస్తున్నారు. పార్టీలోపల యీ ధోరణిని నిర్మించి బలపరచి, న్యాయబద్ధంజేసి ఆ విధంగా గుడ్డి శిఖరాగ్ర, తత్వాన్ని చైతన్యయుతమైన శిఖరాగ్రతత్వంగా అభివృద్ధి జేయకోరుతున్నారు. ఈ అభిప్రాయం మార్క్సిజం లెనినిజం సూత్రాలకు పరిపూర్ణంగా వ్యతిరేకమైనట్టిదని సుస్పష్టమైన విషయం.

పార్టీలోని శిఖరాగ్రతత్వ ధోరణిని తప్పక రద్దు చేయాలి. ఇతర పొరపాట్లకు వ్యతిరేకంగాజరిగే పోరాటాలలో మాదిరిగానే దీనిలోకూడా త్వరపడి తీవ్రంగా చర్యలను తీసు

కొనుటను నివారించాలి. "పర్వతాలను" విభజించే సరిహద్దు రేఖలను చెరిపివేయాలి. యీ ధోరణియొక్క గుడ్డిస్వభావాన్ని దాని భౌతిక, చారిత్రక వెనుకబలాన్ని సమాలోచనలోనికి తీసుకొంటూ మొట్టమొదటగా యీ ధోరణియొక్క భౌతిక అస్థిత్వాన్ని అర్థంజేసుకోవటం అవసరం. తమ ఆత్మ పరిశీలన చేసుకొనుటకు సామర్థ్యం యేర్పడేలాగున పార్టీ సభ్యుల, కార్యకర్తల చైతన్యాన్ని పెంపొందించటమూ మార్క్సిస్టు - లెనిసిస్టు శిక్షణను వోపికగా పెంపొందించటమూ కూడా చాలా అవసరం. క్రమేణా యీ ధోరణియొక్క అంధస్వభావాన్ని వదిలించుకొనుటకూ, క్రమేణ విసర్జింపజేయుటకు అంతిమంగా యీ ధోరణిని రద్దుచేయుటకు వున్నతస్థానాలలో నున్న కామ్రేడ్స్ ఆత్మ - పరిశీలననూ, ఆత్మ - విమర్శనలను నడుపుటలో ఆదర్శవంతులుగా ముందుకు రావాలి. మార్క్సిస్టు - లెనినిస్టు చైతన్యాన్ని మన కామ్రేడ్స్ తమలో అభివృద్ధి పరచుకొన్నప్పుడే పర్వతశిఖరాగ్రతత్వం రద్దుచేయబడగలదు.

మన కేడర్లసమైక్యతకు మరియొక ఆటంకమేమంటే వారి వీపులమీద వారి "సిపాయీసంచులు" ప్రతిరకానికి జెందిన కేడర్లకూ సుగుణాలు, బలహీనతలు వున్నాయ్. తమ బలహీనతలను కప్పిపుచ్చుకోటానికి చాలామంది కామ్రేడ్స్ తమ సుగుణాలను తరచుగా వుత్ప్రేక్షించుకొంటూ వుంటారు. యితరుల సుగుణాలను కించపరచడానికికూడా అలా చేస్తూ వుంటారు. ఆవిధంగా వారు తేలికగా అహంకారపూరితులుగా తయారవుతారు. ఇతరులను తక్కువచూపు చూస్తారు. యితరుల విమర్శను "గుసగుసలను" తాళలేరు. తత్ఫలితంగా వారి

సుగుణాలు, వారి "సిపాయీసంచులు" గానూ, వారి భవిష్యత్ అభ్యుదయానికి అంతేగాక కేడర్ల సమైక్యతకు ఆటంకాలుగా తయారవుతాయ్. అందువలన వారి సుగుణాలు, బలహీనతలుగా, దుర్లక్షణాలుగాతయారవుతాయ్.

ఉదాహరణకు, కార్మిక - కర్షక కేడర్లు తమ సామాజిక మూలాన్ని జూచి గర్వపడుతూవుంటారు. మేధావివర్గానికి జెందిన కేడర్లను తక్కువజూపు జూస్తారు. ఇక మేధావివర్గ కేడర్లు తమకు జ్ఞానం గలదుగదాయని కార్మిక - కర్షక కేడర్ల నుండి పైవిధంగా లభించే "అభివందనాలను వాపసు"జేస్తారు. పాత కేడర్లు తమకు పోరాటంలో బాగా అనుభవం యుండుట వల్ల కొత్తకేడర్లను తక్కువజూపు జూస్తారు కొత్తకేడర్లు తమకు తెలివి, సామర్థ్యం వుండుటవల్ల పాతకేడర్లను తక్కువజూపు జూస్తారు. సైనిక కేడర్లు తమకు యుద్ధంచేయుటలో సమర్థత వుండుటచే, సివిలియన్ కేడర్లను తక్కువజూపు జూస్తారు. సివిలియన్ కేడర్లు, తమకుఎక్కువ అనుభవం వుండుటచే సైనికకేడర్లను తక్కువజూపు జూస్తారు. ఒకానొక సైనికయూనిట్‌కుచెందిన కేడర్లు తాము ఎక్కువ యుద్ధాలలో జయించుటచే, మరియొక సైనిక యూనిట్‌కు జెందిన కేడర్లను తక్కువచూపు చూస్తూవుంటారు. ఇదేవిధంగా వారు, వీరినీ, వీరు, వారినీ, తక్కువచూపు చూడటం జరుగుతూ వుంటుంది. ఇంతేగాక, వివిధ ప్రాంతాలకు, డిపార్టుమెంటులకు జెందిన కేడర్లు, తాము సాధించిన ఫలితాలు, జ్ఞానంవలన, యితరులను తక్కువజూపు జూస్తూవుంటారు.

తమ వీపులమీద "సిపాయీ సంచులు" కలవుగదా

యని యితరులను తక్కువజూపు జూడటంవలన, యితరులలో అసహ్యాం రేకెత్తటం, కేడర్లలో అనైక్యత జనించుట సంభవిస్తుంది. అందుకనే, కామ్రేడ్ మాసీయాంగ్, "మీ సిపాయీ సంచులను పరీక్షించుకోండోయ్, తాత్వికంగా బయటపడుటకు ఆ సంచులను దింపేయండోయ్; ప్రజలతో అత్యంత సన్నిహితమైన సంబంధాలు పెట్టికొనుటకు తక్కువ తప్పులు జేయుటకు పార్టీ యావత్తునూ సమైక్యమొనరించుటకు అలాచేయండోయ్" అన్నాడు.

వీమైనప్పటికి తమ వీపులమీాదనున్న "సిపాయీసంచుల"ను జూచి యేమేమో భావిస్తున్నారు. ఇవి తమపై అమితభారాలని గుర్తించుటలేదు. అందువలన వారు వీటిని విసరిపారవేయుటకు యిచ్ఛగించుటలేదు. అందువలన కేడర్లు తమ చైతన్యాన్ని పెంపొందించుకోవాలి. అహంకారం తమలో ప్రవేశించకుండా తమ్ముతాము రక్షించుకోవాలి. ఎందువల్లనంటే అహంకారం పెరుగుటవలన వారి సుగుణాల అభివృద్ధి అరికట్టబడుతుంది. సద్యోఫలితాలను సాధించకుండా జేస్తుంది; అంతేగాక వారి సుగుణాలను లోట్లుగా మార్చుతుంది. అందుకనే కామ్రేడ్ మాసీయాంగ్ మనం మనబుర్రల వినియోగించు టెలాగో నేర్చుకోవలసినదిగానూ, సరిగా ఆలోచించటము నేర్చుకోవలసినదిగానూ, విషయాలను సవ్యంగా వివరించుకొనవలసిందిగానూ మన కేడర్ల సుగుణాలు అభివృద్ధిజెందుటకై వారు తమ లోట్లను అధిగమించుటకై తత్ఫలితంగా అభ్యుదయాన్ని దినదినం, మాసంమాసం పురోగమింపజేయు

టకై మన పార్టీలోనున్న గుర్డితనాన్ని పోద్రోలవలసిందిగా మనకు పిలుపిచ్చాడు.

మన కేడర్లు తమ "సిపాయీ సంచులను" పర్వత శిఖరాగ్రతత్వాన్ని, విషయగతతత్వాన్ని విసర్జించాలి, అన్ని ప్రధాన సమస్యలను వివరించుటకు వారు తమ బుర్రలను వుపయోగించాలి. వారు తమ చైతన్యాన్ని పెంపొందించుకోవాలి. గ్రుడ్డితనాన్ని విసర్జించాలి. అహంకారాన్ని దరిచేరనీయరాదు. ఉద్వేగతనాన్ని దరిచేరనీయరాదు. నమ్రతగావుండాలి. జాగరూకులై వుండాలి. కామ్రేడ్ మానీయాంగ్ చే నడుపబడుచున్న కేంద్రకమిటీ నాయకత్వం పంథాలక్రింద ఏకగ్రీవంగా సమైక్యమవ్వాలి. ఆనాడు మనవిజయం తథ్యమవుతుంది. యావత్తు పార్టీయొక్క కేడర్లన్నింటి సత్వరకర్తవ్య మిదే.

మన కేడర్ల సమైక్యత వారి అభ్యుదయంనుండి విడదీయరానట్టిది. అవి ఒకేవిషయానికి రెండువైపులు. మార్క్సిజం - లెనినిజాన్ని - మానీయాంగ్ సిద్ధాంతాన్ని అధ్యయనం చేయకుండా తమ చైతన్యస్థాయిని పెంచుకోకుండా "సిపాయీ సంచులను" విసర్జించుటగానీ, గుడ్డి పర్వతాగ్రతత్వమును రద్దుచేయుటగానీ, విషయగతతత్వాన్ని అధిగమించుటగానీ, పార్టీ మెంబర్లనూ, ప్రజానీకాన్ని సమీకరించుటయొక్క ప్రాధాన్యతను గుర్తించుటగానీ లేక అహంకారతత్వాన్ని తుడిచిపెట్టుటగానీ అసంభవం; దుస్సాధ్యం. అందువలన మన లోట్లను సవరించుకొనుటకుగాను, మన చైతన్యాన్ని పెంపొందించుకొనుటకుగాను మూడు విధానాల సవరింపు వుద్యమంలో మనం పనిజేసినట్లుగా మార్క్సిజం- లెనినిజం - మానీయాంగ్

సిద్ధాంతాల అధ్యయనాన్ని అవిచ్ఛిన్నంగా బలపరచాలి; మనపార్టీ, మనకేడర్ల అభ్యుదయానికి సంచాలకశక్తియైన విమర్శ, ఆత్మవిమర్శలను అవిచ్ఛిన్నంగా అభివృద్ధిజేయాలి. అందువలన మనపార్టీ యొక్క కేడర్ల పాలసీ యంటే, మన కేడర్ల అభివృద్ధికై యేర్పరుపబడిన ఒకపాలసీ, వారు తమ తప్పులను, లోట్లను అధిగమించుటకు విమర్శ, ఆత్మ-విమర్శలద్వారా తమ చైతన్యాన్ని అభివృద్ధిజేసుకొనుటకు దోహదమిచ్చే పాలసీ.

అవిరామమైన విప్లవాత్మక యుద్ధాలలో అనేకమంది కార్యకర్తలు తీయకుండా బలైపోయేవారు. అయిననూ విప్లవాభివృద్ధి కార్యకర్తల సంఖ్యాభివృద్ధిని కోరుతుంది. ప్రజా విప్లవ ప్రవాహాలనుండి అసంఖ్యాకంగా కార్యకర్తలు జనించేరు. తత్ఫలితంగా కార్యకర్తలను ఎన్నుకోవటం, వారిని పైకి తీసుకొనిరావటం యనే గురుతరకర్తవ్యం మనలను అనుదినం ఎదుర్కొంటూవుంది.

మనం కార్యకర్తలను ఎన్నుకోవటం, పైకి తీసుకొని రావటం ఎలా? వీటి పరిమాణాలేమిటి?

సహనపూరిత విప్లవాత్మక హేతుతత్వంతోపాటు మన కార్యకర్తలు కమ్యూనిస్టు విప్లవోత్సాహపూరితులుగా వుండాలి.

మన కార్యకర్తలు ప్రజానీకంయొక్క ఆశయంపట్ల అంతులేని విశ్వాసం కలిగియుండాలి; ప్రజానీకంతో అత్యంత సన్నిహితసంబంధం కలిగియుండాలి; క్లిష్టపరిస్థితులలో స్వతంత్రంగా వ్యవహరించగల సామర్థ్యాన్ని కలిగియుండాలి; నిర్ణయాలు చేయుటకొరకు బాధ్యతనువహించుటలో నిర్భీతిగా

వుండాలి; శత్రువుతో పోరాడుటలోనూ, సూత్రాలపై జరిగే పార్టీ ఆంతరంగిక పోరాటాలలోనూ, మార్క్సిజం-లెనినిజంలో వుత్తమశిక్షణను, తర్ఫీదును పొందినవారుగా వుండాలి.

కేడర్ల (కార్యకర్తల) పాలసీ విషయంలో, కామ్రేడ్ మావోసీయాంగ్ కేంద్రకమిటీయొక్క ఆరవ విస్తృత సమావేశంలో మనకు యిలా చెప్పేడు:-

"ఇతర విషయాలతోపాటు మన కేడర్ల పాలసీపట్ల ప్రమాణాలేమంటే, పార్టీపంథాను పట్టుదలతో కొనసాగించటం, ప్రజలతో అత్యంత సన్నిహితమైన సంబంధాలను కలిగియుండటం, స్వతంత్రంగా పనిచేయగలిగిన సామర్థ్యాన్ని కలిగియుండటం, పనిలో అభిరుచిచూపటం, స్వార్థరహితంగా వుండటం యనేవి."

క్లుప్తంగా చెప్పాలంటే వుత్తమకార్యకర్త లెవరంటే, ప్రజానీకానికి వుత్తమంగా సేవచేయగలిగినవారు.

పై నుదహరింపబడిన ప్రమాణాలన్నీ సత్యమైనవని మన కామ్రేడ్స్ అందరికీ తెలుసు, అయినను యితర ప్రమాణాలను ముందుకు తీసుకొనివచ్చిన కామ్రేడ్సు కొంతమంది వున్నారు కార్యకర్తలను ఎన్నుకొనుటలోనూ, వారిని పై స్థానాలకు పంపుటల్లోనూ, కార్యకర్తయొక్క స్థాయి, విద్య వగైరా అర్హతలను ప్రధానమైనవానిగా చూడాలని వారు సలహాయిస్తున్నారు. అతడు కర్తవ్యనిర్వహణకు అర్హుడైనా, కాకపోయినా, చదవటం, వ్రాయటం, మాట్లాడటంలో సామర్థ్యం గలిగినవాడైతే ఆ కార్యకర్తను ఎన్నుకోవచ్చునని భావించేవారు కూడా వున్నారు. ఇతర ప్రమాణాలు, అంథ

విధేయత, వ్యక్తిగత సంబంధాలనేవి. కేడర్ల ఎన్నికకు ప్రమోటు చేయుటకు యీ ప్రమాణాలన్నీ అపసవ్యమైనవనుట సుస్పష్టం.

అయితే, మనం కార్యకర్తలను మదింపు వేసేదెలా?

రెండు పంథాలననుసరించి చేయాలి. మొదటిదేమంటే, పార్టీనాయకత్వం, కార్యకర్తయొక్క సమర్థతలను, పరిమితులను, అతని సుగుణాలను, లోట్లనూ, అతని వ్యక్తిగత చరిత్ర యావత్తునూ, పనినీ, శల్యపరీక్ష చేయాలి. కార్యకర్త పనిజేసే ప్రదేశంలోనూ, అతని నాయకత్వం క్రింద పనిజేస్తున్న వారి ద్వారానూ, అతనిని పరీక్షించాలి. కార్యకర్తనుగురించి సవ్యంగానూ, పరిపూర్ణంగానూ అంచనా వేయాలన్నా, యీ విషయంలో సంభవించే పెడమార్గాలను త్రొక్కకుండా వుండాలన్నా, పై రెండింటినీ సమ్మిళితం జేయుటం ఒక్కటే మార్గం.

పై వారుమాత్రమే కార్యకర్తలను పరీక్షించాలని, కొంతమంది కామ్రేడ్సు అభిప్రాయపడుతున్నారు. మరియొక విధంగా చెప్పాలంటే, పై అభిప్రాయానికి అర్థమేమంటే, క్రిందివారు తమపనిపై యిచ్చిన రిపోర్టులననుసరించి, పై వారు మాత్రమే క్రిందివారిని పరీక్షించాలని. ఈ అభిప్రాయం సవ్యమైనదిగాదు. అలాంటి పరీక్ష అవసరమనేమాట యదార్థం; కార్యసాధక మార్గాలలో ఒకటి. కాని, అది పరిపూర్ణమైనది గాదు; అంటే, అదిపరిపూర్ణ పరీక్షా పద్ధతిగాదు. కార్యకర్తలు క్రిందినుంచికూడా పరీక్షించబడాలి, దీనికర్థమేమంటే, నాయకత్వంవహించే కార్యకర్తలు ప్రజలచే, తామెవరిని నడుపు

తున్నారో ఆ ప్రజలచే పరీక్షించబడాలి. ఇది అత్యంత ఫల ప్రదక మార్గం.

కార్యకర్తలను, ప్రజానీకము, పార్టీసభ్యులు పరీక్షించుటకు, ఎన్నికచేయుటకు పైస్థానానికి పంపుటకు తీసుకొనవలసిన చర్యలకు వలసిననియమాలను పార్టీనియమావళి యేర్పరచింది. దీనిలో వివిధపార్టీ మీటింగులలోనూ, కాన్ఫరెన్సులలోనూ, కాంగ్రెసులలోనూ తమపనిపై నాయకులు యిచ్చే రిపోర్టులను వినుటద్వారాను, వారిలోట్లను విమర్శించుటద్వారాను నాయకత్వ సంఘాలను ఎన్నుకొనుట ద్వారాను, పార్టీనాయకులను, పార్టీసభ్యులు పరీక్షించుట యనేది యిమిడివుంది. పార్టీ నియమావళిలో సూచించబడిన కేంద్రీకృతప్రజాస్వామ్యసూత్రాన్ని పార్టీలో అత్యంతఫలసాధకంగా అమలుజరుపాలి. ఎన్నికల పద్ధతిద్వారా పార్టీయంత్రాన్ని స్థాపించటం, కాండిడేట్లను నామినేట్ చేసే, విసర్జించేహక్కు, విమర్శ, ఆత్మవిమర్శ స్వాతంత్ర్యం – వీటన్నింటినీ అత్యంతఫలసాధకంగా కొనసాగించాలి.

పైనుండి క్రిందకు, క్రిందనుండి పైకి కార్యకర్తలను మదింపువేయుటం, ఎన్నుకోవటం, పై స్థానానికి ప్రమోట్ చేయటం, యనుపద్ధతి యీ విషయంలో సవ్యఫలితాలను యివ్వగలదని విశ్వసిస్తున్నాం. పార్టీయొక్క నాయకత్వసంఘాలన్నీ ఎన్నికల పద్ధతిద్వారానే స్థాపింపబడాలనీ, వున్నతపార్టీ కమిటీలచే ఆమోదించబడాలనీ పార్టీనియమావళిలో ఎందుకు వ్రాయబడిందో పైది వివరిస్తూవుంది.

తమ స్వంతజిల్లాలలో బాధ్యతగల కార్యక్రమాన్ని

సాగించుటకు, స్థానిక కార్యకర్తలను, ఎన్నుకోవటం, ప్రమోట్ జేయుటం, పెంపొందించటం, అందులో ప్రత్యేకంగా సైనిక కార్యకర్మీమాసికై స్థానిక కార్యకర్తలను పెంపొందించటంయనే పనిపట్ల చాలా జిల్లాలలో ఆయా పార్టీసంఘాలు యింకనూ తగినంత శ్రద్ధను జూపుటలేదు. వుదాహరణకు, 1943 సంవత్సరం తైపేకు సంబంధించిన సమాచారాన్ని బట్టి, తైపేలోని, ఎనిమిది రీజియన్ పార్టీ కమిటీలయొక్క 37 మంది కార్యకర్తలలోనూ 9 మంది మాత్రమే స్థానిక కార్యకర్తలు (మొత్తంలో 26 %), బయటనుండి వచ్చిన కార్యకర్తలు 28 మంది (మొత్తంలో 74 %). తైయుహేలోని నాలుగు రీజియన్‌పార్టీ కమిటీల కంట్రోలు క్రిందనున్న కౌంటీ కమిటీలకు జెందిన 37 మంది కార్యకర్తలలోనూ, యీ కౌంటీల నుండి వచ్చినవారు 6 మంది (16 %) మాత్రమే, బయట నుండి వచ్చినవారు 31 మంది (84 %) అన్నమాట. తైహాంగ్ లోని, ఆరు రీజియన్ కమిటీల కంట్రోలు క్రిందనున్న అయిదు కౌంటీ పార్టీ కమిటీలకు జెందిన 18 మంది కార్యకర్తల లోనూ, స్థానిక కార్యకర్తల సంఖ్య అయిదు (27 %) మాత్రమే, బయటివారి సంఖ్య 13 (72% ) అన్నమాట.

కౌంటీ కమిటీలలోగానీ, రీజయన్ కమిటీలలోగానీ స్థానిక కార్యకర్తలకు సరిగా స్థానాలివ్వబడుట లేదనీ, యిక పార్టీయొక్క వున్నత నాయకత్వ సంఘాలలో అసలే లేదనీ, పై లెక్కలనుబట్టి తేలుతూ వుంది.

తైహాంగ్ రీజియన్‌పార్టీ కమిటీనుండి యిటీవల వచ్చిన రిపోర్టులనుబట్టి, వివిధస్థాయిలకు జెందిన, వివిధ రంగాలలో

పనిజేసే కార్యకర్తల సంఖ్య 5000; ఇందులో స్థానిక కార్యకర్తల సంఖ్య 80%, బయటి కార్యకర్తల సంఖ్య 20%; దీనినిబట్టి, 1943 సంవత్సరపు లెక్కలతో పోల్చి జూస్తే స్థానిక కార్యకర్తలసంఖ్య పెరిగింది. కాని, నాయకత్వ సంఘా లనేకంలో బాధ్యతాయుత స్థానాలలోనున్న కార్యకర్తలలో బయటనుండి వచ్చినవారిదే మెజారిటీగా యింకనూవుంది. కార్యకర్తల పంపకంలో అందులో ప్రత్యేకంగా బాధ్యతాయుతమైన కార్యక్రమాన్ని సాగించుటకై కార్యకర్తలను తమతమ స్వంత కౌంటీలలోనూ, లేక ప్రాంతాలలోనూ పనిచేయుటకై పంపుటకుబదులుగా వారిని తరచుగా బయటిప్రదేశాలకు పంపటం జరుగుతూవుంది. అందువలన బాధ్యతాయుత స్థానాలలోనున్న బయటి కార్యకర్తలపై భారాధిక్యమవుచున్నది. ఈ పరిస్థితిని ఫలసాధకంగా, తీవ్రంగా మార్పుజేయాలి. ఇతర విప్లవాత్మక స్థావరాలనేకంలోకూడ స్థానిక కార్యకర్తల పరిస్థితులు యిలాగేవున్నాయ్.

క్రింది పార్టీకమిటీల బాధ్యతాయుత స్థానాలకు మెంబర్లను నిరంకుశంగా నియోగించటం, క్రింది పార్టీకమిటీల కార్యకర్తలను ఆకస్మికంగా ట్రాన్సుఫరుచేయుటం, "ప్రభుత్వ దూతలను" పంపటంలాంటి ఆచరణలు కొన్నిప్రాంతాలలో పార్టీ సంఘాలలో యీనాటికి అమలుజోవున్నాయ్. వుదాహరణకు దక్షిణ హూపేనుండివచ్చిన రిపోర్టులను చూద్దాం. రీజియన్ పార్టీ సెక్రటరీలు ఏడు సంవత్సరాలకాలంలో ఆరుసార్లు ఒకచోటనుండి మరియొకచోటికి ట్రాన్సుఫరు చేయబడ్డారు. కనీసంగా అయిదుసార్లు అయినా ట్రాన్సుఫరు చేయబడ్డారు.

కౌంటీపార్టీ సెక్రటరీలు, అయిదుసార్లనుండి పదమూడుసార్లు వరకు బదిలీచేయబడ్డారు. కామ్రేడ్ లియూ హుంగ్ ఫాన్, నాల్గవ రీజియన్ పార్టీకమిటీకి సెక్రటరీ; ఇతడు ఆరుసంవత్సరాల కాలంలో కౌంటీ పార్టీకమిటీలకు ఎనిమిదిమార్లు సెక్రటరీ గిరిని తీసుకున్నాడు. క్రిందికమిటీల కార్యకర్తలను ఆవిధంగా ఆకస్మికంగా బదిలీచేయుటమనే దానిని ఆపివేయాలి.

కొత్తగా విప్లవం వైపునకు వచ్చిన ప్రాంతాలలో కార్యక్రమాన్ని నడిపించుటకు బయటి కార్యకర్తలను సాధారణంగా పంపాల్సివస్తూవుటుంది. కాని అలా పంపేటప్పుడు ఆ ప్రాంతవాసులనే పంపుటకు యత్నించాలి. బయటిప్రదేశాలకు జెందిన కార్యకర్తలను పంపేటప్పుడు స్థానికకర్తలకు దిక్సూచకులుగా మాత్రమే వ్యవహరించాలనీ, అన్నివిధాలా వారు స్థానిక కార్యకర్తలకు సహాయంజేయాలనీ, స్థానిక కార్యకర్తలకు పనినంతను వప్పగింతపెట్టుటకుగాను వారిని బయటి కార్యకర్తలు తయారుచేయాలన్న విషయాన్ని బయటి కార్యకర్తలకు చెప్పిపంపాలి. బయటి కార్యకర్తలు ప్రతివిషయాన్ని స్థానిక కార్యకర్తలతో నిమిత్తంలేకుండా స్వంతంగా జేయుటగానీ, పనిలో పాల్గొనే అవకాశం స్థానిక కార్యకర్తలకు లేకుండా చేయుటగానీ చేయరాదు.

ఇదివరకే స్థానిక కార్యకర్తలూ, నాయకత్వ సంఘాలు, యేర్పడియున్న యేరియాలకు, బయటనుండి కార్యకర్తలను పంపరాదు. అలా పంపాల్సివస్తే, అలా పంపబడే వారికి, తాము, ఆనాటికే అమలులోనున్న నాయకత్వ సంఘాలు, కార్యకర్తల నాయకత్వంక్రింద స్థానిక పరిస్థితులను

గురించి నేర్చుకోవాలనీ, అధ్యయనం చేయాలనీ, శ్రద్ధాయుతంగా పనిజేయాలనీ, అక్కడ యిదివరకే వున్న కార్యకర్తలకు తోడ్పడాలనీ, నొక్కిజెప్పి పంపాలి. లార్డుల లాగున తాము అధికారం చెలాయించరాదని, బయటినుండి పంపబడే కార్యకర్తలకు చెప్పి పంపించాలి.

క్రిందిపార్టీ సంఘాలకు యిన్‌స్పెక్టర్లను వున్నత కమిటీలు పంపేటప్పుడు, అమితజాగ్రత వహించాలి. తాము "ప్రభుత్వ దూతలు"గా వ్యవహరించరాదని వారిని హెచ్చరించాలి. క్లుప్తంగా జెప్పాలంటే, గతంలో మాదిరిగా ఆజ్ఞలు జారీ చేయుట ద్వారా పనిచేసే అలవాటును పూర్తిగా మార్చి వేయాలి.

స్థానిక కార్యకర్తలను ఎన్నికచేయుటం, పెంపొందింటం ప్రమోట్‌చేయుటం అను విషయాలపై మనపార్టీ ప్రత్యేకం నొక్కి వక్కాణించుటలో గల ప్రాధాన్యతను పార్టీమెంబర్లు అందరూ గుర్తించాలి. అంటే యిది కేవలం కార్యకర్తలసమస్య మాత్రమేగాదనీ, పార్టీకీ, ప్రజానీకానికీమధ్య సంబంధాలను స్థాపించుటకు సంబంధించిన తీవ్రవిషయమనీ పార్టీ సభ్యులందరూ గుర్తించాలి. బయటినుండి వచ్చిన కార్యకర్తలు కూడా ప్రజలతో సంబంధాలు పెట్టుకోవాలి. ప్రజలలో పాతుకొనిపోవాలి. కాని అలాంటి సంబంధాలను స్థానిక కార్యకర్తల ద్వారానే పెట్టుకోగల్గుతారు. స్థానిక ప్రజలనుండి అత్యుత్తమమైన స్థానిక కార్యకర్తలను అసంఖ్యాకంగా పెంపొందించుట ద్వారానే వారు ప్రజలలో పాతుకొనగల్గుతారు. స్థానిక కార్యకర్తలనుండి వేరుపడటమంటే స్థానిక ప్రజలనుండి వేరుపడట

మన్నమాట. స్థానిక కార్యకర్తలపట్ల గౌరవం లేకపోవటం, లేక వారిపట్ల అసహ్యంగా ప్రవర్తించటమంటే పార్టీని అగౌరవపరచటం పార్టీపట్ల అసహ్యముగా ప్రవర్తించటమేయని అర్థం. అంతేగాక తన్నుతాను అగౌరవపరచుకోవటం, ప్రజలతో తన సంబంధాలను అగౌరవపరచుట యన్నమాట. స్థానిక ప్రజానీకంతో అత్యంత సన్నిహితసంబంధాలు స్థాపించుటకు కీలకమేమంటే స్థానిక కార్యకర్తలకు బయటినుండి వచ్చిన కార్యకర్తలకు మధ్య ప్రశాంతమైన సంబాధాలను నిర్మించటం బయటినుండివచ్చిన కార్యకర్తలు స్థానిక కార్యకర్తలలోని మెజారిటీనుండి దీక్షాయుతమైన సపోర్టును సంపాదించటంయనేవేయని అనుభవంవల్ల తేలుతూవుంది. ఒకానొక ప్రదేశంలో మన పార్టీపనికి ప్రధానమైన కొలతబద్దయేమంటే ఆ ప్రదేశంలోని ప్రజలనుండి చెప్పుకోదగినంతమంది చాలినంత మంచి కార్యకర్తలనూ, నాయకులను పెంపొందించగలిగామాలేదా యనేదే.

స్థానిక కార్యకర్తలకు పార్టీవిలువనిచ్చే దెందుకంటే ప్రజానీకంతో దాని సంబంధాలకు గురుతరప్రాధాన్యమిస్తుంది. స్థానిక కార్యకర్తలుగదాయని నెత్తినిబెట్టుకోము. బయటినుండి వచ్చిన కార్యకర్తలుగదాయని తక్కువచూపు చూడదు. కాకలుదీరి యుండుటచే అమిత అనుభవం గడించిన వారగుటచే దేశంలో యే ప్రాంతములోనైనా సరే పనిచేయుటకు సమర్థతగలిగిన కార్యకర్తలు అసంఖ్యాకంగా మనపార్టీకి వున్నారు. వీరు మనపార్టీకి అమూల్యమైన ఆస్థులు. ఏమైనప్పటికినీ, అసంఖ్యాకమైన స్థానిక కార్యకర్తల సహకారంలేని

పై నుదహరింపబడిన వుత్తమ కార్యకర్తలుమాత్రం ప్రతి ప్రదేశంలో వున్నా లేక ఆ కార్యకర్తలు, స్థానిక కార్యకర్త లను పెంపొందించులే, ఎన్నుకొని ప్రమోట్ చేయలేక పోయినా, వారెక్కడికివెళ్ళినా ఆ ప్రదేశాలలోని స్థానిక కార్య కర్తల మెజారిటీతో మంచి సంబంధాలను స్థాపించుకొనలేక పోయినా, మన పార్టీ ఆశయం - ప్రజల ఆశయం - అభివృద్ధి గాదు, విజయవంత మవ్వదనుట ఖచ్చితం.

తద్భిన్నంగా బయటినుండి వచ్చిన కార్యకర్తలు, స్థానిక కార్యకర్తలతోనూ, ప్రజానీకంతోనూ, ప్రతితావు లోనూ మంచి సంబంధాలను స్థాపించగలిగితే మనం పురోగ మిస్తామనుట, విజయాన్ని సాధిస్తామనుట తథ్యం. సమస్య యొక్క సారం యిందులోనే వుంది. స్థానిక కార్యకర్తలు ప్రజలతో సంబంధా లేర్పరచుకోవాలనుట యదార్థం. ప్రజల నుండి వేరుపడేవారికి అసహ్యంగా ప్రవర్తించేవారికి ఏస్థానాన్ని పొందుటకు అర్హులుగారు. బయటినుండి వచ్చిన కార్యకర్త లను విసర్జించుటకుబదులుగా స్థానిక కార్యకర్తలు, వారినుండి నేర్చుకోవాలి. కాని స్థానిక కార్యకర్తలను గౌరవించటం, పెంపొందించటం వారికి సహాయపడటం, బయటి కార్యకర్తల విధి.

కొన్ని సమయాలలో మనపార్టీ ఒకటి లేక అనేక రకాల కార్యకర్తలను పెంపొందించ వలసిందిగా నొక్కిచెపు తుందంటే, దానికి రాజకీయ కారణాలే, భౌతిక పరిస్థితులు కోరేదానిని యేర్పరచుకొనుటకేయని, మరితరకారణాలేమీ లేవనీ, అర్థం జేసుకోవాలి. అలాంటి కార్యకర్తలు మిగిలిన

వారికన్న విశిష్టమైనవారనిగానీ, వారంటే పార్టీకి ప్రత్యేకాభిమానమనిగానీ, అర్థంగాదు. కార్యకర్తల సమస్యను పార్టీ యొక్క కార్యకర్తల పాలసీని కేవలం నిర్మాణ దృష్ట్యా అర్థం జేసుకొనుటకు బదులుగా అందులో మరీ కార్యకర్తల సమస్య దృష్ట్యా మాత్రమే చూచుటకు బదులుగా రాజకీయ దృష్ట్యా అర్థం జేసుకోవాలి.

ప్రజలతో అత్యంత సన్నిహితంగా ముడిపెట్టుకొని వుండే క్రమమైన, స్థిరమైన, పమైక్యమైన, నాయకత్వ అంకురాలను యేర్పాటుచేయటం అత్యంత ప్రధానమైన విషయం. తమకైనందిన కార్యక్రమంలో, పోరాటంలో, ప్రతిప్రదేశానికి ప్రతి డిపార్టుమెంటుకీ అన్ని స్థాయిలకు జెందిన నాయకత్వ సంఘాలు, పార్టీసభ్యులు, నాయకత్వ బీజాలను (స్థావరాలను) యేర్పరచుటకై శ్రద్ధవహించాలి. కాని, అలాంటిది హఠాత్తుగా విడిగా ఒక్కదెబ్బతో ఏర్పరుపబడ జాలదు.

దీర్ఘకాలికపనిద్వారా పోరాటంద్వారా కొన్నివేళలలో బాధాకరమైన భంగపాట్లు, విజయాలమార్గంద్వారా పొరపాట్లు సవరింపులద్వారా చేయాలి. నాయకత్వకేంద్రాలను నిర్మించుటెలాగో, అసమర్థులైనవారిస్థానంలో లేక పనివిధానం పాడుగానున్నవారిస్థానంలో వుత్తమకార్యకర్తలను ఎన్నుకొని ఆ స్థానాలకు వారిని పంపుటెలాగో మనపార్టీయొక్క ప్రతి సంఘం నేర్చాలి, తెలుసుకోవాలి.

బాధ్యతాయుతస్థానాలలోనున్న కార్యకర్తలను బదిలీ చేయటం, పార్టీనాయకత్వసంఘాన్ని దేనినైనాసరే పునర్నిర్మించటం యనువాటిని చేసేటప్పుడు పార్టీకి ప్రజలకు బాధ్యుల

మన్న విషయంగా భావించి చేయాలి. ఈ పని తనదారిని అది పట్టిపోయేలాగునగానీ, బాధ్యతారహితంగాగానీ చేయరాదు. తమ చిత్తమొచ్చినట్లుగా పైపార్టీ సంఘం దాని క్రిందిపార్టీ సంఘాల బాధ్యగల కార్యకర్తలనుబదిలీ చేయరాదు. పార్టీ నియమావళిలో సూచించబడినవిధంగా ఎన్నికలలో కూడా యిష్టమొచ్చినట్లుగా బదిలీలు చేయరాదు. ఇంతకన్న వుత్తమస్థితికి అదిపోగలదని నిశ్చయమైనప్పుడే ప్రజలకు దాని వలన అత్యంతలాభదాయకంగా వుండగలదని నిశ్చయమైనప్పుడే పార్టీయొక్క ఏ నాయకత్వసంఘమైనాసరే పునర్నిర్మించటం మంచిది. అలాంటినమ్మకంలేకపోతే లేక అలాంటి పునర్నిర్మాణంవలన వ్యతిరేకఫలితాలు యేర్పడగలవనుకుంటే పునర్నిర్మాణమంటూ వుండరాదు.

అలాంటి నాయకత్వ సంఘానికి శిక్షణగరవుటలోనూ, సహాయపడుటలోనూ ఆ విధంగా అది కార్యక్రమాచరణలో ప్రజాపోరాటాలలో నేర్చుకొనుటకు సామర్థ్యాన్ని సంపాదించుకొనుటకు ఎంతో సహనంగావుండటం చాలా అవసరం.

తప్పులుజేసిన కార్యకర్తల స్థానములో క్రొత్తవారిని వేయాలి. అయితే అందరినీతొలగించి క్రొత్తవారిని నియమించమనిగాదు. ఎందువల్లనంటే చాలామందివిషయంలో జూస్తే, తప్పులేమీ చేయనివారికంటే వీరు హీనంగాదు. వీరు తమ తప్పులను నిజముగా అర్థంజేసుకొని సవరించుకొంటే ప్రజలకు సేవచేయుటలో బాగా వుపయోగపడుటకు అవకాశంవుంది.

పార్టీ నియమావళిలో సూచించబడినప్రకారం సబ్ డిస్ట్రిక్టు కమిటీలనుండి పై వరకూగల పార్టీ నాయకత్వ

సంఘాలన్నింటినీ రెండేళ్ళ కొకపర్యాయం ఎన్నుకోవాలి. తప్పనిసరియైతేతప్ప అమితంగా తరచుగా ఎన్నికలుజరుపు అలవాటును తప్పించాలి. మరల ఎన్నుకోబడినప్పుడు కార్యకర్తలను వారివారి స్థానాలలో వుండనివ్వాలి. తప్పనిసరియైతే తప్ప వారికన్న మంచికార్యకర్తలను వారిస్థానంలో వేయగలమని రూఢియైతేతప్ప ఎన్నికలలోనైనా కార్యకర్తల బదిలీ చేయటం సమ్మతనీయమైనదిగాదు. క్రొత్తశక్తులను కలుపుకోవాలన్నమాట వాస్తవమే. పార్టీ నాయకత్వ సంఘాలు, పార్టీసభ్యులు యీ యిద్దరూకూడా యీ విషయాన్ని గట్టిగా మనసులోవుంచుకొని జాగ్రితగా అత్యంత బాధ్యతాయుతంగా వ్యవహరించాలి. అలాచేసినప్పుడే ప్రజా ఆశయాలకి లాభదాయక మవుతుంది.

పార్టీ కార్యకర్తలకు శిక్షణ గరపుటలో చెప్పుకోదగినంతగా ఫలితాలను సాధించాం; అయితే దీనిపై మనమింకా మన దృష్టిని కేంద్రీకరించి పనిజేయాల్సివుంది. పార్టీ మీటింగులలోనూ, పని సమీక్షలోను, పార్టీ పాఠశాలలోనూ, తర్ఫీతుతరగతులలోనూ, మూడు విధానాల సవరింపు వుద్యమంలోనూ, సవ్యమైన విమర్శన ఆత్మవిమర్శనలను అనులుజరిపే విధంగా మన కార్యకర్తలకు శిక్షణ గరపాలి. ప్రజానీకంతో ప్రత్యక్ష సంబంధాన్ని కలిగియుంటారు కాబట్టి పార్టీ పాలసీలను నిర్ణయాలను కొనసాగించుటకు వారుకార్యనిర్వాహకులుగాబట్టి సబ్ డిస్ట్రిక్టు, గ్రామీణ కార్యకర్తలకు శిక్షణగరపుటకు ప్రత్యేకశ్రద్ధను వహించాలి. సాధారణంగా చెప్పాలంటే యీ కార్యకర్తలకు, నాయకత్వ సంఘాలనేకం, శిక్షణ యివ్వలేదు.

అందువలన యీ కార్యకర్తల శిక్షణ గరవుటను, క్రమ బద్ధంగాను, విస్తారంగాను చేయాలి. ఈ కార్యకర్తలకు సమగ్రమైన ప్రజాపంథాగానీ, పని విధానంగానీ లేకపోయినా పార్టీ పాలసీలను సరిగా అర్థం జేసుకోలేకపోయినా మనపార్టీ పాలసీలలో యే ఒక్కటికూడా గ్రామాలలోని ప్రజలలో సంతృప్తికరంగా కొనసాగింప బడజాలదు.

ప్రజా ఆశయానికి సంబంధించిన వివిధరంగాలలో యిటీవలకాలంలో పార్టీయేతర కార్యకర్తలను పార్టీలోనికి తీసుకోవటం, ప్రమోట్ చేయటంలోనూ కమ్యూనిస్టు కార్యకర్తలు, పార్టీయేతర కార్యకర్తలమధ్య సహకార, సమైక్యతలను నెలకొల్పటంలోనూ చెప్పుకోనదగిన అభివృద్ధినీ, ఫలితాలనూ సాధించగలిగినప్పటికినీ యింకా చేయవలసింది చాలా వుంది. ప్రజాసేవలో తెలివితేటలు గలిగియున్న వివిధరకాలకు జెందిన పార్టీయేతర కార్యకర్తలను పార్టీలోనికి లాక్కొనటంలో తీవ్రకృషి లేకపోవటమనే లోట్లు, పార్టీయేతర కార్యకర్తలతో కలసిపనిచేయుటకు కావలసిన నైపుణ్యం లేకపోవటమనే లోటు, వారికివారి పనిలో తోడ్పడుట లేకపోవుటయనే లోటు అంతేగాక కొంతమంది కామ్రేడ్సులో కనిపించినట్లుగా పనివిధానాలలో పాక్షిక, గుత్తాధికార ఏకాకితనాలకు జెందిన ధోరణులనే లోట్లు మన కార్యకర్తలలో యింకా మిగిలివున్నాయ్.

తత్ఫలితంగా కొన్నిప్రదేశాలలో పార్టీయేతర కార్యకర్తలు అనామకస్థానాలలోనే వుండిపోవటం, పనిచేయుటకు వారికేమీ యదార్థాధికారం లేకపోవటం దానితో వారికి

తమ పనిపట్ల అసంతృప్తి కలగటం సంభవిస్తూవుంది. ఈ విషయంలో కమ్యూనిస్టు కార్యకర్తలు తమ్ముదాము తీవ్రంగా పరిశీలించుకోవాలి. పార్టీయేతర కార్యకర్తలను తమలోనికి లాక్కొనుటకు, వారితో సమైక్యతను సాధించుటకు తమ యీ లోట్లను విసర్జించాలి. పార్టీయేతర కేడర్లతో చొరవను ఎలా ప్రకోపింపజేయాలో వారు తమ పనిలో విజయాన్ని సాధించుటకై ఎలాంటివారికి తోడ్పడాలో ప్రజాఆశయానికై వారు పాటుపడుటద్వారా తమ గౌరవాన్ని పెంపొందించుటకై వారికెలా తోడ్పడాలో తత్ఫలితంగా ప్రజాసేవను జేయుటకై ప్రజలయొక్క వుత్తమశక్తులను ఆకర్షించేదెలాగో అన్నవిషయాలను కమ్యూనిస్టుకార్యకర్తలు తెలుసుకోవాలి. పార్టీయేతర కార్యకర్తలకు మనతో వారికిగల రాజకీయ భేదాభిప్రాయాలను, పొరపాట్లను గురించి ఎంతో వోపికగా నచ్చజెప్పాలి. ఆవిధంగామాత్రమే చైనాప్రజల ఆశయం విజయవంతం కాగలదు. ప్రజాసేవపట్లను కమ్యూనిస్టుల శ్రద్ధాభక్తులు, స్వార్ధరహితమనేవి వ్యక్తంకాగలవు.

కమ్యూనిస్టుగాని కార్యకర్త కింద కమ్యూనిస్టు కార్యకర్త వొకడు పనిజేస్తున్నప్పుడు, నాయకత్వంపట్ల నమ్రతను జూపుటలోనూ, విధినిర్వాహణలోనూ అతడు ఆదర్శమూర్తిగా వుండాలి. ఈ విషయంలో మన తప్పులను సవరించుకొనుటకు మొట్టమొదట చేయవలసినదేమంటే కమ్యూనిస్టు కేడర్లు తమ పనిని సమీక్షించుకోవటానికి తమలో అనేక మీటింగులు జరుపుకోవాలి; అటుతర్వాత పార్టీయేతర కార్యకర్తలయెదుట ఆత్మ-విమర్శన సాగించాలి; పార్టీకార్యకర్తలపై విమర్శనలు

చేయవలసినదిగా పార్టీయేతరకార్యకర్తలను ప్రోత్సహించాలి. అంటే యిరుపక్షాలకుగల భేదాభిప్రాయాలు తొలగింపబడే టట్లుగానూ, పొరపాట్లు సరిదిద్దబడునంతవరకు ప్రజాసేవకై సమిష్టిఆశయాన్ని కొనసాగించుటకు వలసిన సహకారాన్ని, సమైక్యతను సాధించేవిధంగా యిరుపక్షాలు ఎట్టిదాపరికాలు లేకుండా తమతమ మనసులలో నున్నదానిని బయటపెట్టుటకై సమావేశాన్ని సాగించాలి.

పైన చెప్పబడినవిధంగా కొన్నితావులలో జరుపబడుటచే మంచి ఫలితాలను యిచ్చేయ్. అందువలన వీటిని ప్రతి తావులోనూ తీయకుండా అమలుజరుపాలి. కొన్ని తావులలో పార్టీ కార్యకర్తలకు, పార్టీయేతర కార్యకర్తలకుమధ్య సంబంధాలు పార్టీలోపల వెలుపలకూడా సమీక్షించబడ్డాయ్. పార్టీ లోపల వెలుపలకూడా విమర్శన, ఆత్మవిమర్శనలు అమలు జరుపబడ్డాయ్. తత్ఫలితంగా అలాంటి సంబంధాలలో గొప్ప అభివృద్ధికలిగింది. పార్టీ కార్యకర్తలూ, పార్టీయేతర కార్యకర్తలమధ్యనూ, పార్టీమెంబర్లు పార్టీయేతర ప్రజలమధ్యనూ వుత్తమ సంబంధాలను నెలకొల్పుటకు తగినంత యత్నంతోనూ, మంచి నాయకత్వంతోనూ పైనుదహరింపబడిన చర్యలను పబ్లికు ఆఫీసులలోనూ, బడులలోనూ, ఫ్యాక్టరీల లోనూ, గ్రామాలలోనూ కొనసాగించాలి,

మన పార్టీమెంబర్ల సంఖ్య యితరప్రజలతో పోల్చి జూస్తే అంటే మనతో సహకరించే ప్రజాతంత్ర పార్టీలకు, గ్రూపులకుజెందిన శక్తులతోసహా యితర ప్రజలతో పోల్చి జూస్తే మనపార్టీ సభ్యులసంఖ్య చాలా అల్పం, వారిది మెజా

రిటీ. అందువలన ప్రతి గవర్నమెంటుఆఫీసు, ఆర్మీ యూనిట్, ప్రజాసంఘం, ఆర్థికసంస్థ, ప్రజామోదిత విద్యాసంఘం, పట్నం గానీ, పల్లెగానీ యేదైనాసరే వీటిలోజరిగే పనియంతా మన పార్టీకినీ, పార్టీయేతర ప్రజల మధ్య మిత్రత్వంపై తప్పక ఆధారపడియున్నదని పార్టీ సభ్యు లందరికీ సుస్పష్టంగా జెప్పాలి. ఈ ఆఫీసులూ, సంఘాలూ, సంస్థలూ, కమ్యూనిస్టుల కొరకే యేర్పడ్డాయనీ, అందులో మరెవ్వరికీ స్థానంలేదనీ, భావించటం శుద్ధతప్పు. ప్రజల ఆశయసిద్ధికొరకు జరుపబడే సమిష్టిపోరాటంలో, పార్టీకి వెలుపలనున్న అసంఖ్యాక ప్రజలతో (మెజారిటీగానున్న ప్రజలతో) సమైక్యమవ్వటమే మన పార్టీ కర్తవ్యం. అలాంటి మిత్రత్వానికి సంబంధించిన భావం మన పార్టీ కార్మికుల మనస్సులలో పాతుకొనిపోయిననాడే పార్టీకి, పార్టీయేతరశక్తుల మధ్యనూ ఆరోగ్యప్రదమైన సంబాధాలు స్థాపించబడుతాయ్. పార్టీకి ప్రజలమధ్యను గౌరవ ప్రదమైన హృదయపూర్వకమైన సంబంధాలను స్థాపించుటలో పార్టీ కార్యకర్తలు ప్రజాకార్యకర్తల, పార్టీకి వెలుపలనున్న నాయకులమధ్య స్థిరసంబంధాలను స్థాపించుటయనేది ప్రధానమైన లింకు:

# ఆరవ అధ్యాయం

# పార్టీ మూలసంఘాలు

పార్టీ నియమావళిలో సూచించబడిన ప్రకారం ఉత్పత్తి యూనిట్లు లేక పర్యా-యూనిట్ల ఆధారంపై మనపార్టీయొక్క మూలసంఘం ఏర్పాటు చేయబడుతుంది. సామాజిక శరీరం లోని జీవకణాలలో మన పార్టీసంఘాల ప్రవాహదిని వుంచే మన పార్టీ నిర్మాణసూత్రాలలో యిది యొకటి.

పార్టీ మెంబర్లు ఎంతమంది వున్నాసరే (ముగ్గురునుండి అనేక వేలవరకూ వుండనీ), ప్రతి ఫ్యాక్టరీలోనూ, గనిలోనూ, గ్రామంలోనూ, వ్యాపారసంస్థలోనూ, వీధిలోనూ, ఆఫీసు లోనూ, బడిలోనూ సమైక్యమైనపార్టీ సంఘం ఒక్కటిమాత్రమే వుండాలని మనపార్టీ నియమావళి సూచిస్తూవుంది. ఆ ఫ్యాక్టరీలో, గనిలో, ఆఫీసులో లేక బడిలోని ప్రజలలో పార్టీయొక్క మూలసంఘం కోట యిది. పార్టీ మూలసంఘాన్ని పార్టీశాఖ యని పిలుస్తారు. ప్రత్యేక పరిస్థితులలో దానిని సాధారణశాఖ యనిగానీ లేక ఫ్యాక్టరీశాఖ యనిగానీ, ఆఫీసు లేక బడి యొక్క పార్టీకమిటీయనిగానీ పిలుస్తూ వుంటారు.

మన పార్టీ పనిని సులభంగా సాగించుటకు పార్టీ బ్రాంచికజెందిన సభ్యులను గ్రూపులుగా చేస్తే బాగుంటుంది. కాని అలాంటి గ్రూపులు వహించవలసిన పాత్రను ఎక్కువగా నొక్కరాదు. అంటే శాఖయొక్క కేంద్రీకృత కార్యాచరణకు సాధ్యం కాకపోతే తప్ప, గ్రూపులమధ్య విభజించుటకు బదు

లుగా పార్టి బ్రాంచి కార్యకలాపాలను సమైక్యం జేయాలి. కేంద్రీకృతం జేయాలి. వుదాహరణకు ఒక ఫ్యాక్టరీ ఆఫీసు, లేక స్కూలుపార్టీ శాఖ 30, 40 మెంబర్లతో అత్యంత సన్నిహితంగా అల్లబడి యుంటుంది. పార్టీ బ్రాంచికమిటీ చర్చలను జరుపుటకు సమస్యలను పరిష్కరించుటకు అధ్యయన తరగతులను నడుపుటకు పార్టీ మెంబర్ల మీటింగులను జరుపాలి. పార్టీ బ్రాంచియొక్క సాధారణసభ్యుల సమావేశం జరిగినతర్వాత గ్రూపుమీటింగులు జరుప నవసరంలేదు. పార్టి బ్రాంచిమీటింగులు తీయకుండా జరుగుతున్నప్పుడు గ్రూపులు తీయకుండా సమావేశ మవుటకు బదులుగా అవసర సమయాలలోనే సమావేశ మవుతాయి. పార్టియొక్క యదార్థ మూల సంఘాలుగా గ్రూపులను భావించరాదు. పార్టి బ్రాంచీలను అప్రధాన స్థాయికి దించివేయటంగానీ, బ్రాంచి కమిటీలను పార్టి మెంబర్ల పనికి ప్రత్యక్షంగా దిక్సూచికం చేస్తున్న నాయకత్వ సంఘంగా వుంచుటకు బదులుగా వున్నత నాయకత్వ సంఘస్థాయికి లేవనెత్తుటగానీ, లేక గ్రూపుల రూపంలో మధ్యస్థ సంఘాన్ని ఒకదానిని ఏర్పాటుజేసి దానికి (పార్టి బ్రాంచికి) పార్టి సభ్యుల తోసంబంధం లేకుండా చేయుటగాని చేయరాదు. మనం దైనందిన కార్యక్రమాన్ని సాగిస్తున్నప్పుడు గ్రూపులను పార్టి మూలసంఘాలుగా పొరపాటుపడటం యీనాటికేజరిగింది. పార్టి బ్రాంచికమిటీ వేయుటకు యేమీమిగుల్చుకోకుండా, గ్రూపులకు అమితంగాపనిపంచి పెట్టటం జరిగింది. దీనిని సరిదిద్దాలి.

ఒక ఫ్యాక్టరీలోగానీ, బడిలోగానీ, ఆఫీసులోగానీ సాధారణపార్టీ బ్రాంచి లేక పార్టీకమిటీవుంటే అలాంటి

పార్టీకమిటీ అధ్వర్యాన అలాంటి బ్రాంచీలు లేక సాధారణ పార్టీబ్రాంచి అధ్వర్యాన సబ్-బ్రాంచీలు చక్కనిపాత్రను నిర్వహించవచ్చును. పార్టీకమిటీలోగానీ, లేక సాధారణ పార్టీబ్రాంచిలోగాని అలాంటిపనిని కేంద్రీకృతంచేయటం అసౌకర్యం లేక అసాధ్యంకాబట్టి యీ సబ్-బ్రాంచీలకు, బ్రాంచీలకు ఎక్కువపని వప్పగించవచ్చును. వుదాహరణకు క్రొత్తసభ్యునిజేర్చుకోవటం విషయంలో సాధారణపార్టీ, పార్టీ బ్రాంచి ఆమోదాన్ని తీసుకోవటం,సబ్ డిస్ట్రిక్టుకమిటీ బలపరచటం, అవసరమైనమాట యదార్థం. అయినా క్రొత్తసభ్యుని జేర్చుకోవటం యనేది, సబ్-బ్రాంచియొక్క సాధారణసభ్యుల సమావేశం నిర్ణయించవచ్చును. సాధారణపార్టీ బ్రాంచిసమావేశాన్ని జరుపనక్కరలేదు. ఏమైనప్పటికి అలాంటి సాధారణ పార్టీబ్రాంచి లేక పార్టీకమిటీ వుత్పత్తియూనిట్, లేక వర్కుయూనిట్‌లో మూలసంఘంగా వుంటుంది.

ఫ్యాక్టరీ, స్కూలు, ఆఫీసు లేక గ్రామకమిటీలకు క్రొత్త పార్టీ సభ్యుల ప్రవేశాన్ని బలపరచుటకు అధికారమివ్వాలి. దానికి సబ్-డిస్ట్రిక్టుపార్టీ కమిటీతో సమానమైన అధికారముండాలి.

పార్టీ నియమావళిలో సూచించబడినట్లుగా గ్రామీణ జిల్లాలలోని పార్టీ బ్రాంచి సాధారణంగా పరిపాలన గ్రామ కేంద్రంలో స్థాపించబడుతుంది; కాని గ్రామస్థులు సహజ గ్రామాలలో కేంద్రీకృతమై వుంటారు. (కొన్నివూళ్ళకు కలిపి ఒక తాలూకాఆఫీసు వున్నట్లుగానే కొన్ని గ్రామాలకు కలిపి ఒక పారిపాలనగ్రామం వుంటుంది. అలాంటిగ్రామంలో పార్టీ

బ్రాంచివుంటుంది.) అందువలన సహజగ్రామం (అంటే ప్రజలు నివసించే గ్రామమనీ. పరిపాలన సౌకర్యాలకై పార్టీ బ్రాంచి ఏర్పాటుచేయబడిన గ్రామముకాదనీ అర్థం) చెప్పుకోదగిన పాత్రను వహిస్తుంది. దీనిపట్ల మనం ప్రత్యేకశ్రద్ధను వహించాలి. పార్టీయొక్క మూలసంఘాలను ప్రధానంగా సహజ గ్రామాలలోనే స్థాపించాలి. కాని, సహజ గ్రామాల యొక్క జనాభాసంఖ్య ఒకేరకంగా వుండదు. హెచ్చుతగ్గులుగా వుంటుంది. ఆ విధంగా పరిపాలనగ్రామంపై ఆధారితమై ఏర్పాటు చేయబడిన పార్టీ బ్రాంచీక్రిందనున్న సహజగ్రామాలపై ఆధారితమై ఏర్పాటుజేయబడిన పార్టీగ్రూపులు అత్యంత ప్రాధాన్యతగలవి. పార్టీ మూలసంఘాల పాత్రను నిర్వహిస్తాయ్. అలాంటిగ్రూపు ముగ్గురునుండి ఎనిమిదిమంది పార్టీ సభ్యులను మాత్రమే కలిగియున్నప్పటికీనీ దాని పాత్ర పార్టీ మూల సంఘాల పాత్రంత ఘనంగావుంటుంది. అందువలన వీటిపై నొక్కి వక్కాణించాలి. మీటింగులు పెట్టటము, సమస్యలను పరిష్కరించటము. అధ్యయనాన్ని సాగించటము, యిలాంటి కార్యకలాపా లనేకాన్ని నడుపుటకై పార్టీ బ్రాంచిపై భారం వేయుటకు బదులుగా గ్రూపులద్వారా నడిపించాలి. పార్టీ నియమావళి ననుసరించి 50 మందికి పైబడిన పార్టీసభ్యులు, కాండిడేట్ - మెంబర్లు (కాబోయే పార్టీ మెంబర్లు) గల గ్రామములో సాధారణపార్టీ బ్రాంచినీ, దానిక్రింద సబ్ బ్రాంచీలను ఏర్పాటుచేయవచ్చును. ఈ నిబంధన గ్రామీణజిల్లాలోని గ్రామాలు ఒక్కడొకటీ అక్కడొకటీ విసరివేసినట్లుగా వుంటాయి కాబట్టి వాటిని దృష్టిలో పెట్టుకొని ఏర్పరచబడింది.

పెద్దసైజును జెందిన సహజ - గ్రామంలో ఒకపార్టి బ్రాంచినీ, ఒక సాధారణ పార్టిబ్రాంచినీ లేక పట్టణపార్టి కమిటీనిగూడా ఏర్పాటుచేయవచ్చును. అలాంటి పెద్దదైన సహజ - గ్రామంలో పార్టిగూ్రపుల పాత్ర యేమంత పెద్దదిగా వుండదు. అందువలన పార్టిగూ్రపులు అనేక కార్యకలాపాలను కొనసాగించాలన్న విషయం ఎక్కువగా నొక్కరాదు. పార్టి బ్రాంచిపనిపై నొక్కి జెప్పాలి.

పార్టి నిర్మాణసూత్రాలలో గుర్తుంచుకోవలసిన ఒక సూత్రమేమంటే వుత్పత్తియూనిట్లు లేక ప్రజలు తను దృష్టిని కేంద్రీకరించిన పాయింట్లపై ఆధారితమైన పార్టి మూలసంఘాలను, పార్టికోటలను నిర్మించాలి, ఏమైనప్పటికినీ పనికి సౌలభ్యం చేకూరుటకొరకు దానిని ఫలసాధకంగా చేయుటకు పార్టి గూ్రపువుండాలా, బ్రాంచివుండాలా, సాధారణబ్రాంచి వుండాలా, ఫ్యాక్టరీకమిటీవుండాలా లేక పట్టణకమిటీవుండాలా యన్నదానిని యదార్థపరిస్థితులను బట్టి నిర్ణయించాలి.

వివిధ స్థాయీలకు జెందిన గవర్నమెంటు తదితర ఆఫీసుల పార్టి బ్రాంచీలలోని ప్రతిదానిని అదేస్థాయికి జెందిన పార్టి కమిటీయొక్క ప్రత్యక్ష నాయకత్వం క్రింద వుంచాలి. అలాంటి ఆఫీసుబ్రాంచి పార్టి ఫ్రాక్షను స్థానాన్ని తీసుకొనగూడదు. పార్టి నియమావళిలో సూచించబడినట్లుగా, అలాంటి ఒక ఆఫీసులోని పార్టి ఫ్రాక్షనును దానికి సంబంధించిన పార్టి బ్రాంచి నిర్వహించుటకు సాధ్యముగాని ప్రత్యేక కర్తవ్యాలను అక్కడి పార్టి ఫ్రాక్షను కలిగియుండుటచే ఆ ఆఫీసులో బాధ్యతాయుత స్థానాలలోనున్న పార్టి మెంబర్లచే ఆర్గనైజు

చేయబడాలి. పార్టి ఫ్రాక్షను తన కర్తవ్యాలను నిర్వహించ వలసి వచ్చినప్పుడు ఆదేసంస్థలోని పార్టి బ్రాంచిని తన దర్శకత్వం క్రింది వుంచవచ్చును. ఆ సంస్థలోనున్న పార్టి మెంబర్లనందరినీ తన పనిలో తోడ్పడుటకు సమీకరించవచ్చును.

పార్టి బ్రాంచి అంటే ప్రజలలో పనిజేసే పార్టియొక్క వర్కు యూనిట్. ప్రజానీకానికి పార్టి నాయకత్వ సంఘాలకు మధ్య బ్రిడ్జి అది. ఈ రెండింటినీ అది అత్యంత సన్నిహితంగా లింకు చేయాలి. పార్టి నియమావళిలో సూచించబడిన ప్రకారం మన పార్టి నినాదాలను అమలుజరుపుటకు, వున్నతపార్టి సంఘాల నిర్ణయాలను అమలు జరుపుటకు ప్రజానీకంలో పార్టి బ్రాంచి ప్రచారాన్ని నిర్మాణ కార్యక్రమాన్ని సాగించాలి. అది ప్రజల అభిప్రాయాలు, కోర్కెలను ఎప్పటికప్పుడు తెలుసుకొని వాటిని సకాలంలో వున్నతపార్టి సంఘాలకు రిపోర్టు జేయాలి. అది ప్రజా జీవితవిధానంతో సంబంధం పెట్టుకొని తమ సమస్యలను పరిష్కరించుకొనుటకుగాను ప్రజలను ఆర్గనైజు చేయాలి. ప్రజలలో యీ కర్తవ్యాలను నిరంతరం సాగించాలి. వాటిని సిద్ధింపజేయుటకు నిరంతరం పోరాడాలి, అప్పుడు మాత్రమే ప్రజలు, పార్టి, దాని నాయకత్వసంఘాల మధ్య అత్యంత సన్నిహితమైన సంబంధాలు స్థాపించబడగలవు.

విముక్తప్రాంతాలలోని ఫ్యాక్టరీ, ఆఫీసు, స్కూళ్ళలోని పార్టిబ్రాంచి ఆ సంస్థలో ప్రజలను దానిప్లాను పరిపూర్తికి సహాయపడుటకు, ఖాయపరచుటకు దీనికి ఆటంకంగా నున్న వాటిని ఎదుర్కొనుటకు సమీకరించాలి, ఆర్గనైజుచేయాలి.

పార్టి బ్రాంచి, తన సభ్యులచరిత్రనుగురించి రాజకీయ వైఖరి, చైతన్యస్థాయిలనుగురించి లోట్లు, సుగుణాలను గురించి స్పష్టమైన అభిప్రాయం వుండాలి. వారినిగురించి సవ్యమైన అంచనావేయాలి. అది అతని రాజకీయాభిప్రాయాలను గురించి ధోరణినిగురించి తెల్సుకుంటూ వుండాలి. అతడు పార్టియొక్క రాజకీయకార్యకలాపాలలోనూ, చైనావిప్లవోద్యమంలోనూ పాల్గొనేలాగున చేయాలి. ప్రజలలోగానీ, లేక పార్టిలోగానీ దాక్కొనియున్న గూఢచారులను, విచ్ఛిన్నకులను కనిపెట్టుట కొరకు బాధ్యతను తీసుకొని ప్రజలసహకారంతో వారిని పసికట్టాలి.

పార్టినియమావళిలో సూచించబడినవిధంగా తన సభ్యులలో పార్టిక్రమశిక్షణ అమలుజరుపుట యనేది పార్టి బ్రాంచియొక్క బాధ్యత.

పార్టిమెంబర్లచే అధ్యయనంచేయించటం, అధ్యయన తరగతులను యేర్పాటుచేయటం యనేది పార్టినియమావళి ననుసరించి పార్టిబ్రాంచియొక్క నిరంతర కర్తవ్యం.

పార్టిబ్రాంచి పైకర్తవ్యాలను పనినీ తన వున్నతపార్టి కమిటీ దర్శకత్వంక్రింద ఆమోదంతోనూ సాగిస్తుంది.

బ్రాంచికమిటీ పార్టిబ్రాంచీకి నాయకత్వ సంఘమన్న మాట. యదార్థపరిస్థితుల ననుసరించి వివిధరంగాలలోని కార్యకలాపాలకు బాధ్యతవహిస్తున్న పార్టిమెంబర్లతో బ్రాంచి కమిటీ ఏర్పడాలి. వుదాహరణకు గ్రామాలలో, గవర్నమెంటు లోనూ, సైన్యంలోనూ, ఆర్థిక, సాంస్కృతిక సంస్థలలో పని సే పార్టీమెంబర్లను పార్టికమిటీలోనికి తీసుకోవాలి. వివిధ

రంగాలలో బాధ్యతాయుతులైన కామ్రేడ్సును బ్రాంచీకమిటీ లోనికి తీసుకొన్నప్పుడే యీ కార్యకలాపాలకు పార్టి బ్రాంచి కమిటీ నాయకత్వం వహించగలుగుతుంది. నాయకత్వ కేంద్రంగా తయారు కాగలుగుతుంది.

పార్టీనియమావళిలో సూచించబడినట్లుగా పార్టీబ్రాంచి సెక్రటరీ, పార్టీపని యావత్తుకూ బాధ్యుడు. యితర కమిటీ మెంబర్ల మధ్య శ్రమవిభజన సూత్రాలంటూ లేవు; ప్రతి బ్రాంచికమిటీ తన యదార్థపరిస్థితులకు అనుగుణ్యంగా పనిని విభజించుకోవాలి. పార్టి వ్యవహారాలను చూచుటకు ఒక కమిటీమెంబరుండాలి. బ్రాంచి ఒక పత్రికను ప్రచురించుతున్నపుడు, నిరంతరం ప్రచారంలో నిమగ్నమై వున్నపుడు, పార్టి – ఆంతరంగిక – అధ్యయనతరగతులను సాగించుతూ వున్నప్పుడు కొంతమంది కమిటీసభ్యులు పార్టిప్రచారం అధ్యయనంశాఖల పనినిచూస్తూ వుండాలి. ఇతరవిధులను పరిస్థితుల ననుసరించి వప్పగించవచ్చును.

పార్టీబ్రాంచి యావత్తూ విజయవంతంగా పనిచేయుటకు పార్టి బ్రాంచికమిటీ నాయకత్వం వహించటం, యదార్థ పరిస్థితుల ననుసరించి సరిగా శ్రమవిభజన చేసుకోవటం యనేవి నిర్ణాయక విషయాలు. అందువలన యీ సమస్యపట్ల తగినంత శ్రద్ధవహించాలి.

# ఏడవ అధ్యాయం

## ప్రశంస: క్రమశిక్షణ

మన పార్టీ చాలాకాలంనుండి జాతి మొత్తముమీద అవకాశాలుకలిగిన పార్టీగాను, విశాల ప్రజాస్వభావాన్ని కలిగినపార్టిగాను వుంది. అందులో ప్రత్యేకంగా ఈ నాడలా వుంది. అందువలన క్రమశిక్షణ, అనైక్యత లేక పార్టిలో చీలికలు ఏవైనా ఈనాడు సంభవిస్తే దానివలన చైనా ప్రజా విముక్తి ఆశయానికి తీవ్రమైన దెబ్బతగులుతుంది. అందువలన యావత్తు పార్టియొక్క సమైక్యతను రక్షించటం, బలపరచటం అంతేగాక పార్టి వ్యతిరేకశక్తులకు విచ్ఛిన్నకరమైన, స్వతంత్రమైన ముఠాతత్వాలకు సంబంధించిన వంచనాపూరితమైన కార్యకలాపాలన్నింటిని పార్టి క్రమశిక్షణను భంగపరిచే కార్యకలాపాలన్నింటిని వ్యతిరేకించటం అందరు పార్టిసభ్యుల పార్టిసంఘాల విధియైవున్నది. మరియొకరకంగా చెప్పాలంటే సూత్రంపైగాని లేక పాలసీపైగాని తాత్కాలిక అనంగీకారమేర్పడినప్పటికి పార్టి క్రమశిక్షణను అమలుజరపాలి. పార్టి సమైక్యతను పరిరక్షించాలి. పార్టీ ఐక్యతకు భంగకరమైనట్టి పార్టిలో చీలికలను కలిగించునట్టి కార్యకలాపాలను స్వతంత్రితత్వము, ముఠాతత్వము వంచకత్వములాంటి చెడ్డ విషయాలను సహించరాదు. ఉత్తమపార్టి సమైక్యతా సూత్రాన్ని అమలుజరపాలి. ఒక సూత్రంపైగాని లేక పాలసీపైగాని తాత్కాలిక భేదాభిప్రాయాలు ఏర్పడినంతమాత్రాన పార్టీ

మెంబర్లు పార్టీ విచ్ఛిన్నకులను అనుసరించరాదు. అలాంటి వారికి వ్యతిరేకముగా దృఢమైన, సవ్యమైన పోరాటాన్ని నడు పాలి.

మనది విశాల ప్రజాస్వభావాన్ని కలిగియున్న పార్టీ గనుక పార్టీలో స్తవనీయమైన పని విధానాలను పోటీ ప్రమాణాలను నెలకొల్పుట అత్యవసరము. అందువలన అద్భుతమైన నడతలు కలిగిన పార్టీ మెంబర్లను ప్రశంసించవలసినదిగా పార్టీ నియమావళి సూచిస్తూయుంది. తమ పనిలోగాని లేక శత్రువుల కోర్టును యెదుర్కొనుటలోగాని, లేక శత్రువునకు వ్యతిరేకంగా పోరాడుటలోగాని, లేక పార్టీ అంతరంగిక పోరాటాలలోగాని పార్టీ ఆశయానికై ప్రజాఆశయానికై పరిపూర్ణభక్తి విశ్వాసాలను ప్రకటించిన పార్టీ మెంబరును లేక పార్టీ సంఘాలన్ని ప్రశంసించాలి. పార్టీ కార్యక్రమాన్ని లేక నిర్ణయాలను అమలు జరుపుటలో సృజనాత్మక శక్తిని ప్రదర్శించినటువంటివిన్ని పార్టీ మరియు విప్లవాత్మక ప్రభుత్వాల క్రమశిక్షణను ఆదర్శవంతంగా అమలు జరిపిన పార్టీ మెంబరును లేక పార్టీ సంఘాన్ని ప్రశంసించాలి. పార్టీ యిచ్చినపనులను పూర్తి జెందించుటలో విశిష్ట విజయాన్ని సాధించుతూ తత్ఫలితంగా ప్రజల సపోర్టునుపొందిన పార్టీ మెంబరునుగాని పార్టీ సంఘాన్నిగాని ప్రశంసించాలి. ఈ ప్రశంసను వ్యక్తిగతంగా అందించవచ్చు, బహిరంగంగా ప్రకటించవచ్చు. ఆవిధంగా ప్రశంసించబడిన పార్టీ మెంబరు లేక పార్టీ సంఘముయొక్క రికార్డును, అనుభవాన్ని ప్రకటించవచ్చు. ప్రశంసించుటకు యితర మార్గాలను అవలంబించవచ్చు.

కేంద్రకమిటీ నిర్ణయాన్ని లేక ఉన్నతపార్టీ సంఘాల నిర్ణయాన్ని అమలు జరపనివానికి వ్యతిరేకంగా పార్టీ నియమావళిని వుల్లంఘించిన వారికి వ్యతిరేకంగా లేక పార్టీ క్రమశిక్షను భంగపరచినవారికి వ్యతిరేకంగా చర్యను తీసుకోవాలని పార్టీ నియమావళి సూచిస్తూవుంది. యావత్తు పార్టీ సంఘానికి వర్తనీయమైన క్రమశిక్షణ చర్యలు ఈ క్రింది వాటితో కూడుకొని వుంటాయి. చీవాట్లు పెట్టడం దాని నాయకత్వ సంఘంలో కొంతభాగాన్ని పునర్నిర్మించడం నాయకత్వ సంఘాన్ని రద్దుచేయడం, దాని స్థానంలో తాత్కాలిక నాయకత్వ స్థానాన్ని నియోగించడం యావత్తు సంఘాన్ని రద్దు చేయడం, దాని సభ్యత్వాన్ని మరల రిజిష్టరు చేయడంలాంటి క్రమశిక్షణ చర్యలు, యావత్తు పార్టీసంఘానికి వర్తనీయాలు. ఒక పార్టీ సంఘం యావత్తు లేక దీని నాయకత్వ సంఘం యావత్తు పార్టీ క్రమశిక్షణను భంగపరచినప్పుడు లేక తదితర తీవ్ర తప్పిదాలను చేసినప్పుడు పై చర్యలు తీసుకొన బడుతాయి పార్టీయొక్క వ్యక్తిగత మెంబరునకు వర్తనీయమైన క్రమశిక్షణచర్యలు ఏమంటే చాటుగా పిలచి చీవాట్లు పెట్టడం, లేక హెచ్చరించటం, బహిరంగంగా చీవాట్లుపెట్టడం లేక హెచ్చరించటం, అతడు పనిచేస్తున్న స్థానాన్నుంచి తొలగించడం, అతనిపార్టీసభ్యత్వాన్ని కొంత కాలంపాటు పరీక్షకు గురిచేయుండ అనేవి.

మరల రచించబడిన ప్రస్తుత పార్టీనియమావళిలోని విశిష్టవైఖరులలో యొకటియేమంటే మనపార్టీ క్రమశిక్షణ

చర్యలు గైకొనుటకు వలసిన నిబంధనలనుచేయుటయేగాక ప్రశంసకు సంబంధించిన నిబంధనలనుకూడా చేసింది.

పార్టీనియమావళి ననుసరించి పార్టీనుండి బహిష్కరించుట యనేది పార్టీఆంతరంగిక క్రమశిక్షణచర్యలన్నింటిలో వుచ్ఛమైనది. అలాంటిచర్యను తీసుకొనుటలో అన్నిస్థాయీలాకు చెందినపార్టీసంఘాలు అత్యంత జాగరూకతవహించాలి. పార్టీవెలుపల తీసుకోబడిన క్రమశిక్షణచర్యతో పార్టీఆంతరంగిక క్రమశిక్షణచర్యను కలగాపులంచేసి గందరగోళపడరాదు. పార్టీనుండి బహిష్కరించుటయనేది పార్టీక్రమశిక్షయొక్క తుదిమార్గము. పార్టి యింతకన్న మరేమీచేయజాలదు. ఒక పార్టీమెంబరు ప్రభుత్వన్యాయాలను వుల్లంఘించినప్పుడుఅతనిని ప్రభుత్వమే శిక్షించాలి. పార్టీచే తీసుకొనబడే క్రమశిక్షణ చర్యలు యేవీ ప్రభుత్వశాసనానికి సంబంధించినవిగాను పరిపాలనచర్యలకు సంబంధించినవిగాను వుండరాదు. శాసన రీత్యా చర్యతీసుకోటం లేక పరిపాలనచర్యలను తీసుకోవటం యనేవి ప్రభుత్వానికి చెందినహక్కులు.

ఏ పార్టీమెంబరుపైనైనా, ఒకపార్టి సంఘం క్రమశిక్షణ చర్యను తీసుకోవాలని నిర్ణయించినపుడు ఆ వ్యక్తి తన్ను దాను సమర్థించుకొనుటకుగాను అతనిపై జరిగే వాదాలను వినుటకు సౌకర్య మేర్పరచాలి.

విశిష్ట పరిస్థితులలో మాత్రమే అతని పరోక్షంలో అతనిపై నిర్ణయాలు చేయవచ్చు. అతనిపై క్రమశిక్షణచర్య తీసుకొనబడుటకు గల కారణాలను అతనికి అందజేయాలి. ఈ నిర్ణయానికి అతనికి అభ్యంతరాలుంటే తనపై తీసుకొనబడి

నిర్ణయాన్ని మరల ఆలోచించవలసినదిగా అతడు కోరవచ్చును. ఆ విధంగా అతడు చేసుకొన్న ప్రార్థనను అతనికి సంబంధించిన పార్టీ సంఘం జాగ్రత్తగా ఆలోచించాలి. మరల అతని కేసు పరీక్షించాలి. అతడు తన కేసును వున్నతపార్టీ సంఘానికి అప్పీలు చేసుకొంటానంటే అతనికి సంబంధించిన పార్టీ సంఘం అతనికి సహాయపడాలి. అంతేగాని అతనిఅప్పీలు అణచివేయరాదు.

పార్టి నిర్ణయాలను అమలుజరపనట్టి, పార్టి నియమావళిని వుల్లంఘించినట్టి లేక పార్టి క్రమశిక్షణను భంగపరచినట్టి పార్టి మెంబరులపై క్రమశిక్షణను తీసుకోవాలి అలాంటి పార్టిమెంబర్లపై క్రమశిక్షణ చర్యలు తీసుకొనుటకు అన్ని స్థాయీలకుజెందిన పార్టిసంఘాలకు పరిపూర్ణముగా హక్కులున్నాయి. ఏమైనప్పటికి ప్రతికేసుయొక్క ప్రత్యేక పరిస్థితుల ననుసరించి అలాంటి పార్టి మెంబర్ల తప్పిదాలపై పార్టిసంఘాలు చర్యలు తీసుకోవాలి. తదనుసారముగా నిర్ణయాలు చేయాలి. యిందులో కొంతమంది తప్పులు చేసినవారు పార్టి నియమావళిని లేక పార్టీ క్రమశిక్షణను లేక పార్టిపాలసీని లేక నిర్ణయాలను పూర్తిగా అర్థంచేసుకొనక తప్పులు చేసి యుండవచ్చును. మరికొంతమంది కావాలని చేసియుండవచ్చును. ఈ తప్పులలో కొన్ని వ్యక్తిగతజీవితానికి సంబంధించినవై యుండవచ్చును. పార్టి నియమావళిని, క్రమశిక్షణను, పాలసీని, నిర్ణయాలను ప్రత్యక్షంగా వుల్లంఘించియుండకపోవచ్చును. మరికొన్ని ప్రత్యక్ష వుల్లంఘనకు సంబంధించినవై వుండవచ్చును.

తప్పులు జేసినవారిలో కొందరు విమర్శించబడినప్పుడు

తప్పులేవో తెలియజెప్ప బడునప్పుడు తమ తప్పులను దీక్షా యుతం సవరించుకోవచ్చును; అలా తెలియజెప్పబడినప్పటికీ తమ తప్పులను పట్టుకొని మరికొంతమంది ప్రేళ్లాడుతూ వుండ వచ్చును. అందువలన నిర్ణయాలు జేసేటప్పుడు పార్టీ సంఘాలు గుర్తుంచుకోవాల్సిన పరిస్థితులవి. పార్టీసంఘాలు తప్పులు దిద్దుకొనేవారిపట్ల తేలికగానూ, దిద్దుకొననివారిపట్ల (తప్పులు వప్పుకోనివారిపట్ల) తీవ్రంగానూ వ్యవహరించాలి.

తప్పులు జేసినవారు తమ తప్పులను నిజంగా సరిచేసు కొన్నప్పుడు, నిర్ణయం తప్పని తేలినప్పుడు యదార్థపరిస్థితులతో నిర్ణయం భేదించుచున్నప్పుడు క్రమశిక్షణచర్యను రద్దుచేయాలి.

పార్టీనియమావళిలో సూచించబడిన విధంగా పార్టీ కంట్రోల్ కమిషన్ల విధులేమంటే పార్టీ మెంబర్లపై క్రమ శిక్షణచర్యలను నిర్ణయించటం లేక రద్దుచేయుటం పార్టీ మెంబర్ల కంప్లెయింటులను విచారించటం యనేవి. అవసరమని తోచి నప్పుడు, సాధ్యమైనప్పుడు కేంద్రకమిటీ కమిషన్లను ఏర్పర చాలి. కంట్రోల్ కమిషన్ల నిర్మాణం, కార్యక్రమాలకు సంబంధించిన నిబంధనలనూ, అన్ని స్థాయిలకుజెందిన పార్టీ సంఘాలచే క్రమశిక్షణచర్యలను అమలుజరుపుటకు సంబంధిం చిన నిబంధనలను కేంద్రకమిటీ రూపొందించి ప్రకటించాలి.

ఒక పార్టీమెంబరును ప్రశంసించటంలో గల వుద్దేశ మేమంటే పార్టీమెంబర్లకు శిక్షణ గరపుటకు ప్రజలకు శిక్షణ గరపుటకు, అంతేగాక ప్రశంసించ బడిన కామ్రేడ్‌నకు శిక్షణ గరపుటకు, యేర్పరచబడిందని పార్టీ నియమావళి వివరిస్తూ వుంది. పార్టీలో అద్భుతమైన పని విధానాలను నెలకొల్పుటకు

పోటీ ప్రమాణాలను పార్టీ సభ్యులలో నెలకొల్పుటకు అది లక్షించబడింది. అంతేగాని, పార్టీలో వ్యక్తిగత అహంకారాన్ని ప్రోత్సహించుటకది యేర్పరచబడలేదు. గతంలో జరుపబడిన విప్లవాత్మక పోటీలు, కార్మిక వీరులు మోడల్ వర్కర్ల ఎన్నికకై జరుపబడిన ఉద్యమాలు, కొంతమంది కామ్రేడ్సులో ప్రైజుల కొట్టాలనే భావాలను స్వంతడబ్బా కొట్టుకోవాలనే భావాలను, అహంకారాలను, తల బిరుసుతనాలను జనింపజేసేయి. ఇలాంటివి శుద్ధతప్పు. అందువలన యివి భవిష్యత్తులో సంభవించకుండా చూడాలి.

పార్టీ నియమావళిలో సూచించబడినట్లుగా, పార్టీ మెంబరుపై క్రమశిక్షణ చర్యను తీసుకోవటంలో లక్ష్యమేమంటే పార్టీ మెంబర్లకు ప్రజలకు అంతేగాక క్రమశిక్షణచర్య తీసుకొనబడిన పార్టీ మెంబరుకు శిక్షణ గరపాలనీ అలాంటి పొరపాట్లు చేయరాదని హెచ్చరించుటకు లక్షించబడింది. పార్టీలో ఒక శిక్షాస్మృతిని నెలకొల్పుటకు బదులుగా రోగియొక్క జబ్బును నయంజేసి అతణ్ణి రక్షించటానికై యేర్పాటు చేయబడింది. ఇదెందుకని నొక్కి జెప్పాల్సి వచ్చిందంటే, గతంలో పార్టీ సంఘాలు కొన్ని నిర్మాణ క్రమశిక్షణ చర్యలపైన మాత్రమే నొక్కివక్కాణించాయ్. పొరపాట్లుజేసిన కామ్రేడ్సు సైద్ధాంతికంగానూ, రాజకీయంగాను, తమ తప్పులను దిద్దుకొనుటకు సహాయ పడునట్టి సైద్ధాంతిక, రాజకీయ అధ్యయనాన్ని యివ్వలేకపోయాయి. తత్ఫలితంగా వారు తమ తప్పులను పూర్తిగా తెల్సుకొనలేకపోయారు. సవరించుకొనలేకపోయారు. ఇకనుండి దీనిపై దృష్టిని కేంద్రీకరించాలి. యీ దోషాన్ని నివారించాలి.

## ఎనిమిదవ అధ్యాయం

# పార్టీ కాఠిన్యం, మృదుత్వాలు.

కామ్రేడ్ మావోసీటూంగ్ తన రాజకీయరిపోర్టులో మన పార్టీకినీ, యితర రాజకీయపార్టీలకునూ గల భేదాన్ని ఎత్తి జూపేడు. ఇది చాలా ప్రధానమైనది. ఇతరపార్టీ లన్నింటికినీ భిన్నమైనట్టిన్ని, సిద్ధాంతవిషయాలలో అమితకాఠిన్యాన్ని వహించునట్టి మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీయొకటి లేకుండా 47 కోట్ల 50 లక్షల ప్రజలతో కూడికొనియున్న చైనాజాతి యొక్క మహోదాత్త విప్లవాన్ని విజయంవైపునకు నడుపగల మనటం అనూహ్యమైన విషయం. జపాను దురాక్రమణదారులను పరాజితమొనరించే కాలాన్ని చైనాప్రజలు సమీపిస్తున్నారు; నవచైనా నిర్మాణకాలాన్ని సమీపిస్తున్నారు. మనపార్టీ ఒకవైపున విజయాన్ని సాధించుటకై అన్ని విప్లవ వర్గాలతోనూ, ప్రజాతంత్రపార్టీలతోనూ, దేశంలో నున్న గూపులన్నింటితోనూ ఐక్యతను సాధిచాలి. మరియొకవైపున యితర రాజకీయపార్టీ లన్నింటికన్న తన వైశిష్ట్యాన్ని జూపుటకు తన పార్టీసభ్యుల సంఖ్యను పెంపొందించుకోవాలి. తన సైద్ధాంతిక, రాజకీయ, నిర్మాణాత్మక విషయాలలో కాఠిన్యాన్ని వృద్ధిజేసుకోవాలి. అలా జేసినప్పుడు మాత్రమే మన పార్టీ తన స్వతంత్రాన్ని నిలబెట్టుకోగలదు. ఇతర పార్టీలతో కలగాపులగం గాకుండా వుండగలదు. యితరులు వున్నతస్థాయికి వచ్చుటకు తోడ్పడగలదు. ప్రజలకు నాయకత్వం వహించ గలదు.

మనపార్టి శ్రామికవర్గానికి మార్క్సిస్టు అగ్రగామి దళం. దాని ప్రపంచ దృక్పథం, దాని భావనాపద్ధతులు, గతి తార్కిక, చారిత్రిక భౌతికవాద పద్ధతులు యితర వర్గాలవాటి నుండి భేదిస్తాయి.

ప్రస్తుత చైనా విప్లవంలో మనపార్టి శ్రామికవర్గం యొక్క విప్లవాత్మక డెమాక్రాట్లకు ప్రాతినిధ్యం వహిస్తూ వుంది. ఈ గూ్రపు పెద్ద భూస్వాములు, బడా బూర్జువావర్గం ఉదారవాద బూర్జువావర్గాలను విభిన్నమైనట్టిదేగాక ఎవరి విప్లవ సిద్ధాంతం, విప్లవ పద్ధతులు, విప్లవంయొక్క అంతిమ లక్ష్యం వగైరాలు శ్రామికవర్గ పార్టీ, వాటినుండి విభిన్న మైనట్టివో అట్టి పెటీ బూర్జువా వర్గానికి కూడా విభిన్నమైనట్టిది. పెటీ బూర్జువా వర్గానికి అంతర్గత సమైక్యత లేకపోవుటవల్లనూ, అది వూగిసలాట తత్వాన్ని కలిగియుండుటచేతనూ, సైద్ధాంతిక ఆయుధంగా మార్క్సి జాన్ని కలిగియుండక పోవుటచేతను తన మిత్రులెవరో శత్రువు లెవరో అన్న విషయాన్ని అది తరచుగా కనిపెట్ట లేకపోతూ వుంది. శత్రువును వోడించుటకై విప్లవాత్మక శక్తుల నన్నిం టినీ ఆర్గనైజుచేసే సామర్థ్యం దానికిలేదు. ప్రజల విప్లవ పోరా టాలకు సరియైన నాయకత్వాన్ని యిచ్చే తాహతూ దానికి లేదు. ప్రస్తుత ప్రజాతంత్ర విప్లవంలో మనపార్టీకి పెటీ బూర్జువా వర్గానికిజెందిన విప్లవాత్మక డెమాక్రాట్లకు గల భేదం యిక్కడేవుంది.

నిర్మాణాత్మకంగా మనపార్టీయొక్క ఉక్కులాంటి క్రమశిక్షణ, దాని పరిపూర్ణప్రజాపంథా, ఆత్మ-విమర్శ-

యివన్నీ ప్రజాసేవకై రూపొందించబడ్డాయ్. మనకు తదితర వర్గాలకుగల భేదాన్ని యివి ప్రతిబింబిస్తాయ్. సైద్ధాంతికం గాను, రాజకీయంగానూ యితరవర్గాలనుండి మనలను ప్రత్యేకించుకొన్నప్పుడే శ్రామికవర్గ అగ్రగామిదళంగా తయారుకాగలం, యితరులతో సవ్యంగా సమైక్యమవ్వగలం, వారు పురోగమించుటకు తోడ్పడగలం.

మరియొకవిధంగా చెప్పాలంటే పైదాని కర్థము ఏమంటే మనకు యితరులకుగల భేదాభిప్రాయాలను కనుగొని వాటిపై ఒక ఒప్పందానికి రావాలి. అలా చేయపోతే సరియైన ఒప్పందానికి రాలేము. భేదాభిప్రాయాలేమిటో కనిపెట్టకుండా అంగీకారానికి ప్రాకులాడుటవలన అలాంటి అంగీకారం తప్పు: సరిగాలొంగుబాటుతత్వంలోనికిదారితీస్తుంది. మనము సూచించేభేదాభిప్రాయాలు పాక్షికస్వభావానికి జెందినవికావు. మనం యదార్థంగా ప్రజాతంత్రవర్గాలను, గ్రూపులన్నింటినీ సమీకరించాలంటే, అలాంటి మార్క్సిస్టు సరిహద్దు రేఖ అత్యవసరము. ఇతరవర్గాలనుండి కాక, తనవర్గంలోని ప్రజలనుండికూడ శ్రామికవర్గ అగ్రగామిదళం విభిన్నమైనదిగా వుండాలి,

మరియొకవిధంగా చెప్పాలంటే మనపార్టీసభ్యులకు - శ్రామిక వర్గంయొక్క- పురోగామికి యోధులకు - సమ్మెజేసే కార్మికులకు లేక కౌలు, వడ్డీ తగ్గించవలసినదిగా డిమాండుచేసే సాధారణరైతులకు మధ్య భేదముండాలి. కార్మికసంఘాలకును మనపార్టీకిని భేదముండాలి. పార్టీలోపలకూడ యిదేవర్తిస్తుంది. అవకాశవాదము, శ్రామికవర్గేతరభావాలు, ప్రతిపాదనలు

పార్టిలో అగుపించినపుడు మనపార్టి మెంబర్లు సవ్యమేదో, అపసవ్యమేదో గుర్తుపెరగారాలి. అలాంటివిషయాలకునుతమకు మధ్య సరిహద్దు నిర్ణయంచేసుకోవాలి. సైద్ధాంతికంగాను, రాజకీయంగాను, నిర్మాణాత్మకంగానూ ఇతరవర్గాలన్నింటి యొక్క శక్తులనుండి అందులో ప్రత్యేకంగా మనపార్టిలో ప్రతిబింబించిన పెట్టీ-బూర్జువా విప్లవవాదసిద్ధాంతమునుండి వేరుపడివున్నప్పుడే వారు శ్రామికవర్గంయొక్క చైతన్యయుత పురోగామికయోధులుగా తయారుకాగలరు. యితరులను సంస్కరింపగలరు. ఇతరులు పురోగమించుటకు సహాయపడ గలరు. సూత్రం విషయంలో మనపార్టీయొక్క కాఠిన్యతను యిది ఏర్పరుచుతుంది.

మనపార్టీ పుట్టిననాటినుండి ఒక తీవ్రపార్టీ గా ఎల్లప్పుడు వుంది. అందువల్లనే చైనాప్రజావిప్లవంలో అది తన కర్తవ్యాలను పరిపూర్తి జెందించుకో గలిగింది. ప్రస్తుతదశలో సత్వర కర్తవ్యాలు ఎన్నో ఎదుర్కొంటున్నాయి. అందువలన పూర్వంకన్న అత్యంతఘనంగాను, అత్యంతక్లిష్టంగాను, వుండు నట్టి భవిష్యత్ లోని విప్లవాత్మక కర్తవ్యాలను పరిపూర్తి చెందించ గల్గుటకుగాను మనపార్టీ తన కాఠిన్యాన్ని మరింతగా పెంపొందించుకోవటం చాలా అవసరం. ఆవిధంగా, అత్యుత్తమస్థాయికి చెందిన కాఠిన్యంగలదిగా ప్రస్తుతం మరల రచింపబడిన పార్టినియమావళి వ్యక్తమవుతూవుంది. పార్టి సత్వరకర్తవ్యాలు, పరిస్థితులు మనమావిధంగా వుండాలని డిమాండు జేస్తున్నాయి. మనపార్టి సిద్ధాంత విషయాలలో కాఠిన్యాన్ని వహించాలి. ప్రత్యేక కర్తవ్యాలకు ఈ సూత్రా

లను అనువర్తించుటలో వృత్తమస్థాయికిచెందిన నృదుత్వాన్ని కలిగియుండాలి. శ్రామికవర్గ అగ్రగామిదళం మృదుత్వాన్ని కలిగియుండాలి. ఎందువలనంటే తన వర్గానికిచెందిన ప్రజలతోను, అన్నిరకాల శ్రమజీవులతోను అది అత్యంత సన్నిహిత సంబంధాలను స్థాపించుకోవాలి. అన్ని విప్లవాత్మక వర్గాలతోను, పార్టీలతోను, గ్రూపులతోను విప్లవాత్మక మిత్రత్వాన్ని ఏర్పరచుకోవాలి. అంతేగాక విప్లవాత్మక కార్యకలాపాలలో అసంఖ్యాక ప్రజానీకంతోనూ, అవసరమైన మిత్రులతోను చేతులు గలిపి పురోగమించాల్సివుంది. పురోగమించుటకుగాను నిర్ణీతపరిస్థితులలో అది తన మిత్రులకు, అనుయాయులకు స్పష్టమైన, లాభదాయకమైన సౌకర్యాల నెలాకల్పించాలో రాజీలనెలా చేసుకోవాలో తెల్సుకోవాలి. అంతేగాక కాలాన్ని గుర్తించుటెలాగో తెల్సుకోవాలి. విప్లవక్రమంలో వచ్చే ఆటంకాల నన్నింటిని తప్పించుకోవాలి; ప్రజానీకం యొక్క మౌలిక పాక్షిక ప్రయోజనాలను సహకరింపజేసుకొనడమెలాగో యన్నది, పోరాటం నిర్మాణాలయొక్క వివిధ రూపాలను సహకరింపజేయుట మెలాగో తెల్సుకోవాలి. మరియొకవిధంగా జెప్పాలంటే సిద్ధాంత విషయాలలో కాఠిన్యాన్ని పాక్షికతత్వంగాను, అహంకారంగాను గందరగోళపరచరాదు. అలా చేసినప్పుడే మనం యితరులను నడపగలం. యితరులు పురోగమించుటకు సహాయపడగలం. ప్రజావిముక్తిని గొనిరాగలం.

దాని కర్థమేమంటే మనం అంగీకారానికై యత్నము చేయాలి. అంగీకారానికి యత్నంచేయకుండా భేదాభిప్రాయా

లను కనుగొన్నంతమాత్రాన సరిపోదు. అది తప్పనిసరిగా పాక్షికతత్వానికి దారితీస్తుంది.

మన మృదుత్వం కచ్చితమైన సూత్రాలపై ఆధారిత మైన మృదుత్వం, సూత్రరహితమైన మృదుత్వం, శుద్ధతప్పు. సూత్రానికి విరుద్ధంగావెళ్ళే సౌకర్యాలు రాజులవిషయములో కూడఅంతే. అంతేగాక సూత్రంలో సందిగ్ధత, గందరగోళాలు గూడ శుద్ధతప్పులే. పార్టీసూత్రాలు పాలసీలలోను ఎత్తుగడల లోనుగానివచ్చే మార్పులన్నింటికి ప్రమాణాలు కొలతబద్దలు. పార్టీసూత్రాలు, దాని మృదుత్వానికి ప్రమాణాలు కొలత బద్దలు. వుదాహరణకు ఎక్కువమంది ప్రజలకు ఎక్కువ మంచి మేలు చేయుటనేది మన అపరివర్తనీయ సూత్రాలలో ఒకటి. ఈ అపరివర్తనీయ సూత్రం మన పాలసీలలోను ఎత్తుగడల లోను గానివచ్చే అన్నిమార్పుల సవ్యతను నిర్ణయించుటకు ప్రమాణం కొలతబద్ద. ఈ సూత్రంతో ఏకీభవించే మార్పు లన్నీ సవ్యమైనవి. ఈ సూత్రంతో సంఘర్షించేవన్నీ శుద్ధ తప్పు. దీని కర్థమేమంటే యితరులతో ఒడంబడికకై యత్నించే టప్పుడు మనం మనసూత్రాలను విసర్జించరాదని సూత్రాల విషయంలో మనం మనలను దిగజార్చుకోరాదని అర్థం. దీని కర్థమేమంటే ఖచ్చితమైన సూత్రాలపై నొక్కి వక్కా ణించడము మన సూత్రాల స్థాయికి యితరులను కనీసమైనా లేవనెత్తడము ప్రజానీకముయొక్క చైతన్యాన్ని పురోగ మింపజేయుడం, కమ్యూనిస్టుపార్టీ చే సూచించబడుతున్న నిర్ణీతకార్యక్రమస్థాయికి వారి ప్రస్తుతఅనుభవస్థాయీలనుండి మనమిత్రులను గొనిరావడం, లేవనెత్తడం అని అర్థము,

మరియొకవిధంగా చెప్పాలంటే మనం దిగజారుటకు బదులుగా యితరులను పురోగమింపజేయుడంద్వారా ఒక అంగీకారానికై యత్నించటం అన్నమాట. దానికర్థమేమంటే మన మృదుత్వాన్ని సూత్రంవిషయంలో మనపార్టీ కాఠిన్యతతో అత్యంత సన్నిహితంగా జోడించాలన్నమాట. మనపార్టీ యీనాడు జపాన్ వ్యతిరేక చైనా ప్రజాయుద్ధవిజయాన్ని సమీపిస్తున్న కాలమిది. జాతీయపునర్నిర్మాణకాలాన్ని సమీపిస్తున్నాము. అమితోత్సాహముతోను, ధైర్యంతోను విజయాన్ని సాధించటానికై పోరాడుటతోపాటు, మనపార్టీ మెంబర్లందరు అన్ని రకాలపనులలో వచ్చేమార్పులు, అభ్యుదయంకొరకు ఆయత్తముగాటలో - అలాంటి అభ్యుదయాన్ని మార్పులను మనం చైతన్యవంతంగాను, మన స్వంతచొరవుద్వారా ఫలసాధకం చేయుటకు, అవి మనపై తమంతటతామే మనకు తెలియకుండా పడకుండుటకుగాను-అత్యుత్తమమైన తెలివితేటలను, అత్యంత సమానపూరితమైన నిర్ణాయకశక్తిని ప్రదర్శించాలి, మరల రచింపబడిన నియమావళిలో ఈ విషయాలన్నింటిని సమాలోచనలోనికి తీసుకోబడినాయి, సూత్రంవిషయంలో కాఠిన్యం వహించాలనీ, కార్యాచరణలోను, కార్యక్రమంలోను మృదుత్వం వహించాలనీ, నియమావళి చెపుతూవుంది. మనపార్టీయొక్క ప్రస్తుతపరిస్థితులనుమాత్రమేగాక భవిష్యత్ పరిస్థితులనుగూడ సమాలోచనజరుపుటద్వారా యిది సాధింపబడగలదు. వర్తమానపరిస్థితులలోను, జపాన్ దురాక్రమణదారులను ఓడించినతరువాతనుకూడ అంతేగాక చైనాప్రజలచే నూతన ప్రజాతంత్రప్రభుత్వాన్ని నిర్మించుటలోను, పార్టీ నియమావళి అమలు జరుపవచ్చును, జరపాలి.

మనపార్టీకి ఘనమైన ఉజ్వలమైన భవిష్యత్ వుంది. అంతేగాక అది సంక్లిష్టమైన కష్టమైన కర్తవ్యాలను నిర్వహించవలసి వుంది.

తను కష్టాల నన్నింటినీ అసంఖ్యాక ప్రజానీకంచే అధిగమింప జేయుటకై మన చరిత్రలో అపూర్వ ఘనవిజయాన్ని సాధించుటకై మనపార్టీ యావత్తు ప్రజానీకాన్ని నడుపుటకుగాను, అది త్వరితంగా ఆయత్తమై, తన నిర్మాణ ఆయుధాలను పదును జేసుకోవాలి. దీనికై మనపార్టీ యావత్తూ, కామ్రేడ్ మావోసీటుంగ్ చే రూపొందించబడిన రాజకీయ, నిర్మాణాత్మక సూచనలపైనను, యీ కాంగ్రెసు చే ఆమోదించబడిన నూతన నియమావళి పైనను ఆధారితమై నడుము బిగించాలి.

ఈ పార్టీ కాంగ్రెసుచే ఆమోదించబడే నియమావళి చైనాజాతి ప్రజల విముక్తి విజయానికి గ్యారంటీ యివ్వగలిగినదిగా వుంది.

జపాను దురాక్రమణదారులు పరిపూర్ణంగా నాశనమవ్వాలి !

స్వతంత్ర, సమైక్య స్వేచ్ఛాపూరిత, ప్రజాతంత్ర అభ్యుదయ నవచైనా వర్ధిల్లాలి !

చైనాజాతి ప్రజల విముక్తి వర్ధిల్లాలి !

మనపార్టీ అధినేత, చైనాజాతి, ప్రజా విప్లవాత్మక పోరాటానికి చుక్కానియైన కామ్రేడ్ మావోసీటుంగ్ వర్ధిల్లాలి !

---

# చైనా కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళి

[1945 జూన్ 11 వ తారీఖున చైనా కమ్యూనిస్టుపార్టీ ఏడవ జాతీయపార్టీ కాంగ్రెసుచే ఆమోదింపబడింది.]

## సాధారణ కార్యక్రమం

కమ్యూనిస్టుపార్టియంటే చైనా కార్మికవర్గం యొక్క సుసంఘటిత చైనా అగ్రగామిదళం, మరియు అత్యుత్తమవర్గ సంఘం. చైనాజాతి, చైనాప్రజల ప్రయోజనాలకు పార్టి ప్రాతినిధ్యం వహిస్తూవుంది. ప్రస్తుతదశలో అది చైనాలో నూతన ప్రజాతంత్రవిధానాన్ని నెలకొల్పుటకు పాటుపడుతూ వుంది. చైనాలో కమ్యూనిస్టు విధానాన్ని నెలకొల్పటం దానిఅంతిమ లక్ష్యం.

చైనా కమ్యూనిస్టుపార్టి తన యావత్తు కార్యక్రమాన్ని మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతాలను చైనావిప్లవం యొక్క యదార్ధ ఆచరణతో సమైక్యంజేయునట్టి పరిబోధాల ననుసరించి – కామ్రేడ్ మావ్సీయాంగ్ సిద్ధాంతాన్ని అనుసరించి నడుపుకొంటుంది. పిడివాదానికి లేక అనుభవవాదానికి సంబంధించిన పెడమార్గాలన్నింటికీ వ్యతిరేకంగా పోరాడుతుంది. గతి తార్కికభౌతికవాదం, చారిత్రక భౌతికవాదాలపై ఆధారపడుతూ చైనాకమ్యూనిస్టుపార్టి, చైనాచారిత్రక సాంప్రదాయాలనూ విదేశ చారిత్రకసాంప్రదాయాలనూ విమర్శనాత్మక దృష్ట్యా ఆమోదిస్తుంది. ఆదర్శవాదం లేక యాంత్రికభౌతిక వాదాల ప్రపంచదృక్పధాలను వ్యతిరేకిస్తుంది.

వర్తమాన చైనాసమాజం, నూతన ప్రజాతంత్రానికి సంబంధించిన విముక్తిప్రాంతాలను మినహాయిస్తే మిగిలినవన్నీ యింకనూ వలస, అర్ధ-వలస సమాజంకాబట్టి; వర్తమానంలో చైనావిప్లవంయొక్క సంచాలకశక్తులు, కార్మికవర్గం, రైతాంగం, పెట్టీ-బూర్జువావర్గం తదితర ప్రజాతంత్ర శక్తులతో యేర్పడియున్నది. కాబట్టి శక్తివంతమైన చైనాకమ్యూనిస్టుపార్టీ అస్తిత్వంలోనున్నది కాబట్టి ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితులనుబట్టి వర్తమానదశలో చైనావిప్లవం, ఒక నూతనరకపు స్వభావాన్ని కలిగిన ఒక బూర్జువా ప్రజాతంత్రవిప్లవం-అంటే సామ్రాజ్యవాదానికి, జమీందారీ విధానానికి వ్యతిరేకంగా శ్రామికవర్గంచే నడుపబడుతున్న అసంఖ్యాక ప్రజానీకం యొక్క నూతన ప్రజాతంత్ర విప్లవమది. ఈ విప్లవానికి యింటా బయటాకూడా అనేకమంది మిత్రులున్నారు. అందువల్ల వర్తమాన దశలో చైనా కమ్యూనిస్టుపార్టీ కర్తవ్యాలేవంటే, యీ క్రిందివి:—

1. ఆంతరంగికంగా అంటే దేశంలో చైనా కార్మికులను, కర్షకులను, పెట్టీ బూర్జువా వర్గాన్ని, మేధావులనూ, సామ్రాజ్యవాద వ్యతిరేకమైన జమీందారీ విధానానికి వ్యతిరేకమైన శక్తులన్నింటినీ, జాతీయ అల్పసంఖ్యాక వర్గాలన్నింటినీ, సమీకరించటం, సంఘటితపరచటం.

2. బాహ్యంగా అంటే యితర దేశాల విషయంలో అంతర్జాతీయ శ్రామికవర్గంతోనూ, మనలను సమాన ప్రతిపత్తిలోజూచే పీడితప్రజ లందరితోనూ, జాతులన్నింటితోనూ, విదేశ సామ్రాజ్య వాదంనుండి చైనా ప్రజలను విముక్తి

జెందించుటకు, చైనా ప్రజలను అణచివేస్తున్న దేశీయ జమీందారీ వర్గాన్ని సమూలంగా పెకలించివేయుటానికి అన్ని విప్లవవర్గముల మిత్రత్వంపై ఆధారపడి యుండునట్టి అన్నిజాతీయ గూప్రుల స్వేచ్ఛాయుత సమైక్యతపై ఆధారపడి యుండునట్టి, స్వతంత్రమైన, స్వేచ్ఛాయుతమైన, ప్రజాతంత్రమైన, సమైక్యమైన, సంపత్తికరమైన, శక్తిమంతమైన, ఫెడరేటెడ్ రిపబ్లికును నిర్మించుటకు, ప్రపంచశాంతిని, అభ్యుదయాన్ని సాధించుటకు, సమైక్యమవ్వాలి.

భవిష్యత్తులో, చైనా జాతీయ ప్రజాతంత్ర విప్లవం సంపూర్ణ విజయాన్ని సాధించినతర్వాత, చైనా సామాజిక ఆర్థికాభివృద్ధి అవసరాల ననుసరించి చైనా ప్రజల అభీష్టాన్ని అనుసరించి చైనాలో సోషలిస్టు, కమ్యూనిస్టు విధానాన్ని స్థాపించటం, చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క కర్తవ్యం.

అర్ధ వలస, అర్ధ భూస్వామిక విధానానికి జెందియున్న యీనాటి చైనా దేశానికి భూభాగం, అపారంగావుంది, అసంఖ్యాకంగా ప్రజలూ వున్నారు, ఇంకనూ అనైక్యంగా వుంది. ఒకవైపున అసంఖ్యాక ప్రజానీకం అందులో ప్రత్యేకంగా కార్మికులు, కర్షకులు, చారిత్రక పోరాటంయొక్క విప్లవ సాంప్రదాయాన్ని కలిగియున్నారు. మరియొకవైపున విప్లవ మార్గానికి అంతులేని ఆటంకాలున్నాయ్. విప్లవ పోరాటం యొక్క సంక్లిష్టత, దీర్ఘకాలిక స్వభావాన్ని జనింపజేస్తూ యీ విషయాలు (అడ్డంకులు) చైనా విప్లవంయొక్క అసమానాభివృద్ధిని నిర్ణయిస్తాయి. చైనా విప్లవంయొక్క ప్రధానరూపం దీర్ఘకాలంగా ఎందువలన సాయుధ పోరాటంగా వున్నదన్న

విషయాన్నీ, ప్రధాన నగరాలలో విప్లవం విజయమందుటకు పూర్వం గ్రామీణ ప్రాంతాలలో విప్లవాత్మక స్థావరాలను బలపరచటంఅత్యంతప్రధానమైనవిషయ మెందుకల్ల అన్నవిషయాన్నీ,అంతేగాక అన్నిసెక్షన్లను జెందిన ప్రజలలోనూ, దీర్ఘ కాలంనుండి ఎంతోసహనంతో చైనాకమ్యూనిస్టుపార్టీ పనిజేయవలసిన అవసరమేర్పడిన దెందువల్లనన్న విషయాన్ని అది వివరిస్తూవుంది. ఆవిధంగా చైనాకమ్యూనిస్టుపార్టీ, చైనా విప్లవంయొక్క యీస్వభావాలను పరిగణనలోనికి తీసుకొంటూ విప్లవంయొక్క దీర్ఘక్రమంలో కోట్లాదిప్రజలను సమీకరించుటకు, సంఘటితపరచుటకు ధైర్యవంతంగానూ, అనుభవ పూరితంగా ఆరితేరాలి. తన విప్లవసముద్రంలో దాగియున్న కొండలను ఢీకొనకుండా తన విప్లవనౌకను సురక్షితంగా నడుపుకొనుటకు, తన అనుయాయులను కాకలుదీరిన దిట్టలుగా తయారుజేసుకొనుటకు తన గమ్యాన్ని జేరుకొనుటకు అన్ని కష్టాలను, అడ్డంకులనూ అధికమించాలి.

చైనాకమ్యూనిస్టుపార్టీ విప్లవపోరాటక్రమంలో విప్లవాత్మక ప్రజాసంఘాలన్నింటికీ విప్లవాత్మక ప్రభుత్వశాఖలకు నాయకుడుగా తయారవుటకు యత్నించాలి. కార్మికవర్గం యొక్క ఐక్యతను విచ్ఛిన్నంచేయుటకై యత్నించే కార్యకలాపా లన్నింటికీ వ్యతిరేకంగా, విప్లవవర్గాల మితృత్వాన్ని విచ్ఛిన్నంజేయుటకు యత్నించే కార్యకలాపాలు అన్నింటికీ వ్యతిరేకంగా లేక విప్లవఆశయాన్ని బలహీనపరచుటకు జరిగే కార్యకలాపాలన్నింటికీ వ్యతిరేకంగా (పై వాటికి సంబంధించిన

ఆంతరంగిక బాహ్యాకార్యకలాపాలకు, శత్రువులకు వ్యతిరేకంగా) గట్టిపోరాటాన్ని నడుపాలి.

తన అనుయాయులలో మిదవాద లేక "అతివాద" అవకాశవాదాన్ని చైనాకమ్యూనిస్టుపార్టి సహించదు. తన అనుయాయులలో సమైక్యతను నిలబెట్టుకోడానికి చైనాకమ్యూనిస్టుపార్టీ తనపార్టీమధ్యంలోనున్న అవకాశవాదులకు లొంగుబాటుతత్వంగలవారికి, సాహసికతత్వానికి సంబంధించిన వారికి వ్యతిరేకంగా రాజీరహితమైన సవ్యమైనపోరాటాన్ని నడుపాలి. తమతప్పులను పట్టుకొని వ్రేళ్లాడేవారిని పార్టీనుండి బహిష్కరించాలి.

తన కార్యక్రమంలో లోట్లుగానీ, పొరపాట్లుగానీ వుంటే చైనాకమ్యూనిస్టుపార్టీ కప్పిపెట్టరాదు. ఈ తప్పులను, లోట్లను సకాలంలో సరిదిద్దుకొనుటకుగాను పార్టీమెంబర్లకు, కార్యకర్తలకు శిక్షగరపుటకుగాను విమర్శన, ఆత్మవిమర్శన పద్ధతిద్వారా నిరంతరం పరీక్షించాలి. వ్యక్తిగతఅహంకారానికి తప్పులు వొప్పుకొనుటకు అయిష్టతనుజూపేవారికి విమర్శన, ఆత్మవిమర్శనను జూచి భయపడేతత్వానికి చైనాకమ్యూనిస్టుపార్టి వ్యతిరేకం.

ప్రజలకు సేవజేయుటకై చైనా కమ్యూనిస్టులు తమ హృదయాలను అంకితంజేయాలి. అసంఖ్యాక కార్మికులతోనూ కర్షకులతోనూ తదితర విప్లవ ప్రజానీకంతోనూ విశాలసంబంధాలను స్థాపించుకోవాలి. యీ సంబంధాలను పటిష్టం జేసుకొనుటకు విస్తరింపజేసుకొనుటకు ఎల్లప్పుడూ తమ దృష్టిని కేంద్రీకరించాలి. ప్రజల ప్రయోజనాలే పార్టీ ప్రయోజనాలని

ప్రజలకు బాధ్యతవహించుట యంటే పార్టీకి బాధ్యతవహించుటయనీ ప్రతి పార్టిసభ్యుడు తప్పక అర్థంజేసుకోవాలి. ప్రతి పార్టిసభ్యుడూ ప్రజలేమి చెప్పుచున్నారో శ్రద్ధగా వినాలి. ప్రజల సత్వర అవసరాలేమిటో అర్థంజేసుకోవాలి. ప్రజల అవసరాలను సంతృప్తిపరచటానికై వారు పోరాడుటకుగాను, వారిని సంఘటితపరచుటకు సహాయముజేయాలి. ప్రజలనుండి నేర్చుకొనుటకు, అదేసమయంలో ప్రజల చైతన్యాన్ని మేల్కొల్పుటకు, అభివృద్ధిపరచుటకు విప్లవాత్మకతత్వంలో ప్రజలకు అవిరామంగా శిక్షగరపుటకై కృతనిశ్చయుడై యుండాలి. ప్రజలనుండి వేరుపడకుండా వుండుటకుగాను చైనా కమ్యూనిస్టుపార్టీ ఎల్లప్పుడు జాగరూకమైయుండాలి. పార్టీని ప్రజల నుండి వేరుజేసే "టెయిలిజం" (తోకపట్టుకొనిపోయే తత్వం), "ఆధికారికతత్వం (కమాండిజం లేక అధికారం చెలాయించే తత్వం), కవాట బంధతత్వం (క్లోస్‌డోర్ విధానం లేక "నన్ను ముట్టబోకు నా మాలకాకి" అని ముడికట్టుకొని కూర్చోటం లేక ప్రజలకు దూరంగా వుండిపోవటం), నిరంకుశ తత్వము (నిరంకుశంగా వ్యవహరించటం), "యుద్ధస్వాముల తత్వం" (వార్ లార్డిజం లేక యుద్ధస్వామ్యాలలాగున వ్యవహరించటము) లాంటి అపసవ్యధోరణులు తనలో ప్రవేశించకుండా వుండేలాగుననూ వున్నవాటిని రద్దుపరచుటకు చైనా కమ్యూనిస్టుపార్టీ కృషిజేయాలి.

తన పార్టీ సభ్యులందరూ యిచ్ఛాపూర్వం అనుసరించునట్టి క్రమశిక్షణచే సమైక్యంగావించబడిన ఒకసమైక్య యోధా

త్మకసంఘంగా కేంద్రీకృత ప్రజాస్వామ్యం ఆధారితమై చైనా కమ్యూనిస్టుపార్టి నిర్మింపబడుతూవుంది.

కృతనిశ్చయముతో కూడుకొన్న దృఢత్వములోనూ, కార్యాచరణలోనూ, పట్టుదలలోనూ ఐక్యతగలిగియుండటం లోనే చైనా కమ్యూనిస్టుపార్టీకి బలముంది. పార్టీ కార్యక్రమం లేక నియమావళినుండి దూరమయ్యే ఏ కార్యకలాపాన్నీ, పార్టీ క్రమశిక్షణను, బలహీనపరచే ఏ కార్యకలాపాన్నీ స్వతంత్రతత్వానికి, ముఠాతత్వానికి లేక ద్వంద్వాత్మకమైన వంచకత్వానికి దారితీసే ఏ రూపాన్నీ పార్టీసహించదు. పార్టి కార్యక్రమాన్నీ, పార్టి నియమావళినీ, పార్టి క్రమశిక్షణను భంగపరచునట్టి (సరిదిద్దుటకు వీలుగానట్టి) వారందరినీ పార్టి తనలోనుండి బయటకు పంపివేయాలి.

చైనాజాతి, చైనాప్రజల పరిపూర్ణవిముక్తిని సాధించుటకు పార్టికార్యక్రమాన్ని, నిర్ణయాలను అమలుజరుపుటకు తన పార్టిసభ్యులు చురుకుగా పనిజేయాలనీ, త్యాగంజేయాలనీ చైనా కమ్యూనిస్టుపార్టి కోరుతూవుంది.

# ఒకటవ అధ్యాయం

# సభ్యత్వం

## 1. నిబంధన

పార్టి కార్యక్రమాన్నీ, నియమావళినీ ఆమోదించేవారు పార్టి సంఘాలకు జెందినవారు, పార్టి సంఘాలలో పనిజేసేవారు, పార్టి నిర్ణయాలను అమలుజరిపేవారు, పార్టి సభ్యత్వరుసుములను చెల్లించేవారు పార్టి మెంబరుగా అవవచ్చును.

## 2. నిబంధన

పార్టి సభ్యుని విధులు యీ క్రిందివి:-

(1) తన చైతన్యస్థాయిని పెంపొందించు కొనుటకు కృషి చేయుటం, మార్క్సిజం - లెనినిజం మూలసూత్రాలనూ, మాసీటుంగ్ సిద్ధాంతాన్నీ అర్థంజేసుకోవటం.

(2) పార్టి క్రమశిక్షణను గట్టిగా అమలుజరపటం, పార్టి ఆంతరంగికజీవితంలో చురుకుగా పాల్గొనటం, చైనావిప్లవోద్యమంలో చురుకుగా పాల్గొనటం, పార్టిపాలసీని, నిర్ణయాలను ఆచరణలో పెట్టటం, పార్టి ప్రయోజనాలకు హానికరమైన, పార్టికి వెలుపలనున్న. లోపలనున్న వాటన్నింటికీ వ్యతిరేకంగా పోరాడడం.

(3) అసంఖ్యాక ప్రజానీకానికి సేవజేయుటం, వారితో పార్టి సంబంధాలను ధృడతరంజేయుటం; వారి (ప్రజల) అవసరాలను సకాలంలో తెలుసుకోవటం, వాటిని సకాలంలో పార్టికి రిపోర్టుచేయుటం, పార్టిపాలసీని వారికి వివరించటం.

(4) విప్లవాత్మక ప్రభుత్వంయొక్క క్రమశిక్షణను, విప్లవసంఘాల క్రమశిక్షణను అమలుజరుపుటలో ఆదర్శ మూర్తిగా వుండటం, తనపనిలో ఆరితేరటం, విప్లవకార్య క్రమానికి సంబంధించిన వివిధరంగాలలో ఆదర్శవంతంగా తయారుగావటం అనేవి.

3. ని బం ధ న,

పార్టీ మెంబరు హక్కులు యీ క్రిందివి :—

(1) పార్టీ పాలసీని అమలు జరుపుటకు సంబంధించిన సమస్యలనుగురించి పార్టీ సభలు, సమావేశాలు జరుగుతూ వుంటాయి. వాటిల్లో పార్టీ సభ్యుడు పాల్గొనాలి.

(2) పార్టీలో తాను ఎన్నుకోవటం; ఎన్నుకోబడటం.

(3) పార్టీ సంఘం దేనికైననూ, క్రింది సంఘమునుండి పై సంఘంవరకు కేంద్రకమిటీతో సహా తన ప్రతిపాదనలను, ప్రకటనలను పంపవచ్చును.

(4) పార్టీ కార్యకర్త నెవరినైననూ పార్టీ మీటింగు లలో విమర్శించవచ్చును.

4. ని బం ధ న.

18 ఏండ్ల వయసునచ్చిన తర్వాతనే ఏ వ్యక్తినైనా పార్టీలోని తీసుకోవాలి.

పార్టీలో చేర్చుకొనబడటానికి పెట్టబడిన యీ క్రింది షరతులను అమలు జరిపిన తర్వాననే పార్టీ సభ్యత్వాన్ని యివ్వాలి:—

(1) వర్కర్లు, కూలీలు, వ్యవసాయ కూలీలు, బీద రైతులూ పట్టణాలకుజెందిన బీదలు లేక విప్లవసైనికులు,పార్టీలో జేర్చుకోవలసినదిగా తాము పెట్టుకొన్న దరఖాస్తులపై యిద్దరు పూర్తి పార్టీ మెంబర్ల శిఫార్సు వుండాలి. ఆ దరఖాస్తులు పార్టీ బ్రాంచి సాధారణ సభ్యత్వ సమావేశ నిర్ణయంద్వారా ఆమోదింపబడాలి. తదుపరి యీ దరఖాస్తులను పార్టీ సబ్ డిస్ట్రిక్టు కమిటీ లేక దానితో సమానమైన హోదానుకలిగి యున్న కమిటీ ఆమోదించాలి. సభ్యత్వార్హత కాలమైన ఆరుమాసాలకాలాన్ని దరఖాస్తుదారులు పూర్తిజేసియుండాలి. అప్పుడు మాత్రమే పూర్తి పార్టిసభ్యులు కాగలుగుతారు.

(2) మధ్యమతరగతికి జెందిన రైతులు, జీతాలు తీసుకొంటున్న వుద్యోగులు, మేధావులు లేక యితర వృత్తులకు జెందినవారు తమ్ము పార్టిలో జేర్చుకోవలసినదిగా పెట్టుకొన్న దరఖాస్తులపై యిద్దరు పూర్తిపార్టిసభ్యుల శిఫార్సును పొంది యుండాలి. ఇలా శిఫార్సుజేసే పూర్తి పార్టిసభ్యులలో ఒకడు, ఒక సంవత్సరంకన్న ఎక్కువ కాలనుండి పార్టిసభ్యుడుగా వుంటున్నవాడుగా వుండాలి. పార్టిబ్రాంచి సాధారణసభ్యుల సమావేశం యీ దరఖాస్తులను ఆమోదించాలి. సబ్ డిస్ట్రిక్టు పార్టికమిటీగానీ లేక దానికి సమానహోదా కలిగియున్నది గానీ, యీ దరఖాస్తులను ఆమోదించాలి. సభ్యత్వార్హత కాలమైన ఒక సంవత్సరంకాలాన్ని దరఖాస్తుదారులు పూర్తి జేసిన తర్వాతనే పూర్తి పార్టిసభ్యులుగా తీసుకొనబడగలరు.

విప్లవంయొక్క అధీనంలోనికి క్రొత్తగావచ్చిన ప్రాంతాలలో కేంద్రకమిటీ లేక దాని ప్రాతినిధ్యసంఘం లేక రాష్ట్ర

పార్టీకమిటీ లేక సరిహద్దుప్రాంతపు పార్టీకమిటీచే నిర్ణయించ బడిన తాత్కాలిక నిబంధనల ననుసరించి పైన సూచించబడిన (1), (2) అంశాలకు సంబంధించిన శిఫారసుదారుల అర్హతల సంబంధించిన షరతులకు, సభ్యత్వార్హతకు సంబంధించిన షరతులను సవరించుకోనవచ్చును.

(3) పై నుదహరించబడిన (1), (2) అంశాలలో నుదహరింపబడిన సామాజిక హోదాలకు సంబంధించనివారు తమ్ము పార్టీసభ్యులుగా జేర్చుకోనవలసినదిగా దరఖాస్తు పెట్టుకొన్నప్పుడు ఆ దరఖాస్తులపై యిద్దరు పూర్తి పార్టీసభ్యుల శిఫారసు వుండాలి. అలా శిఫారసు జేసేవారిలో ఒకరు మూడు సంవత్సరాల కన్న ఎక్కువ కాలంనుండీ పార్టీ సభ్యులై వుండాలి. పార్టీ బ్రాంచి సాధారణసభ్యుల సమావేశంలో యీ దరఖాస్తులను ఆమోదించాలి. అటుతర్వాత వాటిని కౌంటీపార్టీ కమిటీగానీ, లేక సిటీపార్టీ కమిటీగానీ, లేక వాటితో సమాన హోదాకుజెందిన కమిటీగానీ ఆమోదించాలి. సభ్యత్వార్హతకాలమైన రెండుసంవత్సరాలకాలాన్ని దరఖాస్తుదారుడు పూర్తిజేసినతర్వాతనే పార్టీసభ్యుడుగా తీసుకొనబడుతాడు.

(4) ఇతర రాజకీయపార్టీలకు జెందిన సాధారణసభ్యుడు ఆ రాజకీయపార్టీని వదలివేసి తాను మన పార్టీ సభ్యుడుగా కోరబడవలసినదిగా పెట్టుకొన్న దరఖాస్తుపై యిద్దరు పూర్తి పార్టీసభ్యుల శిఫారసును కలిగియుండాలి. అలా శిఫారసుజేసే వారిలో ఒకరు మూడుసంవత్సరాలకన్న ఎక్కువకాలంనుండీ మన పార్టీసభ్యుడుగా వుండియుండాలి. ఈ దరఖాస్తు పార్టీ

బ్రాంచి సాధారణసభ్యుల సమావేశంలో ఆమోదింపబడాలి, అటుతర్వాత దీనిని కౌంటీపార్టీ కమిటీగానీ, లేక దానితో సమానమైన హోదాను కలిగియున్న కమిటీగానీ ఆమోదించాలి. ఇతర రాజకీయపార్టీకిజెందిన బాధ్యతాయుత స్థానంలో నున్న ఒకసభ్యుడు ఆ రాజకీయపార్టీని వదలివేసి మన పార్టీలో సభ్యుడుగా జేర్చుకొనవలసినదిగా తాను పెట్టుకొన్న దరఖాస్తుపై యిద్దరుసభ్యుల శిఫార్సును కలిగియుండాలి. ఆ విధంగా శిఫార్సుజేసేవారిలో ఒకరు అయిదు సంవత్సరాలకు పై బడిన కాలంనుండి పూర్తి పార్టీసభ్యుడుగా వున్నవాడై వుండాలి. ఈ దరఖాస్తు పార్టీ బ్రాంచి సాధారణసభ్యుల సమావేశంలో ఆమోదింపబడాలి. అటుతర్వాత దీనిని రాష్ట్రపార్టీ కమిటీగానీ, లేక దానితో సమానమైన హోదానుకలిగియున్న కమిటీగాని ఆమోదించాలి. పై నుదహరింపబడిన వ్యక్తికన్న మరింత బాధ్యతాయుతమైన స్థానంలో యితర రాజకీయ పార్టీలో వ్యవహరించి యీనాడు ఆ రాజకీయ పార్టీని వదలివేసి మన పార్టీలో జేర్చుకోవలసినదిగా దరఖాస్తు పెట్టుకొన్న వ్యక్తిని మన పార్టీసభ్యుడుగా జేర్చుకొనుటకు కేంద్రకమిటీ ఆమోదాన్ని పొందాలి. పై కేసులన్నింటిలోనూ, సభ్యత్వార్హత కాలం రెండు సంవత్సరాలు.

### ౫. నిబంధన.

ప్రత్యేక పరిస్థితులలో నూతనపార్టీ సభ్యులను చేర్చుకోవటం విషయంలో నిర్ణయించే అధికారం కౌంటీపార్టీ కమిటీలకు, లేక దానితో సమానమైన హోదాను కలిగియున్న కమిటీలకు, వాటి వున్నత నాయకత్వ సంఘాలకూ వుంది.

## 6. నిబంధన

నూతనపార్టీ సభ్యులను శిఫార్సుజేసే ప్రతిపార్టీ సభ్యుడు నూతనపార్టీ సభ్యుల సిద్ధాంతం, స్వభావం, వారి వ్యక్తిగత నడవడికలనుగురించి యదార్ధమైన బాధ్యతాయుతమైన సమాచారాన్ని మనపార్టీకి అందజేయాలి. వారిని శిఫార్సు జేసే ముందు వారికి పార్టీ నిబంధనావళిని గురించి కార్యక్రమాన్ని గురించీ పార్టీ పాలసీనిగురించి వివరించాలి.

నూతన సభ్యుని దరఖాస్తుపై ఒక నిర్ణయం తీసుకొనుటకు ముందు లేక సభ్యత్వాన్ని ఆమోదించేముందు పార్టీ కమిటీ ఒక పార్టీ కార్యకర్తను నియమించాలి. అతడు నూతన పార్టీ సభ్యునితో (దరఖాస్తు దారునితో) వ్యక్తిగతంగా వివరంగా మాట్లాడి దరఖాస్తుదారుని రికార్డులో వుదహరింపబడిన విషయాలను సరిజూసుకొనే బాధ్యతను వహించాలి.

## 7. నిబంధన

సభ్యత్వావర్తకాలాన్ని నిర్ణయించుటలో వుద్దేశమేమంటే, పార్టీసభ్యుడుగా కాగోరినవ్యక్తికి పార్టీ ప్రాథమిక శిక్షను, విద్యను యివ్వటం; అతని పనిక్రమంలో అతని రాజకీయ లక్షణాలను పార్టీసంఘం పరిశీలించుటకు అవకాశం కలుగజేయుట మనేవి.

ఎన్నుకోవటం, ఎన్నుకోబడటం లేక ఏ తీర్మానాన్నయినా, ప్రతిపాదనైన ప్రతిపాదించటం అనే హక్కులు మినహా, పార్టీసభ్యుడు కానున్నవ్యక్తికి, అంటే కాండిడేట్ - మెంబరునకు పూర్తి పార్టీసభ్యునికి వున్న హక్కులు, విధులూ వుంటాయి.

## 8. నిబంధన

సభ్యత్వార్థతకాలాన్ని పూర్తిజేసిన తర్వాత, పూర్తి సభ్యత్వాన్ని పొందుటకు పార్టీబాగ్రించి సాధారణసభ్యుల సమావేశం తన నిర్ణయాన్ని యిస్తుంది. దానితోపాటు ఆ సభ్యుని ప్రవేశాన్ని ఆమోదించిన వున్నత పార్టీకమిటీగానీ లేక అదే హోదాకు జెందిన పార్టీకమిటీగానీ తన ఆమోదాన్ని యిస్తుంది.

తన అధీనప్రాంతంలో నున్న కాండిడేట్ - మెంబరు యొక్క సభ్యత్వార్థతకాలాన్ని ఆ పార్టీకమిటీ పొడిగించటం గానీ, తగ్గించటంగానీ చేయవచ్చును.

పార్టీలో జేరుటకు అనర్హుడని పార్టి సభ్యత్వార్థతకాలములో తెలిసప్పుడు కాండిడేట్ మెంబరుయొక్క హోదాను రద్దుచేయవచ్చును.

## 9. నిబంధన

సభ్యునియొక్క పార్టివయసు అతడు కాండిడేట్ మెంబరు పూర్తిజేయవలసిన కాలాన్ని పూర్తిజేసినతర్వాత పూర్తి మెంబరుగా తీసుకొనబడుటకు నిర్ణయించిననాటినుండియే పరిగణింపబడుతుంది.

## 10. నిబంధన

ఒక పూర్తిపార్టీ మెంబరుగానీ లేక కాండిడేట్ మెంబరుగానీ తానున్న పార్టి సంఘాధీనప్రాంతంనుండి మరియొకపార్టి సంఘాధీనమందున్న ప్రాంతానికి బదిలీ చేయబడినపుడు దానికి సంబంధించిన పార్టిసంఘంలో తాను యింతకు పూర్వమున్న హోదాతోనే వుంటాడు.

## 11. నిబంధన

పార్టీ మెంబరుగానీ లేక కాండిడేట్ మెంబరుగానీ పార్టీనుండి వెళ్ళిపోవాలనిఅనుకొంటే అతడు తనకు సంబంధించినపార్టి బ్రాంచికి తన దరఖాస్తును పంపాలి. పార్టి బ్రాంచి తన సాధారణసభ్యుల సమావేశంలో అతడిపేరును పార్టి రిజిష్టరునుండి తొలగించివేయుటకు నిర్ణయంజేయాలి. ఈ చర్యను రిజిష్టరు చేయించుటకొరకు వున్నత పార్టికమిటీకి రిపోర్టు జేయాలి.

## 12. నిబంధన

తగినకారణాలు లేకుండా యేపార్టీసభ్యుడుగానీ, లేక కాండిడేట్-మెంబరుగానీ, ఆరుమాసాలకాలంపాటున పార్టీ జీవితంలో పాల్గొనకపోతే, పార్టీయిచ్చిన పనులను చేయకపోతే లేక పార్టీసభ్యత్వరుసుమును చెల్లించకపోతే అతడు పార్టీని వదలివేసినట్లుగా భావింపబడుతుంది; పార్టీబ్రాంచి సాధారణ సభ్యులసమావేశంలో అతనిపేరును పార్టీనుండి తొలగించుటకు నిర్ణయంతీసుకోవాలి. యీ విషయాన్ని ఆమోదంకొరకై వున్నతపార్టీకమిటీకి రిపోర్టుచేయాలి.

## 13. నిబంధన

ఒక పార్టీమెంబరుగానీ, లేక కాండిడేట్ మెంబరును గానీ పార్టీనుండి తొలగించుటకు అతనికి సంబంధించిన పార్టీ బ్రాంచి తన సాధారణసభ్యుల సమావేశంలో యీ విషయాన్ని చర్చించాలి; దానిపై నిర్ణయంతీసుకోవాలి; యీ బ్రాంచికి సంబంధించిన పార్టీ వున్నతపార్టీకమిటీ బ్రాంచి

గావించిన నిర్ణయాన్ని ఆమోదించినప్పుడే దానికి విలువ వుంటుంది.

పార్టీబ్రాంచికి పైదైన ఒకపార్టీకమిటీ, ప్రత్యేకపరిస్థితులలో ఒక పార్టీ మెంబరునుగాని లేక కాండిడేట్ మెంబరునుగానీ పార్టీనుండి తొలగించవచ్చును. అయితే యీ చర్యకు పైనుదహరింపబడిన పార్టీకమిటీకి సంబంధించిన పార్టీవున్నత కమిటీ తన ఆమోదాన్ని యిచ్చినప్పుడే విలువవుంటుంది.

# రెండవ అధ్యాయం

# పార్టీనిర్మాణరూపం

## 14. నిబంధన

పార్టీయొక్క నిర్మాణరూపం లేక ఆకారం కేంద్రీకృత ప్రజాతంత్రంపై ఆధారితమై యుంటుంది. అంటే ప్రజాతంత్రంపై ఆధారితమవునట్టి కేంద్రీకృతతత్వమనీ, కేంద్రీకృత నాయకత్వంక్రింద ప్రజాతంత్రమనీ దానికి అర్థం. ప్రాథమిక సూత్రాలీ క్రిందివి:—

(1) అన్ని స్థాయీలకు జెందిన పార్టీ నాయకత్వ సంఘాలు ఎన్నుకొనబడినవై వుండాలి.

(2) తమను ఎన్నుకొన్న క్రిందిపార్టీ సంఘాలకు, నిర్ణీత కాలాలలో, అన్ని స్థాయీలకుజెందిన పార్టీ నాయకత్వ సంఘాలు రిపోర్టులను యివ్వాలి.

(3) తను సంబంధించిన పార్టీ సంఘంయొక్క నిర్ణయా లకు ప్రతి పార్టీ సభ్యుడూ కట్టుబడి యుండాలి. మైనారిటీ నిర్ణయానికి కట్టుబడి యుండాలి. క్రిందిపార్టీ సంఘాలు వున్నత పార్టీ సంఘాలకు లోబడి యుండాలి. పార్టీ నియోజకవర్గ సం ఘాలన్నీ కేంద్రకమిటీకి కట్టుబడి యుండాలి.

(4) అరమరిక లేకుండా పార్టీ క్రమశిక్షణను గట్టిగా అమలు జరుపాలి. పార్టీ నిర్ణయాలను బేషరతుగా కొనసా గించాలి.

## 15. నిబంధన

ఉత్పత్తిశాఖలను బట్టిగానీ, భౌగోళికవిభాగాలను బట్టి గానీ పార్టీసంఘాలను స్థాపించాలి.

ఒకానొక నిర్ణీతప్రదేశంలోని పార్టీపనికి బాధ్యత వహిస్తున్న సంఘం, ఆ ప్రాంతంలోని పార్టీసంఘాలన్నింటికీ వున్నతసంఘంగా వుంటుంది.

ఒక ఉత్పత్తిశాఖలోని పార్టీపనికి బాధ్యతవహిస్తున్న సంఘం, ఆ శాఖలోని పార్టీసంఘాలన్నింటికీ వున్నతసంఘంగా వుంటుంది.

## 16. నిబంధన

పార్టీనిర్మాణరూపం యీ క్రిందివిధంగా వుంటుంది:—

(1) చైనా యావత్తుకూ నేషనల్ పార్టీ కాంగ్రెసు, కేంద్రకమిటీ నేషనల్ పార్టీ కాన్ఫరెన్సులు వుంటాయి.

(2) ఒక రాష్ట్రానికి, ఒక సరిహద్దుప్రదేశానికి లేక

ప్రాంతానికి రాష్ట్రపార్టి కాంగ్రెసు, సరిహద్దుప్రదేశ పార్టి కాంగ్రెసు లేక ప్రాంతీయపార్టి కాంగ్రెసు వుంటాయి. రాష్ట్రపార్టి కమిటీ, సరిహద్దుప్రదేశ పార్టికమిటీ లేక ప్రాంతీయపార్టి కమిటీవుంటాయి. రాష్ట్రపార్టి కాన్ఫరెన్సు, సరిహద్దుప్రదేశ పార్టికాన్ఫరెన్సు లేక ప్రాంతీయపార్టి కాన్ఫరెన్సు వుంటాయి.

(3) కౌంటీకి, కౌంటీపార్టి కాంగ్రెసు, కౌంటీపార్టి కమిటీ, కౌంటీపార్టి కాన్ఫరెన్సు వుంటాయి.

(4) ఒక నగరానికి నగరపార్టి కాంగ్రెసు, నగరపార్టి కమిటీ, నగరపార్టి కాన్ఫరెన్సువుంటాయి.

(5) ఒక నగరంలోని సబ్ జిల్లాలకు లేక గ్రామీణ జిల్లాలలోని సబ్ జిల్లాకు సబ్ జిల్లాపార్టి కాంగ్రెసు (లేక సబ్ జిల్లా సాధారణసభ్యుల మీటింగు) సబ్ జిల్లాకమిటీ, సబ్ జిల్లా పార్టి కాన్ఫరెన్సువుంటాయి.

(6) ఒక ఫ్యాక్టరీకి, గనికి, గ్రామానికి, వ్యాపారసంస్థకు, ఆర్మీ కంపెనీకి, ఆఫీసునకు లేక బడికి, వీధికి సాధారణసభ్యుల మీటింగు పార్టి బ్రాంచి కమిటీ, పార్టి బ్రాంచి కాన్ఫరెన్సు వుంటాయి.

## 17. నిబంధన

ఒక పార్టి బ్రాంచియొక్క వున్నత నాయకత్వ సంఘ మేదంటే ఆ బ్రాంచి సాధారణసభ్యుల మీటింగు. ఒక సబ్ జిల్లా, కౌంటీ, సిటీ, ప్రాంతం, సరిహద్దుప్రదేశం లేక రాష్ట్రం యొక్క వున్నత నాయకత్వసంఘమేదంటే దానిపార్టి కాంగ్రె

సులు. యావత్తు పార్టియొక్క నాయకత్వసంఘమేదంటే నేషనల్ పార్టి కాంగ్రెసు.

పార్టి కాంగ్రెసులు జరుగుటకు మధ్యనున్న కాలములో ఎన్నికలద్వారా ఏర్పడిన అన్నిస్థాయిలకు జెందిన పార్టి కమిటీలు ఆయాస్థాయిలకు సంబంధించిన పార్టిసంఘాలకు వున్నత పార్టిసంఘాలుగా వ్యవహరిస్తాయ్.

## 18. నిబంధన

సాధ్యమైన తావులన్నింటిలోనూ, అన్నిస్థాయిలకు జెందిన పార్టినాయకత్వసంఘాలనూ, ఎన్నికలపద్ధతిద్వారా ఏర్పరచాలి. సాధారణసభ్యుల సమావేశాన్నిగానీ, లేక పార్టి కాంగ్రెసునుగాని జరుపుటకు వీలుగాని పరిస్థితులలో మాత్రమే వున్నతపార్టిసంఘంచే, పార్టినాయకత్వసంఘాలను నియమించబడవచ్చును. పార్టికాన్ఫరెన్సుచే అవి ఎన్నుకొనబడవచ్చును.

## 19. నిబంధన

ఏ స్థాయికిజెందిన పార్టికమిటీయైననూ, దాని ఎన్నికలను కాండిడేట్లలిస్టునుండి పార్టికమిటీసభ్యులుగా ఎన్నుకొనుటను రహస్యపద్ధతిద్వారాగానీ లేక బహిరంగవోటింగుద్వారాగానీ జరుపవచ్చును. ఇలా జరుపబడే ఎన్నికలలో, ఎన్నికలకు నిలబెట్టబడిన కాండిడేట్లను విమర్శించటానికి వారినిమార్చి మరియొకరిపేరును సూచించటానికి వోటర్లకు హక్కుగలదని గ్యారంటీచేయాలి.

## 20. నిబంధన

ఉన్నతపార్టీ సంఘంయొక్క ప్రధాన నిర్ణయాలను వ్యాపింపజేయుటకుగానీ, లేక చర్చించుటకుగానీ, లేక తన పనిని సమీక్షించుకొనుటగానీ, లేక ప్లాను జేసుకొనుటకుగానీ యే స్థాయికిజెందిన పార్టి సంఘమైననూ, అది తన కార్యకర్తల లేక చురుకుపని జేసేవారల వివిధరకాల మీటింగులను జరుపు కొనవచ్చును.

## 21. నిబంధన

నిర్ణయాలకు రాకపూర్వం ప్రతిపార్టి సభ్యుడు పార్టి లోపలను పార్టి మీటింగులలోను పార్టి పాలసీనిగురించీ వివిధ సమస్యలనుగురించీ, తన అభిప్రాయాలను వ్యక్తీకరించుటకు స్వేచ్ఛగా చర్చలు సాగించవచ్చును. ఒక నిర్ణయం చేయబడిన తర్వాత ఏమైననూగాని దానికి కట్టుబడియుండాలి. బేష రతుగా దానిని అమలు జరపాలి.

## 22. నిబంధన

అన్నిస్థాయిలకు జెందిన పార్టి సంఘాల నాయకత్వ సంఘాలు తమ కార్యక్రమాన్ని పార్టి అంతరంగిక ప్రజాతంత్రాన్ని అనుసరించి నడుపాలి. అలా చేయుటద్వారానే పార్టి సభ్యుల విప్లవాత్మక చొరవను సృజనాత్మక శక్తిని పెంపొందించుటకు సాధ్యమవుతుంది. యాంత్రికంగా వుండకూడనట్టి చైతన్యవంతంగా వుండవలసివున్నట్టి పార్టిక్రమశిక్షణను బలపరచుటకు సాధ్యమవుతుంది. సవ్యమైన పార్టినాయ

కత్వాన్ని నిశ్చయపరచుటకు ప్రజాతంత్రముపై ఆధారితమైన కేంద్రీకృతత్వాన్ని నిలబెట్టుటకు, ధృఢపరచుటకు సాధ్యమవు తుంది. ఏమైనప్పటికి యిలాచేసేటప్పుడు అన్నిస్థాయిలకు జెందిన పార్టిసంఘాలు, పార్టి-ఆంతరంగిక కేంద్రీకృతత్వాం బలహీనపడకుండా రక్షించుకోవాలి. కేంద్రీకృత కార్యాచర ణకు సవ్యమైన, లాభదాయకమైన పార్టి ఆంతరంగిక ప్రజా తంత్రాన్ని అరాజకధోరణులుగా (స్వతంత్రచర్యలు, అమిత ప్రజాతంత్రచర్యలుగా) పొరపాటుపడరాదు.

## 23. నిబంధన

పార్టిఆంతరంగిక – ప్రజాతంత్రం పార్టీఆశయానికి లాభదాయకమైనపంథాలో నడుపుటకుగాను పార్టిపోరాట శక్తిని బలహీనపరచకుండా వుండుటకుగాను లేక అత్యావస రకాలంలోపార్టియొక్క పోరాట ధృఢత్వాం బలహీన పడకుండా వుండుటకుగాను లేక పార్టి ఆంతరంగిక ప్రజాస్వామ్యాన్ని విచ్ఛిన్నశక్తులు, పార్టివ్యతిరేకశక్తులు, ముఠాలుకట్టేశక్తులు పార్టీకిప్రమాదం తెచ్చిపెట్టుటకు, పార్టిలో చీలికలు గొనివచ్చుటకు వినియోగించుకోకుండా వుండాలంటే పార్టిలోని మెజారిటీసభ్యులు తాత్కాలికంగా సైద్ధాంతికంగా తయారుగావుండకపోవటంనుండి కొంతమంది వ్యక్తులు యీ అసంసిద్ధతను తమ స్వార్థాసక్తై వినియోగించకుండా చేయుటకు గాను స్థానికపార్టీయొక్క పాలసీనిగాని లేక జాతీయపార్టి (యావత్తుపార్టి) పాలసీనిగానీ విస్తారంగా చర్చించుటకు

మినహాయింపులు లేకుండా సమీక్షించుటకు యీ క్రింది షరతులు వుండాలి.

(1) అనుకూల పరిస్థితులుండాలి. అంటే భౌతిక పరిస్థితులు విపరీతంగానూ, విపత్కరంగానూ వుండరాదు.

(2) పార్టియొక్క కేంద్రకమిటీచేగానీ లేక స్థానిక నాయకత్వసంఘముచేగానీ అది నిశ్చయింపబడాలి.

(3) అలాంటి సమీక్ష జరుపాలని క్రిందిసంఘాలలో అత్యధికసంఖ్యాక సంఘాలుగానీ లేక వున్నతపార్టిసంఘంగానే ప్రతిపాదించాలి.

## 24. నిబంధన

అన్నిస్థాయిలకు జెందిన పార్టీసంఘాలు తమ అధ్వర్యాన నడుచుచున్న వార్తాపత్రికలద్వారా తమ వున్నతపార్టీసంఘాల యొక్క పాలసీని, నిర్ణయాలను కేంద్రపార్టిపాలసీని నిర్ణయాలను, బహుళంగా ప్రచారమయ్యే లాగున చూడాలి.

## 25. నిబంధన

జాతీయస్వభావాన్ని కలిగిన సమస్యలపై కేంద్రకమిటీ తన నిర్ణయాన్నిగానీ లేక ప్రకటననుగానీ వెలిబుచ్చకపూర్వం డిపార్టుమెంటులకు సంబంధించిన పార్టీసంఘాలుగానీ లేక క్రింది పార్టీసంఘాలుగానీ లేక వాటికి సంబంధించిన కమిటీమెంబర్లుగానీ ప్రకటన లివ్వరాదు. తమ దృక్పథాలను బయటికి ప్రకటించరాదు. అయితే వారు ప్రైవేటుగా చర్చలు జరుపుకోవచ్చును. కేంద్రకమిటీకి తమ సలహాలను పంపవచ్చును.

దాని వున్నతపార్టి సంఘం, లేక కేంద్రకమిటీ నిర్ణయాలతో సంఘర్షించకుండా వుండేలాగున స్థానికసమస్యలపై స్థానికపార్టి సంఘాలు నిర్ణయాలు తీసుకొనుటకు హక్కుగలదు.

## 26. నిబంధన

నూతనంగా స్థాపించబడిన పార్టి సంఘం తనకు సంబంధించిన వున్నతపార్టి సంఘంయొక్క ఆమోదాన్ని పొందాలి. అంటే దానిచే పార్టి సంఘంగా గుర్తింపబడాలి.

## 27. నిబంధన

రాష్ట్రపార్టీ సంఘాలు, ప్రాంతీయ పార్టీసంఘాలు తమ కార్యక్రమాన్ని నడుపుకొనుటకై సౌలభ్యం చేకూర్చుటకుగాను కేంద్రకమిటీ పరిస్థితుల అవసరాల ననుసరించి కేంద్ర బ్యూరోను, సబ్-సెంట్రల్ బ్యూరోను, యేర్పాటు చేయవచ్చును. అలా యేర్పాటు చేయబడిన బ్యూరోల అధ్యర్యం క్రింద కొన్ని రాష్ట్రాలు లేక సరిహద్దు ప్రాంతాలు వుంటాయి. పై నుదహరింపబడిన బ్యూరో కేంద్రకమిటీచే నియమించబడుతుంది. అది కేంద్రకమిటీకే బాధ్యురాలుగా వుంటుంది. యిలాంటి ఒక బ్యూరో అనవసరమని భావించినప్పుడు దానిని యితర బ్యూరోలతోగానీ,బ్యూరోతోగానీ కలిపివేయవచ్చును; లేదా రద్దుచేయవచ్చును.

## 28. నిబంధన

పార్టియొక్క వివిధరకాల కార్యక్రమాన్ని కొనసాగించుటకుగాను ఏ స్థాయికిజెందిన పార్టీ సంఘమైనప్పటికీ అది

తన పరిస్థితుల అవసరాలనుబట్టి తన ఏకత్రిత నాయకత్వము క్రింద డిపార్టుమెంటులను లేక కమీషన్లను (రాయబార సంఘాలను) పార్టీ వ్యవహారాలను నడిపించుటకు, ప్రచారాన్ని చేయుటకు, అధ్యయనతరగతులను నడుపుటకు, మిలిటరీ వ్యవహారాలను చూచుటకు ప్రజాకార్యక్రమాన్ని నడుపుటకు, ఆర్థిక వ్యవహారాలను జూచుటకు, – వివిధశాఖలను యేర్పాటు చేయవచ్చును.

ఏస్థాయికిజెందిన పార్టీకమిటీయైనా, తాత్కాలిక కార్యక్రమాన్ని సాగించుటకు, ప్రత్యేక కార్యక్రమాన్ని సాగించుటకు, తాత్కాలిక కమీషన్లను, లేక, డిపార్టుమెంటులను యేర్పాటుచేయువచ్చును,

## మూడవ అధ్యాయం

# పార్టీయొక్క కేంద్రసంఘం

### 29. నిబంధన

నేషనల్‌పార్టీ కాంగ్రెసును ఎప్పుడు జరుపాలన్న విషయాన్ని కేంద్రకమిటీ నిర్ణయించాలి. సమావేశాన్నిగూడా కేంద్రకమిటీయే జరుపాలి. సాధారణ పరిస్థితులలో మూడు సంవత్సరాల కొకపర్యాయం నేషనల్‌పార్టీ కాంగ్రెసును జరుపాలి. అసాధారణ పరిస్థితులలో దానిని వాయిదా వేయనైనా వేయవచ్చును, లేదా కేంద్రకమిటీ నిర్ణయం ప్రకారం ముందుగానైనా జరుపవచ్చును.

యావత్తు పార్టీయొక్క సభ్యుల సంఖ్యలో సగానికి పైబడిన సభ్యుల సంఖ్యకు ప్రాతినిధ్యం వహిస్తున్న క్రిందిపార్టీ సంఘాలు నేషనల్ పార్టీ కాంగ్రెసును జరుపాలని కోరితే తదనుసారంగా కేంద్రపార్టీ కమిటీ, నేషనల్ పార్టీ కాంగ్రెసును జరిపి తీరాలి.

యావత్తు పార్టీయొక్క సభ్యుల సంఖ్యలో సగానికి పైబడిన సభ్యుల సంఖ్యకు ప్రాతినిధ్యం వహిస్తున్న డెలిగేట్లు నేషనల్ పార్టీ కాంగ్రెసునకు హాజరైనప్పుడే దానికి విలువ వుంటుంది.

నేషనల్‌పార్టీకి హాజరుకావలసిన డెలిగేట్ల సంఖ్యను వారేవిధంగా ఎన్నుకోబడాలన్న విషయాన్ని కేంద్రకమిటీచే నిర్ణయించ బడుతుంది.

## 30. నిబంధన

నేషనల్‌పార్టీ కాంగ్రెసుయొక్క విధులు, హక్కులు యీ క్రిందివిధంగా వుంటాయి.

(1) కేంద్రకమిటీ యితర కేంద్రసంఘాలచే యివ్వబడిన రిపోర్టులను వినటం, చర్చించటం, తీసుకోవటం, బలపరచటం.

(2) పార్టీ కార్యక్రమాన్ని, పార్టీ నియమావళిని నిర్ణయించటం, సవరించటం.

(3) పార్టీపాలసీని, మూలసూత్రాలను నిర్ణయించటం.

(4) కేంద్రకమిటీని ఎన్నుకోవటం.

### 31. నిబంధన

కేంద్రకమిటీకి ఎంతమంది సభ్యు లుండాలన్న విష యాన్ని నేషనల్ పార్టి కాంగ్రెసు నిర్ణయించాలి. కేంద్రకమిటీ సభ్యులను నేషనల్ పార్టి కాంగ్రెసు ఎన్నుకోవాలి.

కేంద్రకమిటీలో ఖాళీలు ఏర్పడితే క్రమానుసారంగా కేంద్ర కమిటీయొక్క ఆల్టర్నేట్ మెంబర్లచే వాటిని భర్తీ చేయాలి.

### 32. నిబంధన

ఇతర రాజకీయపార్టీలు, సంఘాలతో సంబంధం పెట్టు కొనుటలో పార్టీకి ప్రతినిధిగా కేంద్రకమిటీ పనిజేస్తుంది. పార్టి పత్రికలను స్థాపిస్తుంది. వాటి కార్యకలాపాలను నడుపుతుంది. పార్టి కార్యకర్తల పంపకాన్ని చేస్తుంది.

### 33. నిబంధన

ఆరుమాసాల కొకపర్యాయం సెంట్రల్ పొలిటికల్ బ్యూరో (పొలిట్ బ్యూరో) విస్తృతసమావేశాన్ని జరుప వలసినదని కేంద్రకమిటీని ఆదేశిస్తుంది. ఏమైనప్పటికి పరిస్థితు లను బట్టి కేంద్ర పొలిటికల్ బ్యూరో (పొలిట్ బ్యూరో) విస్తృతసమావేశాన్ని వాయిదా వేయనైనా వేయవచ్చును, లేదా ముందుగా జరుపనైనా జరుపవచ్చును కేంద్రకమిటీ యొక్క ఆల్టర్నేట్ మెంబర్లు విస్తృతసమావేశానికి హాజరై తమ అభిప్రాయాలను చెప్పుకునేహక్కు వారికి వుంది.

### 34. నిబంధన

విస్తృతసమావేశంలో కేంద్రకమిటీ సెంట్రల్ పొలిటి

కల్ బ్యూరోను, కేంద్ర సెక్రటేరియట్‌నూ, కేంద్రకమిటీ అధ్యక్షుణ్ణీ ఎన్నుకోవాలి.

కేంద్ర పొలిటికల్ బ్యూరో, పార్టీయొక్క కేంద్ర నాయకత్వ సంఘంగా వ్యవహరిస్తుంది. కేంద్రకమిటీ యొక్క విస్తృతసమావేశాలు జరుగుటకు మధ్యనున్న కాలంలో పార్టీ పనినంతనూ నడుపుతుంది.

కేంద్రపొలిటికల్ బ్యూరో నిర్ణయాలను అనుసరించి కేంద్రకమిటీయొక్క దైనందిన కార్యక్రమాన్ని అంతనూ, కేంద్రసెక్రటేరియట్ నడుపుతుంది.

కేంద్రకమిటీయొక్క అధ్యక్షుడు, కేంద్రపొలిటికల్ బ్యూరో అధ్యక్షుడుగానూ, కేంద్రకమిటీ అధ్యక్షుడుగానూ వుంటాడు.

తనపని అవసరాల ననుసరించి, కేంద్రకమిటీ డిపార్టుమెంటులనూ (ఆర్గనైజేషన్ డిపార్టుమెంటు, ప్రాపగాండా లేక ప్రచారకడిపార్టుమెంటులాంటివాటినీ) కమీషన్లనూ (మిలిటరీ వ్యవహారాల కమీషన్ లేక సంఘం పార్టీపత్రికలకమీషను, లేక సంఘంలాంటివాటిని), యితరశాఖలను. అవి తమ తమ రంగాలలో కేంద్రపొలిటికల్ బ్యూరో, కేంద్రసెక్రటేరియట్ కేంద్రకమిటీ అధ్యక్షుని అధ్వర్యాన పర్యవేక్షణలక్రింద పనిజేయుటకు యేర్పరచవచ్చును.

35. నిబంధన

వర్తమానపరిస్థితులకు సంబంధించిన పార్టీపాలసీకి సంబంధించిన సమస్యలను చర్చించుటకు, నిర్ణయించుటకు క్రిందిపార్టీ కమిటీల ప్రతినిధులతో కూడిన నేషనల్ పార్టీ కాన్ఫ

రెన్సులను అనేకాన్ని ఒక నేషనల్ పార్టి కాంగ్రెసునకు మరియొకదానికి మధ్యగలకాలంలో కేంద్రకమిటీ జరుపవచ్చును.

## 36. నిబంధన

నూటికి కేంద్రకమిటీ క్రిందనున్న రాష్ట్రపార్టికమిటీల, సరిహద్దుప్రాంతీయ పార్టికమిటీల, తదితరపార్టికమిటీల విస్తృత సమావేశాలలో నేషనల్ పార్టి కాన్ఫరెన్సులకు ప్రతినిధులు ఎన్నుకొనబడుతారు. ఇలా ఎన్నుకొనబడే ప్రతినిధులసంఖ్యను కేంద్రకమిటీ నిర్ణయించాలి,

యావత్ దేశములోనున్న రాష్ట్రకమిటీల, సరిహద్దు ప్రాంతకమిటీల సంఖ్యలో సగానికి పైబడిన సంఖ్యకుజెందిన ప్రతినిధులు నేషనల్ పార్టి కాన్ఫరెన్సులకు హాజరుకావాలి.

## 37. నిబంధన

తమ విధులను నిర్వహించుటకు అసమర్థులైన పూర్తి లేక ఆల్టర్నేట్ కేంద్రకమిటీ సభ్యులను తొలగించుటకు వారి స్థానములలో వుపఎన్నికలు జరిపించి కేంద్ర కమిటీయొక్క ఆల్టర్నేట్ సభ్యులలో కొంతమందిని ఎన్నుకొనుటకు నేషనల్ పార్టి కాన్ఫరెన్సులకు అధికారముంది. అయితే ఏ ఒక్క కాన్ఫరెన్సులోను అలా తీసివేయబడిన పూర్తి కేంద్రకమిటీ సభ్యుల, కేంద్రకమిటీ ఆల్టర్నేట్ సభ్యుల సంఖ్యగానీ లేక అలా ఎన్నుకొనబడిన ఆల్టర్నేట్ సభ్యుల సంఖ్య కేంద్రకమిటీయొక్క పూర్తి మరియు ఆల్టర్నేట్ సభ్యుల మొత్తంలో ఐదవవంతును మించరాదు.

### 38. నిబంధన

నేషనల్ పార్టి కాన్ఫరెన్సులు చేసిన కేంద్ర కమిటీ యొక్క పూర్తి లేక ఆల్టర్నేట్ సభ్యుల తొలగింపునకు లేక ఎన్నికకు సంబంధించిన తీర్మానాలు, తదితర తీర్మానాలు కేంద్ర కమిటీ చే బలపరచబడిననాటినుండి అమలులోనున్నట్లు భావింపబడుతాయి.

కేంద్రకమిటీచే బలపరచబడిన నేషనల్ పార్టి కాన్ఫరెన్సుల తీర్మానాలన్నింటిని పార్టిసంఘాలన్నీ అమలుజరుపాలి.

## నాల్గవ అధ్యాయం

# పార్టీయొక్క రాష్ట్రసంఘాలు, - - సరిహద్దు ప్రాంతసంఘాలు

### 39. నిబంధన

రాష్ట్రపార్టిగానీ, లేక సరిహద్దుప్రాంత పార్టీ కాంగ్రెసుగాని, రాష్ట్రపార్టీ కమిటీగాని, లేక సరిహద్దుప్రాంత పార్టీ కమిటీగానీ, కేంద్రకమిటీ లేక దానికి ప్రాతినిధ్యం వహించే సంఘంయొక్క నాయకత్వానికి లోబడియుండాలి.

### 40. నిబంధన

రాష్ట్రపార్టీ కాంగ్రెసునుగాని లేక సరిహద్దు ప్రాంత పార్టీ కాంగ్రెసునుగానీ ఆయా రాష్ట్ర లేక సరిహద్దు ప్రాంత పార్టీ కమిటీలు రెండేళ్లకొకపర్యాయం యేర్పాటుచేయాలి.

అసాధారణ పరిస్థితులలో రాష్ట్రి లేక సరిహద్దు ప్రాంత పార్టీ కమిటీ కాంగ్రెసును నాయిదా వేయనైనా వేయవచ్చును. లేదా ముందుగానే జరుపవచ్చును. రాష్ట్రి లేక సరిహద్దు ప్రాంత పార్టీ కమిటీ తన అధ్వర్యం క్రిందనున్న క్రిందపార్టీ సంఘాల సంఖ్యలో సగానికి పైబడిన సంఖ్యను జెందిన సంఘాలు అలాంటి కాంగ్రెసును జరుపవలసినదిగా కోరినప్పుడుగానీ లేదా కేంద్రకమిటీ లేక దాని ప్రాతినిధ్య సంఘం అలాంటి కాంగ్రెసును జరుపవలసినదిగా కోరినప్పుడు యేర్పాటు చేయాలి.

రాష్ట్రిపార్టీకాంగ్రెసు లేక సరిహద్దుప్రాంత కాంగ్రెసుకు వుండవలసిన డెలిగేట్ల సంఖ్యను దాని ఎన్నికలపద్ధతిని, కేంద్రకమిటీ లేక దాని ప్రాతినిధ్యసంఘంయొక్క ఆమోదానికి లోబడి రాష్ట్రి లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీ నిర్ణయించాలి.

## 41. నిబంధన

రాష్ట్రి లేక సరిహద్దుప్రాంత పార్టీకాంగ్రెసు రాష్ట్రి లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీ రిపోర్టులనూ వాటికి సంబంధించిన రాష్ట్రి లేక సరిహద్దుప్రాంతాల యొక్క పార్టీపత్రికల రిపోర్టులనూ వినాలి, తీసుకోవాలి, చర్చించాలి, బలపరిచాలి; రాష్ట్రిం లేక సరిహద్దుప్రాంతమునకు సంబంధించిన వివిధ రకాల సమస్యలను, కార్యక్రమాలను చర్చించాలి, నిర్ణయించాలి. రాష్ట్రి లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీకి సభ్యులను ఎన్నుకోవాలి. నేషనల్ పార్టీ కాంగ్రెసునకు డెలిగేట్లను ఎన్నుకావాలి.

## 42. నిబంధన

రాష్ట్ర లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీ తన విస్తృత సమావేశంలో తన స్థాయీసంఘాన్ని (స్టాండింగ్ కమిటీ) సెక్రటరీని, సహాయకార్యదర్శినీ తనదైనందిన కార్యక్రమాన్ని కొనసాగించుకొనుటకై ఎన్నుకోవాలి. అలా ఎన్నుకోబడిన రాష్ట్ర లేక సరిహద్దుప్రాంతం పార్టీకమిటీయొక్క కార్యదర్శిని స్థాయీసంఘ సభ్యులను కేంద్రకమిటీ ఆమోదించాలి. కార్యదర్శిగా ఎన్నుకొనబడునాతడు అయిదు సంవత్సరాలకు పైబడిన కాలంనుండీ పార్టీసభ్యుడై వుండి వుండాలి.

కనీసం సంవత్సరానికి రెండుపర్యాయములు, రాష్ట్ర లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీ తన విస్తృత సమావేశాన్ని జరిపితీరాలి.

## 43. నిబంధన

రాష్ట్ర, లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీ తన రాష్ట్రం లేక సరిహద్దుప్రాంతంలో రాష్ట్ర లేక సరిహద్దుప్రాంత పార్టీ కాంగ్రెసుయొక్క తీర్మానాలను, కేంద్రశాఖలయొక్క తీర్మానాలను అమలుజరుపాలి. వివిధపార్టీసంఘాలను నెలకొల్పాలి; పార్టీకార్యకర్తలను వాటిల్లో నియమించాలి పార్టీఫండ్సును వాటికై వినియోగించాలి; పార్టీయేతరసంఘాలలోని పార్టీప్రాక్షన్లపనికి దిక్సూచికత్వం వహించాలి.

## 44. నిబంధన

రాష్ట్ర లేక సరిహద్దుప్రాంతపార్టీకాంగ్రెసుల మధ్య కాలంలో రాష్ట్ర లేక సరిహద్దుప్రాంతపార్టీకమిటీ తన రాష్ట్రం లేక సరిహద్దుప్రాంతాలలోని కార్యక్రమానికి సంబంధించిన

సమస్యలను చర్చించుటకు వాటిపై నిర్ణయాలు తీసుకొనుటకు ప్రాంతం. కౌంటీపార్టి కమిటీలు, యితరపార్టి కమిటీలు నూటిగా తన అధ్వర్యంక్రింద నున్నవాటినుండి ఎన్నుకొనబడిన డెలిగేట్లతో కూడిన రాష్ట్ర లేక సరిహద్దుప్రాంతపార్టి కాన్ఫరెన్సు లనేకాన్ని జరుపుకోవచ్చును.

రాష్ట్రం లేక సరిహద్దు ప్రాంతపార్టీ కాన్ఫరెన్సుకు, రాష్ట్ర లేక సరిహద్దు ప్రాంత పార్టి కమిటీసభ్యులలో కొంత మందిని తొలగించి, వారి స్థానంలో వుప ఎన్నికలద్వారా క్రొత్తసభ్యులను ఎన్నుకొనే హక్కువుంది. అయితే అలా తొలగింపబడిన లేక వుపఎన్నికలద్వారా ఎన్నుకోబడిన నూతన సభ్యుల సంఖ్య ఆకమిటీ సభ్యులమొత్తం సంఖ్యలో ఐదవ వంతుకన్న మించరాదు.

## 45. నిబంధన

రాష్ట్ర లేక సరిహద్దు ప్రాంత పార్టి కాన్ఫరెన్సుచే తీసుకొనబడిన నిర్ణయాలూ, ఆ కాన్ఫరెన్సుచే రాష్ట్ర లేక సరిహద్దు ప్రాంత పార్టి కమిటీయొక్క సభ్యులను తొలిగింపు వారి స్థానంలో నూతన సభ్యుల ఎన్నిక యనేవాటిని దానికి సంబంధించిన రాష్ట్రం లేక సరిహద్దు ప్రాంత పార్టి కమిటీ బల పరచినప్పటినుండియే అమలులో నున్నట్లు భావింపబడుతాయి

## ఐదవ అధ్యాయం

# ప్రాంతీయ, కౌంటీ, సిటీ, సబ్ జిల్లా పార్టీసంఘాలు

### 46. నిబంధన

పార్టి నియమావళిలోని నాల్గవఅధ్యాయంలో రాష్ట్రం లేక సరిహద్దు ప్రాంతాలయొక్క పార్టినిర్మాణం, కార్యక్రమాలను నడుపుటకై సూచించబడిన నిబంధనలే ప్రాంతం, కౌంటీ, సిటీ, లేక సబ్ జిల్లాపార్టి నిర్మాణానికి, కార్యక్రమానికి వర్తిస్తాయి. ఇందులో ప్రతిదీ దాని వున్నతపార్టి సంఘనాయకత్వం క్రింద వుంటుంది.

### 47. నిబంధన

రెండుసంవత్సరాల కొకపర్యాయం ప్రాంతీయ, కౌంటీ, సిటీ లేక సబ్ జిల్లాపార్టి కాంగ్రెసులను జరుపాలి. ఈ కాంగ్రెసులకు మధ్యకాలంలో అనేక పార్టి కాన్ఫరెన్సులను జరుపుకోవచ్చును.

### 48. నిబంధన

ప్రాంతీయ లేక పార్టికమిటీ సంవత్సరానికి నాలుగు పర్యాయాలు చొప్పున విస్తృత సమావేశాన్ని జరుపాలి. సిటీ లేక సబ్ జిల్లాకమిటీ మాసానికొకసారి విస్తృత సమావేశాన్ని జరుపాలి.

ప్రాంతీయ, సిటీ లేక సబ్ జిల్లా, కౌంటీపార్టి కమిటీల మెంబర్లను, కార్యదర్శి, సహాయకార్యదర్శి వీరందరినీ ఆయా

పార్టీకమిటీల వున్నతపార్టీసంఘాలు ఆమోదించాలి. (ఎన్నుకొనబడిన వారిని పార్టీ వున్నతసంఘాలు ఆమోదించాలని అర్థం) ప్రాంతీయ, కౌంటీ లేక సిటీకమిటీలయొక్క కార్యదర్శులుగా పనిజేయువారు గత మూడు సంవత్సరాలకు పైబడిన కాలంనుండీ పార్టీసభ్యులై వుండాలి. సబ్ జిల్లా పార్టీకమిటీ కార్యదర్శి గత ఒక సంవత్సరంనుండి పార్టీసభ్యుడైనవాడై యుండాలి. క్రొత్తగా విప్లవంవైపునకు వచ్చిన ప్రాంతాలలో స్థాపింపబడే పార్టీసంఘాల విషయంలో రాష్ట్రీ లేక సరిహద్దు ప్రాంత పార్టీకమిటీ ఆమోదాన్ని తీసుకొని పై నిబంధనలను సడలించవచ్చును.

## ౮ అవ అధ్యాయం

# పార్టీయొక్క మూలసంఘాలు

### 49. నిబంధన

పార్టీబ్రాంచి, పార్టీకి మూలసంఘం. ఏ ఫ్యాక్టరీలోగానీ, గనిలోగానీ గ్రామంలోగానీ, వ్యాపారసంస్థలోగానీ, వీధిలోగానీ, ఆర్మీకంపెనీలోగానీ, ఆఫీసులోగానీ, లేక బడిలోగానీ ఎక్కడైనాసరే ముగ్గురుపార్టీమెంబర్లువుంటే అంతకన్న ఎక్కువవున్నా ఇక్కడ ఒకపార్టీబ్రాంచీని యేర్పాటుచేయాలి. ముగ్గురుకన్న తక్కువసభ్యులుంటే వారు తమకు సమీపంలోనున్న పార్టీబ్రాంచిలో చేరాలి.

పార్టీబ్రాంచి యేర్పాటును కౌంటీ లేక సిటీపార్టీకమిటీ ఆమోదించాలి.

## 50. నిబంధన

సభ్యులసంఖ్య అమితంగావుంటే బ్రాంచిపార్టి కమిటీ అధ్వర్యాన సహజపరిస్థితులనుబట్టి నివసిస్తున్న ప్రదేశాన్ని బట్టి పనిపరిస్థితులనుబట్టి గ్రూపులను యేర్పాటుచేయవచ్చును. ప్రతిగ్రూపునకు ఒక గ్రూపులీడరును అవసరమైతే ఒక డిప్యూటీ-లీడరును ఎన్నుకోవాలి.

ఒకగ్రామంలో పార్టి మెంబర్లు, కాండిడేట్ మెంబర్లూ కలిసి యాభై గానీ అంతకు పైబడిన సభ్యులుంటే; ఒక ఫ్యాక్టరీలోగానీ, ఆఫీసులోగానీ, బడిలోగానీ పార్టిసభ్యులు వందమందిగానీ లేక అంతకు పైబడిగానీవుంటే అక్కడ పార్టి సాధారణ బ్రాంచిని యేర్పాటు చేయవచ్చును. పార్టి సాధారణ బ్రాంచీ అధ్వర్యాన నివాసాలు, షాపులు డిపార్టుమెంటులు, లేక వర్గాల ననుసరించి పార్టిసబ్ బ్రాంచీలను యేర్పాటు చేయాలి. పార్టి సబ్ బ్రాంచీకి పార్టియొక్క సామాన్య బ్రాంచిహోదా వుంటుంది.

## 51. నిబంధన

అయిదు వందలు, లేక అంతకు పైబడిన పార్టి సభ్యులు కాండిడేట్ మెంబర్లు కలిగియున్న పట్టణంలోగానీ, ఫ్యాక్టరీలో గానీ, ఆఫీసులోగానీ లేక బడిలోగానీ, రాష్ట్ర లేక సరిహద్దు ప్రాంత పార్టి కమిటీయొక్క ఆమోదంతో ఒక కమిటీని ఎన్నుకోవచ్చును. అలా ఎన్నుకోబడిన కమిటీ అధ్వర్యాన నివాసాలు, షాపులు, డిపార్టుమెంటులు లేక వర్గాల ననుసరించి పార్టి బ్రాంచీలను యేర్పాటుచేయాలి.

### 52. నిబంధన

పార్టీకి ప్రజలమధ్య అత్యంత సన్నిహిత సంబంధాన్ని గొనివచ్చుటకు పార్టి బ్రాంచి కృషిజేయాలి.

పార్టీ బ్రాంచి విధులు యీ క్రిందివి:—

(1) పార్టి దృక్పథాన్ని అమలు జరుపుటకు వున్నత పార్టి సంఘాల నిర్ణయాలను అమలు జరుపుటకు అసంఖ్యాక ప్రజానీకంలో ప్రచారాన్ని, నిర్మాణకార్యక్రమాన్ని సాగించాలి.

(2) ప్రజలడిమాండ్లు అభిప్రాయాలపై ఎల్లప్పుడూ దృష్టినుంచాలి; వారి అభిప్రాయాలను, డిమాండ్లనూ వున్నత పార్టిసంఘాలకు రిపోర్టుచేయాలి. ప్రజల రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక జీవితంపై దృష్టినుంచి దానిని అభివృద్ధిపరచుటకు కృషిజేయాలి. ప్రజలు తమ సమస్యలను తామే పరిష్కరించుకొనుటకై ప్రజలను సంఘటితపరచాలి.

(3) క్రొత్తసభ్యులను రిక్రూట్ చేయాలి. పార్టిసభ్యత్వ రుసుములను వసూలుజేయాలి. పార్టిమెంబర్ల రికార్డులను పరీక్షించుతూ వుండాలి. పార్టిమెంబర్లలో క్రమశిక్షణను అమలు జరిపించాలి.

(4) పార్టిసభ్యులకు అధ్యయనతరగతులను నడిపించాలి. వారిని అధ్యయనం జేయించాలి; శిక్షణ నివ్వాలి.

### 53. నిబంధన

పార్టిబ్రాంచి సాధారణసభ్యులు పార్టికమిటీని దైనందిన కార్యక్రమాన్ని సాగించుటకొరకై ఎన్నుకోవాలి. ఇలా ఎన్నుకోబడిన కమిటీ అరుమాసాలునుండి సంవత్సరంవరకూ

అధికారంలో వుంటుంది. బ్రాంచికమిటీ సభ్యులసంఖ్య పార్టి బ్రాంచి బలాన్నిబట్టి నిర్ణయించబడుతుంది. కనీసపుసంఖ్య మూడునుండి గరిష్ఠసంఖ్య పదకొండువరకూ వుంటుంది. కమిటీ ఒక స్క్రెటరీని అవసరమైతే అసిస్టెంటు స్క్రెటరీని ఎన్నుకోవాలి. యదార్థ అవసరాలనుబట్టి కమిటిచే కమిటీ సభ్యుల మధ్య శ్రమ విభజన యేర్పాటు చేయబడాలి.

ఏడుగురుకన్న తక్కువమంది పార్టి సభ్యులను కలిగిన పార్టి బ్రాంచి ఒక స్క్రెటరీని లేక ఒక స్క్రెటరీ ఒక అసిస్టెంట్ స్క్రెటరీని మాత్రమే ఎన్నుకోవాలి. అంతేగాని పార్టి బ్రాంచి కమిటీని యేర్పాటు చేయరాదు.

## ఏడవ అధ్యాయం

# పార్టీయొక్క రహస్య సంఘాలు

### 54. నిబంధన

పార్టీ బహిరంగంగా వుండి పనిచేయుటకు వీలుగాని ప్రాంతాలలో అది యేవిధమైన రహస్యనిర్మాణ రూపాలను అవలంబించాలో, ఏరకమైన పనిపద్ధతులను అవలంబించాలో అన్నవిషయాన్ని పార్టీనియమావళి ననుసరించి కేంద్రకమిటీ ప్రత్యేక తీర్మానాలను చేస్తుంది. పార్టీయొక్క రహస్యసంఘాలకు యీ నియమావళిలోని యే నిర్మాణరూపమైనా పని పద్ధతియైనా అవర్తనీయమైతే దానిని మార్పుజేసుకోవచ్చును.

### 55. నిబంధన

నూతన పార్టీసభ్యుని జేర్చుకొనేటప్పుడు రహస్యంగా వుంటున్న పార్టీసంఘం అతనినిగురించి జాగ్రత్తగా సమాచారాన్ని సేకరించి మరీ జేర్చుకోవాలి. రహస్య పరిస్థితులలో పార్టీలోనికి తీసుకొనబడుటకు ఏ షరతులు పెట్టబడివుంటాయో వాటన్నిటినీ పూర్తిజేసిన తర్వాతనే పార్టీసభ్యుడుగా రహస్యంగా వ్యవహరిస్తున్న పార్టీలోనికి తీసుకొనబడుతాడు.

## ఎనిమిదవ అధ్యాయం

# పార్టీ కంట్రోల్ శాఖలు

### 56. నిబంధన

అవసరమని తోచినప్పుడు, పార్టీ కేంద్రకమిటీ, ఒక కేంద్ర కంట్రోల్ కమిషన్‌నూ క్రింద కంట్రోల్ కమిషన్లనూ యేర్పాటు చేయవచ్చును.

### 57. నిబంధన

కేంద్రకమిటీ తన విస్తృత సమావేశంలో కేంద్ర కంట్రోల్ కమిషనును ఎన్నుకోవాలి. క్రిందిపార్టీ సంఘం యొక్క కంట్రోలు కమిషను క్రింది పార్టీ కమిటీయొక్క విస్తృత సమావేశంలో ఎన్నుకొనబడాలి. అది తనకన్న పైపార్టీ సంఘంయొక్క ఆమోదాన్ని పొందాలి.

### 58. నిబంధన

కేంద్ర కంట్రోల్ కమిషనల, క్రింది కంట్రోల్ కమి

షనల విధులు, హక్కులూ యేమంటే, పార్టి మెంబర్లపై క్రమ శిక్షణ చర్య తీసుకోవటం లేక తీసుకొనబడిన క్రమ శిక్షణ చర్యలను రద్దుచేయుటం, పార్టీ మెంబర్ల కంప్లెయింట్లను విచారించటం అనేవి.

### 59. నిబంధన

ఆయా స్థాయీలకు జెందిన కంట్రోల్ కమిషన్లు అదే స్థాయీలకు జెందిన పార్టి కమిటీల అధ్వర్యాన పని జేయాలి.

## తొమ్మిదవ అధ్యాయం

# పార్టీయేతర సంఘాలలో పార్టీఫ్రాక్షన్లు

### 60. నిబంధన

ప్రధాన ప్రభుత్వశాఖలోగానీ, కార్మికసంఘంలోగానీ, రైతుసంఘంలోగానీ, సహకారసంఘంలోగాని లేక యితర ప్రజాసంఘంలోగానీ బాధ్యతాయుతస్థానాలలో నున్నవారు ముగ్గురు పార్టీసభ్యులుంటే అక్కడొక పార్టీఫ్రాక్షనును యేర్పాటుచేయాలి. అలాంటిసంఘంయొక్క నాయకత్వసంఘంలోని పార్టీఫ్రాక్షనుయొక్క కర్తవ్యమేమంటే ఆ పార్టీ పలుకుబడిని బలపరచటకు పార్టీపాలసీని సాగించుటకు, ఆ నాయకత్వ సంఘంలోని పార్టీసభ్యులకు దిక్సూచికత్వాన్ని యివ్వటం.

### 61. నిబంధన

పార్టీ ప్రాక్షను ఒక సెక్రటరీని కలిగియుండాలి. పది అంతకుపై బడిన సభ్యులు కలిగిన పార్టీ ప్రాక్షను తన దైనందిన కార్యక్రమాన్ని కొనసాగించుటకు ఒక వర్కింగ్ కమిటీని యేర్పాటుచేసుకోవాలి.

ఈ ప్రాక్షనుకు సంబంధించిన పార్టీ కమిటీ యీ ప్రాక్షనుకు ఒక సెక్రటరీని, వర్కింగ్ కమిటీ సభ్యులను నియమిస్తుంది.

### 62. నిబంధన

పార్టీయేతర సంఘాలలోని పార్టీ ప్రాక్షన్లను, వాటి స్థాయిలకు సంబంధించిన పార్టీ కమిటీల నాయకత్వం క్రింద వుంచాలి; ఆ పార్టీ కమిటీల నిర్ణయాలను ఆ ప్రాక్షన్లు అమలు జరుపాలి;

అన్ని స్థాయిాలకు జెందిన పార్టీ కమిటీలు, ప్రధానమైన పార్టీ ప్రాక్షన్లకు జెందిన బాధ్యతాయుతస్థానాలలోనున్న సభ్యులను తమ మీాటింగులకు ఆహ్వానించవచ్చును.

## పదో అధ్యాయం

## ప్రశంస: క్రమశిక్షణలు

### 63. నిబంధన

నిర్మాణ కార్యక్రిమంలో పార్టీ ఆశయానికి, ప్రజల ఆశయానికి పరిపూర్ణ విశ్వాసాన్ని ప్రదర్శించినందులకు పార్టీ విప్లవాత్మక ప్రభుత్వముల క్రమశిక్షణను ఆదర్శవంతముగా

అమలుజరిపినందులకు పార్టీ కార్యక్రమాన్ని పార్టి పాలసీనీ తమ వున్నత పార్టీసంఘాల కేంద్రకమిటీల నిర్ణయాలను కొనసాగించుటలో విశిష్టాత్మకమైన చొరవను చూపించినందులకు పార్టీయిచ్చిన పనులను పూర్తిజేయుటలో విశిష్ట విజయాన్ని పొందినందులకు, ప్రజల యదార్థసపోర్టును పొందినందులకు ఆ పార్టీ మెంబర్లనుగానీ, లేక ఆ పార్టి సంఘాన్నిగానీ ప్రశంసించవచ్చును.

## 64. నిబంధన

వున్నత పార్టిసంఘ నిర్ణయాలను అమలు జరుపకపోయినా లేక కేంద్రకమిటీ నిర్ణయాలను అమలుజరుపకపోయినా లేక పార్టి నియమావళినిగానీ, పార్టి క్రమశిక్షణనుగాని ఉల్లంఘించినా అన్నిస్థాయిాలకుజెందిన పార్టి సంఘాలు, యదార్థ పరిస్థితుల ననుసరించి యీ క్రింది క్రమశిక్షణ చర్యలను తీసుకొనవచ్చును.

(1) పార్టి సంఘం యావత్తుకూ అనువర్తించే క్రమశిక్షణ చర్య లేవంటే, చీవాట్లు పెట్టటం, దాని నాయకత్వ సంఘంలో కొంతభాగాన్ని మరల నిర్మించటం, తాత్కాలిక నాయకత్వ సంఘాన్ని నియోగించటం లేక యావత్తు పార్టి సంఘాన్ని రద్దుజేయటం, దాని సభ్యత్వాన్ని మరల రిజిస్టరు చేయటం.

(2) పార్టి మెంబరునకు వర్తించే క్రమశిక్షణ చర్యలు యేవంటే: చాటుగా పిలిచి చీవాట్లు పెట్టటం, లేక హెచ్చరించటం బహిరంగంగా చీవాట్లు పెట్టటం లేక బహిరంగంగా హెచ్చరించటం, అతని కివ్వబడిన పనినుండి అతనిని తొలగిం

చటం, పార్టీబేషనుమీద వుంచటం (తాత్కాలిక పనివానిగా వుంచటం) లేక పార్టీనుండి వెళ్ళగొట్టటం అనేవి.

65. నిబంధన

పార్టీ కేంద్రకమిటీయొక్క పూర్తి సభ్యుడుగానీ, ఆల్టర్నేట్ సభ్యుడుగానీ, పార్టీ క్రమశిక్షణను తీవ్రంగా వుల్లంఘిస్తే, అట్టివానిని పార్టీ కేంద్రకమిటీనుండి తొలగించుటకూ, పార్టీనుండి వెళ్ళగొట్టుటకుకూడా, పార్టీ కేంద్రకమిటీకి అధికారముంది. అలాంటి చర్యలు అమలులోనికి వచ్చే ముందు కేంద్రకమిటీయొక్క యావత్తు సభ్యత్వంలోని మూడింట రెండువంతుల మంది సభ్యుల ఆమోదాన్ని పొందాలి.

66. నిబంధన

క్రమశిక్షణచర్య తీసుకొనబడిన పార్టీసంఘానికిగానీ లేక పార్టీమెంబరునకుగానీ తమమీద ఎందువలన క్రమశిక్షణ చర్య తీసుకోబడినదో యన్న విషయాన్ని తెలియపరచాలి. ఆ విధంగా క్రమశిక్షణచర్యకు గురియైన మెంబరుగానీ, పార్టీ సంఘంగానీ తమపై తీసుకోబడిన క్రమశిక్షణ అన్యాయమని భావిస్తే ఆ నిర్ణయాన్ని సవాలు జేయవచ్చును. తమ విషయాన్ని మరల విచారించవలసినదిగా కోరవచ్చును; లేక వున్నతపార్టీ సంఘానికి అప్పీలు జేసుకోవచ్చును. తగిన స్థాయిలకు జెందిన పార్టీకమిటీలు ఆలస్యం చేయకుండా అలాంటి అప్పీళ్ళను పైసంఘాలకు పంపాలి. అలాంటి అప్పీళ్ళను ఆటంకపరచటంగానీ లేక అణచివేయటంగానీ సహించబడదు.

## 67. నిబంధన

పార్టీనుండి వెళ్ళగొట్టమనేది పార్టి ఆంతరంగిక క్రమశిక్షణ చర్యలలో వున్నతమైనది. అలాంటినిర్ణయాన్ని జేసేటప్పుడుగానీ లేక అలాంటి చర్యకు తను ఆమోదాన్ని యిచ్చేటప్పుడుగానీ పార్టిసంఘాలు అత్యంతజాగ్రితగా ఆలోచించాలి. క్రిమశిక్షణచర్య తీసుకోనబడిన పార్టి మెంబరుయొక్క అప్పీలును జాగ్రితగావినాలి. అతను యే పరిస్థితులలో పొరపాట్లు జేసినదీ వివరించుకోవాలి.

## 68. నిబంధన

ఒక పార్టి మెంబరును ప్రశంసించుటలోగానీ, లేక అతనిపై క్రిమశిక్షణచర్యను తీసుకోనుటలోగానీ పార్టియొక్క యదార్థ లక్ష్యమేమంటే పార్టి సభ్యులందరికీ ప్రజలందరికీ శిక్షగరపుటకూ అంతేగాక ప్రశంసించబడిన, లేక క్రిమశిక్షణ చర్య తీసుకోనబడిన పార్టి సభ్యునకుగూడా శిక్షగరపుటకు లక్షించబడిందని అర్థం. అంతేగాని వ్యక్తిగత అహంకారాన్ని ప్రోత్సహించుటకుగానీ, కఠిన శిక్షను గురిచేయుటగానీ లక్షించబడినట్టివిగావని అర్థంజేసుకోవాలి. అద్భుతమైన రికార్డులుకలిగిన పార్టి మెంబర్లను పార్టి ప్రశంసించుటయనేది పార్టిలో ఆదర్శవంతమైన పని విధానాన్ని స్థాపించుటకు, పార్టి సభ్యుల కొరకు ఆదర్శప్రమాణాన్ని ఏర్పరచుటకు లక్షింపబడుతుంది. తప్పులుజేసిన పార్టిమెంబర్లపై చేయబడే విమర్శలు, తీసుకోనబడే క్రిమశిక్షణ చర్యలు యితరులకు హెచ్చరికగానుండుటకు వారు తమ తప్పులను అధిగమించుటకై సహాయపడుటకు వారిని రక్షించుటకు ఉద్దేశింపబడ్డాయి.

## పదకొండో అధ్యాయం

# పార్టీ ఫండ్సు

### 69. నిబంధన

పార్టీసభ్యత్వ రుసుములచేతనూ పార్టీచే నడుపబడే వృత్తిసంస్థలు, ఆర్థికసంస్థలనుండి వచ్చే ఆదాయంచేతనూ, పార్టీయేతరులిచ్చే చందాలు, విరాళాలచేతనూ పార్టీకి ఆదాయం చేకూర్చబడుతుంది.

### 70. నిబంధన

పార్టీమెంబర్లు కాండిడేట్ మెంబర్లు యెంతెంత పార్టీ సభ్యత్వ రుసుమును చెల్లించుకోవాలో అన్న విషయాన్ని ప్రతిరాష్ట్ర, లేక సరిహద్దుప్రాంత పార్టీకమిటీచే లేక అదే హోదాకు జెందిన పార్టీకమిటీచే నిర్ణయించబడుతుంది, అమలు జరుపబడుతుంది.

## నోట్సు

1. చెన్-తూ-హిస్యూ-యిజం:— 1921-27 వరకూ చైనా కమ్యూనిస్టు పార్టీకి చెన్-తూ-హిస్యూ, సెక్రెటరీ జనరల్, అతడు అవలంబించిన మితవాద అవకాశవాద పంథాను, చెన్-తూ-హిస్యూ-యిజం, అంటారు. శ్రామిక వర్గ నాయకత్వాన్ని వదలివేయాలనీ, ఆవిధంగా అసంఖ్యాకులైన

కార్మిక-కర్షకుల ప్రయోజనాలను బలిపెట్టి బూర్జువా వర్గంతో సామరస్యంగా బ్రతుకాలనీ అతడు వాదించేడు. 1927 సంవత్సరంలో చెన్-తూ-హిస్యూ, చైనా విప్లవానికి ద్రోహం జరిగినతర్వాత లిక్విడేటరుగా (దివాళాకోరుగా) తయారయ్యేడు. చిట్టచివరకు, చెన్-తూ-హిస్యూ, చైనాదేశపు ట్రాట్స్కియిస్టులతో చేతులు కలిపేడు. బహిరంగంగా విప్లవ వ్యతిరేకిగా తయారయ్యేడు.

2. కూటైన్ కాన్ఫరెన్సు:— 1929 డిసెంబరులో, పశ్చిమ ఫ్యూకైన్‌లోనున్న కూటైన్ అను పట్టణంలో నాల్గవ ఎర్రసైన్యంలోనున్న కమ్యూనిస్టుపార్టి సంఘం తన 9 వ పార్టి కాంగ్రెసును జరుపుకొంది. ఈ కాంగ్రెసు సైన్యంలోగల, వివిధ శ్రామిక వర్గేతర పెడమార్గాలను సమీక్షించింది కామ్రేడ్ మాసీటూంగ్ చే తయారు జేయుబడిన తీర్మానాన్ని ఆమోదించింది. ఈ కాంగ్రెసు అత్యద్భుతమైన చారిత్రిక ప్రాధాన్యతను గలిగియుంది. ఎందువల్లనంటే కామ్రేడ్ మాసీటూంగ్ నాయకత్వాన నడుస్తున్న చైనా కమ్యూనిస్టు పార్టీ తాను నడుపుతున్న సైన్యాన్ని యుద్ధస్వాములతత్వపు పెట్టీ బూర్జువావర్గీయు పెడమార్గాలనుండి విముక్తి జెందించి, ప్రజలతో అత్యంత సన్నిహితంగా ముడిపెట్ట బడిన సుశిక్షిత సైన్యంగా శ్రామికవర్గ సిద్ధాంతంచే దిశానిర్దేశిత మవుచున్న సైన్యంగా పెంపొందించింది.

3. లీలీసాన్ పంథా:— కామ్రేడ్ లీలీసాన్ చే ప్రాతినిధ్యం వహించబడిన ఒక రకపు "వామపక్ష" అవకాశవాద

పంథా. పోరాడుతున్న శక్తుల బలతారతమ్యాన్ని సరిగా అంచనా వేయవలసిన అవసరాన్ని నిరాకరించుట యనేది దీని విశిష్టవైఖరి ప్రతిప్రజా విప్లవ కార్యాచరణలోనూ వివిధవర్గాల మధ్య సంబంధాన్ని సవ్యంగా అంచనావేయవలసిన అవసరాన్ని నిరాకరించుట యనేది దీని విశిష్టవైఖరి. ప్రధాన పట్టణాలలో శత్రువు ప్రారంభించిన రాక్షసకృత్యాలకు వ్యతిరేకంగా ప్రధాన పట్టణాలలో సాయుధతిరుగుబాట్లుగొనిరావాలని దుందుడుగా యీ తత్వం ప్రబోధించింది. కొంతకాలమైన తర్వాత కామ్రేడ్ లీలీసాన్ తన తప్పులను వప్పుకొని సరిజేసుకొన్నాడు.

4. మౌంటెన్-టాప్-యిజం:—పర్వతశిఖరాగ్రతత్వం లేక శిఖరాగ్రతత్వం. సెక్షనల్ ప్రయోజనాలకన్న ప్రధానంగా జూచునట్టి స్థానిక పాక్షిక తత్వానికి ఒక రూపమిది. దీని విశిష్టవైఖరులలో ఒకటి యేమంటే తన వూరికి జెందిన కామ్రేడ్సు, కార్యకర్తలపట్ల చక్కగా ప్రవర్తించటం, ఇతర ప్రదేశాలకు జెందిన కామ్రేడ్సు, కార్యకర్తలపట్ల పెడముగం పెట్టటం. గ్రామీణజిల్లాలలోని విప్లవాత్మక స్థావరాలు గెరిల్లా యుద్ధ దీర్ఘసంవత్సరాలలో ఒకదానితో మరియొకటి సంబంధం లేకుండా యుండుటవల్ల యీ పాక్షికధోరణి జనించింది. విప్లవాత్మక స్థావరాలు విశేషంగా పర్వతప్రాంతాలలోవుండేవి. అందువలన యీ పాక్షిక తత్వరూపానికి పర్వతశిఖరాగ్రతత్వమని పేరు వచ్చింది.

5. రెక్టిఫికేషన్ ఆఫ్ త్రీ స్టయిల్స్:— "మూడువిధానాల సవరింపుద్యమం." కామ్రేడ్ మాసీయాంగ్ నాయకత్వం క్రింద చైనా కమ్యూనిస్టుపార్టీ యొక్క కేంద్రకమిటీ 1941-42 సంవత్సరాలలో యీ వుద్యమాన్ని ప్రారంభించింది. వివిధరంగాలలో పనిజేస్తున్న కామ్రేడ్సులో ద్యోతకమైన అపసవ్య భావాలను, వారు ప్రదర్శిస్తున్న అపసవ్య ఆచరణలను సవరించుటకై లక్ష్యింపబడిన యావత్తు పార్టీలోనూ సాగించబడిన సైద్ధాంతిక పునర్నిర్మాణ వుద్యమమది. ఆ అపసవ్య భావాలు, ఆచరణల ప్రధాన లక్షణా లేమంటే పార్టీనిర్మాణ కార్యక్రమంలో పాక్షికతత్వం, అధ్యయనం విషయంలో పిడివాదం, ప్రచారక కార్యక్రమంలో ఫార్మలిజం (బాహ్య నియమ నిష్టత్వం లేక, గాఢత్వం లేకపోవటం).

—



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B123 |
| పుస్తకం పేరు | పార్టీనిర్మాణం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 249 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 248 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Rohith |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |